అంతర భారతీయ పుస్తకమాల

# పంజాబు కథలు

సంపాదకులు :

హరిభజన్ సింగ్

అనువాదం :

పిన్నింతి సత్యనారాయణ

నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ప్రథమ ముద్రణ : 1982 (శక 1903)
ద్వితీయ ముద్రణ : 1990 (శక 1912)



**రూ. 13.00**

*Original Title in Punjabi :* Kissa Punjab
*Compiled by Haribhajan Singh*
*Telugu Translation :* Panjabu Kathalu

డైరక్టరు, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా
ఎ-5, గ్రీన్ పార్కు, కొత్త ఢిల్లీ-110 016 చే ప్రచురింపబడినది.

# భూమిక

పంజాబీభాష, పంజాబీ సంస్కృతుల్లో తమ మాతృ భూమికి అతి సన్నిహితంగా వుండాలనే ఆసక్తి ఎక్కువగా గోచరిస్తుంది. పంజాబీదేశీయులు సభ్యతలో నున్న ప్రతి క్రొత్త పోకడను-జటిలంగానున్న అంశాన్ని సైతం ఆకళింపు చేసికొనడానికి సంసిద్ధులు. అయినా, వారు ఆదినుండి అనుస్యూతంగా వస్తున్న సామాన్య జీవిత పరిపాటి యెడల అచంచల విశ్వాసం కలిగి వుంటారనుటలో సందేహంలేదు. ధార్మికవిధానం; కళలు ఈ రెండు రంగాలు ఈ సామాన్యతకు చక్కని తార్కాణాలు. పంజాబీ ధరాతలంలో జన్మించిన ధర్మ, నృత్య-సంగీతాలు కవిత్వం స్థాపత్యకళల్లో మనకు ఎలాంటి అస్పష్టత కనబడదు. ఆధునిక విజ్ఞానంలో అతి చురుగ్గా ముందుకుసాగే పంజాబుదేశం ఏదో సామాన్య జీవనవిధానం వల్లనే స్థిరపడగలుగుతున్నది. ఈ సామాన్య జీవన విధానం ప్రాచీనకాలం నాటి నుండి తన గంభీర పరంపరలో వేళ్ళు నాటుకొని సుస్థిరమయింది.

ఆధునికత-ప్రాచీన పరంపరల సహజ సంగమమే పంజాబీ కథానికల్లో గల ప్రత్యేక విశిష్ఠత. మధ్యయుగంలో విదేశాలనుండి భారతదేశంపై దండెత్తి వచ్చిన ఆక్రమణ దారుల సభ్యతా-సంస్కృతుల నుండి పంజాబు తాను కోరుకున్నది గ్రహించింది. అయినా, ఇతర సభ్యతనుండి స్వీకరించిన దానిని తన కను

గుణంగా మలచుకొంటూ వచ్చింది. ఈనాడు పంజాబీ సభ్యతకు మూలరూపం దేశీయమైనదా లేక విదేశీయమైనదా యని గుర్తించడం కష్టతరం: మనం పంజాబీ భాషను పరిశీలిస్తే పంజాబుపదం విదేశీ శబ్దం అని తెలుస్తుంది. ఇది కవిత్వపు సుకుమార రూపంలో విదేశీ ఆక్రమణ దారులతోబాటే పంజాబుకు సంక్రమించి వుండవచ్చు. అచ్చటి కవులు తమ-మాతృభూమి నుంచి తీసికొని, హీర్-రాంఝూ. మిరజా-సాహిబాం సోహనీ-మహీవాల్, సస్సీ-పున్నూ పూరన్‌భగత్, రాజా రసాలూ లాంటి ప్రేమగాధలను మనోహర శైలిలో రచించారు. వాటికి పంజాబు దేశం ఎంతో ఋణపడి ఉంది. నేడు ఈ కథలు లేకుండా పంజాబు కావ్యపరం పరను ఊహించడమే కష్టసాధ్యం. పంజాబుదేశం పరదేశీయులను కూడ ఎంతో ఆత్మీయభావంతో తన కుటుంబ సభ్యులుగా స్వీకరించింది. సోహనీ-మహీవాల్, సస్సీ-పున్నూ కథానాయకులను గమనిస్తే ఈ విషయం మనకు బోధపడుతుంది. గుజరాత్‌కు సమీపంలో వున్న కుమ్మరికన్య సోహనీ ప్రేమపాశంతో బంధించబడి పంజాబులో గేదెలను మేపే పశువుల కాపరిగా మారిన మహీవాల్ మధ్య ఆశియాకు చెందిన రాజవంశీయుడు. అతడు ప్రేమమూర్తి; ఉదారహృదయుడు; నిరుపమాన సుందరాకారుడు. ఇదే విధంగా సస్సీకూడ చాకలికుటుంబంలో పెరిగి పెద్దదయింది. ఆమె ప్రియుడు పున్నూ-బెలూచిస్థాన్‌కు చెందిన పరదేశీయుడు. అతను సుదీర్ఘ ఎడారిప్రదేశంలో పయనించి—పంజాబు చేరుకున్నాడు. సైతీ ప్రియుడు మురాద్ సైతం బెలూచిస్థాన్‌కు చెందిన వాడే. తనహృదయ భావానికి సన్నిహితంగా వున్న కథానికలలో కూడా పంజాబీకవులు పరదేశీయులను తమరచనలలో కథానాయకులుగా తీసుకొని వారిని అమరులుగా చిత్రించారు. ఇదే పంజాబీ జీవన విధానం పంజాబీ కథల్లోగల సహజమైన విశేషత. ఈ కథానికల్లో ఎక్కడా స్వదేశ—విదేశ భావాల మధ్య సంఘర్షణ తలయెత్తకపోవడం మరీ విచిత్రంగా వుంటుంది. పరదేశీయుడనే నెపంతో ఎవ్వరినీ నాయకపాత్రనుంచి ప్రక్కకు నెట్టివేయలేదు. పున్నూతో సస్సీ వివాహం ఆమె తండ్రి ఎంతో సంతోషంగా జరుపుతాడు. పంజాబేతరుణ్ణి స్వభావానికినుగుణంగా మలచికొనుట అతణ్ణి తమ కుటుంబంలో ఒకభాగంగా రూపొందించుకొనుట—అనే విషయం కేవలం పంజాబు కవితారంగంవరకు పరిమితంగాక సమస్త పంజాబు జీవిత విశిష్టతగా రూపొందింది. పంజాబీభాష స్థాపత్యకళ, పంజాబీసంగీత కళల్లో కూడా ఈ విశిష్టత కొట్టవచ్చినట్లు గోచరిస్తుంది. ఇదే పంజాబుదేశం నిరంతర వికాసంలోగల సహజ సిద్ధమైన విలక్షణగుణం.

పంజాబు కథానికలు పరదేశీయుల్ని పంజాబీయులుగా రూపొందించడమే గాక పంజాబు దేశపు నవయువకులను సైతం పరదేశాల్లో ప్రేమికులుగా రూపొందినట్టు చూపెడతాయి. పంజాబు కథలు మధ్యయుగానికి చెందిన సాహితీ సంపత్తి. రైలుబండ్లు, రోడ్లు ఓడలు మొదలయిన రాక పోకల సాధనాలు లేని కాలంలోకూడా వందలు వేలాది క్రోసులదూరం ఎంతో దూరంగా కనబడదు. నదులపై ఆనాడు వంతెనలు లేవు. శ్రావణమాసపు పొంగిపొరలే నదులను దాటడం; జ్యేష్ట-ఆషాఢ మాసపు మండుటెండల్లో సుదీర్ఘ ఎడారులలో ప్రయాణంచేయడం-సామాన్యవిషయం కాదు. అది కష్టతరమైనపని. "జా ధీయే రావీ, నా కోయీ ఆవీ నా కోయీ జావీ" — [అమ్మాయీ! రావీ నదిని దాటే నిన్నుకలసికొనడానికి ఎవరూరాలేదు. ఆవలి గట్టునుండి ఎవ్వడూ ఈవలి గట్టుకు రాలేదు.] ఈ సామెత శతాబ్దాల తరబడిగా ప్రజలలో పాతుకుపోయింది. ఆనాడు మనకు నదిఆవలిఒడ్డు పరదేశమన్నది నగ్నసత్యం. ఈ రకమైన సామాన్య ప్రజాచైతన్యపు వాతావరణంలో హీర్-రాంఝూల ప్రేమగాథ తన అస్థిత్వానికి మెరుగులు దిద్దుకొన్నది. పంజాబు కథానికల్లోని నాయకులంతా బాటసారులుగానే కనబడతారు. పంజాబుదేశపు ప్రేమ భావన-బాటసారి విధానానికి ప్రగాఢ సంబంధం ఉంది. తన ఇల్లూ-వాకిలి విడచి రాంఝూ తన చేతిబెత్తం పుచ్చుకొని వేదన భరిత ఆవేశంతో ఇలా అంటాడు:

> రాంఝూ ఆఖదా ఏహ్ జహాన్ సుపేనా,
> మర్ జా వణా ఈ నైనాఁ యేసీ,
> తేరే జయేపి ఆరియాఁ ఏహ్ ఆజమ్,
> ఆయే గయే ముసాఫిరాఁ పాలీ యేసీ॥

బాటసారీ విధానం—ప్రేమ ఈ రెంటిమధ్యా అవినాభావ సంబంధాన్ని వారిషాహ్ కవి జోడించాడు. తద్వారా ఆ మహాకవి పంజాబు దేశచరిత్ర ప్రగాఢంగా నిద్రాణమైవున్న కాలంపైపు సంకేత మాత్రంగా చూపుతాడు. పంజాబు కథల్లోని నాయకులేగాక లోకకల్యాణార్థమై జీవితాన్ని గడిపిన జాతీయ నాయకులుకూడా తమ గృహాన్ని త్యజించగలిగినప్పుడే పంజాబీయుల ప్రేమ పద్ధతికి తగిన యోగులుగా గుర్తించబడతారు. పంజాబుదేశపు సర్వోత్తమ జాతీయ నాయకుడు

గురునానక్ జీవితమే దీనికి మహోజ్జ్వల తార్కాణం. ఆయన కర్మప్రధానమైన జీవితంలో అధికభాగం దేశపునలుమూలలా పర్యటన చేయుటలోనే గడచిపోయింది. పంజాబుదేశపు సంస్కృతీ-స్వాతంత్ర్య సంరక్షణార్థం పోరాటం సలిపిన గురు గోవిందసింగ్ సైతం తనయావజ్జీవితం స్వదేశం, మాయాను విడచి దూర ప్రదేశాల్లోనే గడిపాడు. నాటినుంచి పరంపరాగతంగా వస్తున్న బాటసారీ విధానం— లేదా పర్యటన పద్ధతి నేటి పంజాబు దేశవాసులను యాత్రచేయటానికై ప్రోత్సాహిస్తూనేవుంది. వారు పరదేశాల యాత్రకై ఎల్లవేళలా ఉవ్విళ్లూరుతునే వుంటారు. పంజాబీయుల సహజ విశిష్టప్రతిభ తమ యింటిని విడచి సుదూర ప్రాంతాలను పర్యటించగలిగినప్పుడే ప్రామాణికమైన ప్రకాశాన్ని సాధించగలుగుతుంది. ప్రేమ గాథలనాయకులు రాంఝూ లాంటివారు తమగృహాలకు దూరంగావుండి తమజీవిత లీలలను మనకు చూపగలిగారు. పూరనభగత్ రాజా రసాలూ దుల్లాభట్టీ ఆదిగా గల భక్తులు, సాహసోపేతనాయకులు కూడా. ఇదే పంథాలో పయనించినట్లుగా తెలుస్తుంది. పూరన్ సవతితల్లి కామాంధతా ప్రభావానికి గురియై తనయింటికి దూరమైపోయాడు. కాని రాజారసాలూ తన ఇచ్ఛానుసారం ఇంటిని వదలివెళ్ళిపోయాడు. యోగనిష్టాపరులుగా జీవితాలను గడపాలనే కాంక్ష వున్నప్పటికీ వీరికే ప్రేమలభించింది. రాణి సుందరాం పూరన్‌ను తన ప్రియునిగా చేసికోవాలని ఎంతో ప్రయత్నించింది. కేవలం స్త్రీశాసనం సాగుతున్న రాజ్యానికి ఆమెరాణి. దీనినిబట్టి పంజాబు వెలుపల ఏదో ఒక ప్రాంతానికి సంకేతంగా ఇది కనబడుతోంది. దుల్లా పంజాబులోనే పుట్టి పంజాబులోనే పెరిగి పెద్దవాడయ్యాడు. అతని జీవితం యావత్తూ పంజాబులోనే గడచింది. కాని అతను తనయింట కూర్చొని చేసేపని గాక ఇంటివెలుపల చేయగల పనినే ఎంచుకున్నాడు. ఇంతేకాదు మన పంజాబు నాయకులు ఇల్లు—వాకిలి లేనివారేకాదు—వారు మిత్రరహిత నాయకులుకూడా బాటసారీ-పద్ధతిలో జీవితం గడపదలచినవారు ఆమార్గంలో ఏకాకిగానే యాత్ర సాగించాలి. జీవితపరయాత్రలో మనకు సహచరుడంటూ ఎవ్వడూఉండడు. ఇల్లు—వాకిలి లేని/ మిత్రరహిత జీవితంలో మనకు పరదేశీయ జగత్తుకు చెందిన ప్రేమభావన మాత్రం ఆలంబనంగా వుంటుంది. అది భగవంతునివలె కష్టకాలంలో సౌహార్ద్ర-సహానుభూతితో మనకు చేరువగా వస్తుంది. ఈ ప్రేమభావమే దేశ—

పరదేశభేధం—రెంటికీగల దూరాన్నితొలగించి సన్నిహితంచేస్తుంది. ఈ భౌతిక తార—తమ్యాలు—దూరాలు తొలగిపోయిననాడే పంజాబీప్రతిభ తనసహజ ప్రకాశాన్ని ప్రదర్శింపచేస్తుంది.

ఈ లోకనాయకుల కథలను మన సమర్థులైన కవులు లిపిబద్ధం చేశారు. కాని పెద్దకవులు రచించిన ఈ కథలు చాలాకాలంగా పంజాబు జానపద ప్రజా హృదయాలలో గంభీరంగా ముద్రవేసుకున్నాయి. పంజాబుకవులు కేవలం నాయ కులనేగాక కొన్ని కథానికలనుకూడ యితర సాహిత్య ప్రవంతులనుండి తీసికొన్నారు. లైలా-మజ్నూ, షిరీ-పరిహాద్ సైఫ్ఉల్‌మలూక్, యూసఫ్-జులైఖా మొదలైన కథలుకూడా ఎంతో ఆకర్షించాయి. వీటిని ఆలంబనంగా చేసికొని పంజాబీకవులు అందమైన కథలనెన్నో రచించారు, కొన్ని పంజాబీకథానికలు భారతదేశపు ప్రాచీన సంధ్యాసమయానికి సంబంధించినవి కాని పంజాబు జానపద ప్రజాహృదయం తన మాతృభూమినుండి సహజంగా వెలువడిన కథలకు యిచ్చిన విలువ, గౌరవం, మరే యితర దేశపు కథలకు యివ్వలేదు. నలుగురు పంజాబీకవులపేర్లు ఈ ప్రపంచం నిలిచినంతకాలం వారువ్రాసిన కథానికలపేర్లు ఒకటి మరొకదానినుంచి వేరు చేయడానికి వీలులేనటువంటివి. హీర్—వారిస్, ససీ—హాషిమ్, సోహణీ— ఫజల్‌షాహ్ ప్రజలలో నిత్యం నిలిచివుంటాయి. పీలుయొక్క మిరజా, ఖాదరీయాగ్ యొక్క పూరన్‌భగత్ కూడా యిదేవిధంగా సంస్మరింపబడతారు. కవి-లోక నాయకుల మధ్య ఎటువంటి సరిహద్దుగీత గీయడం సంభవంకాదు. ఈ రకమైన అఖండ భాగస్వామ్యానికి కారణం కావ్య కథానికలరూపం దాల్చేందుకు ముందే ఈ కథలు ప్రజాహృదయాలలో అభిన్న భాగంగా స్థానం సంతరించుకున్నాయి. వారిస్, హాషమ్, పీలూ మొదలైన సమర్థకవుల కవితలు ప్రజలను ఆకర్షించాయి. సునాయాసంగా ప్రజాహృదయాలలో నిలచిపోయాయి. ప్రతి కథలోను ప్రజా కావ్యానికి సంబంధించిన ఏదో ఒక అంశం గూర్చి నేటికి పరిశోధన జరుగుతూంది.

చలో సఈయో చల్ వేరూణ్ లీయే
రాంఝే దా చుబారా నీ!
హిర్ నిమాణీ ఇట్టా ఢోవే,
రాంఝూ ఢోవే గారా నీ!

చెలియల్లారా, నడవండి రాంఝూను నాలుగుపాళ్లు చూద్దాం. పాపం, హీర్ ఇటుకలు మోస్తూంది. రాంఝా అడుసు మోస్తూవున్నాడు.]

సోహణీ హిజర్‌దే దీవే వఈ బాలదీ,

కోఈ ఖబర్ లయావే మహే వాల్ దీ!

[సోహణీ విరహదీపాన్ని వెలిగిస్తూవుంది. ఎవరైనా మహీవాల్ వార్త తెస్తారని ఆమె ఆశ]

నా జావీఁ రాంఝా వే.

సానూఁ బహరే గమాఁ విచ్చ రోడ్ కే!

[రాంఝా, మమ్మల్ని అజ్ఞాత దుఃఖాలలోనికి విడిచి వెళ్ళవద్దు.]

కోఈ జానో సఈయో నీ,

రాంఝుణ నూఁ ల్యావో మోడ్ కే!

[చెలీ, వెళ్ళు—ఎవరైనా పోయి రాంఝూను వెనక్కి తీసుకునిరండి ]

చల్ నియాఁ కరాఈయే వే,

రాంఝుణ తూ కాలా మైఁ గోరీ!

[నడు, మనంవెళ్ళి న్యాయం జరిపించుదాం. రాంఝా నీవు నలుపువర్ణంకలవాడివి. నేను ఎరుపువర్ణం కలదానిని.]

ఈ విధంగా అనేక కావ్యాంశములను ప్రజలుతమంతతామే జోడిస్తూవచ్చారు. కొంతకాలంవరకు యివి ప్రజలనాల్కలపై నాట్యంచేశాయి. ఆ తరువాత వెంటనే అందరూ అవి మరచిపోయారు. కాని దుల్లాభట్టీ, సుందరితోగల సంబంధంలో ఒక భాగం శాశ్వతమైనది. నేటివరకు లోరీ పండగరోజున దీనిని వినిపించి పిల్లలు లోరీ కానుకలు అడుగుతారు. ఈ కథను ప్రజలుమరచిపోయారు. కాని ఏ శుభ ముహూర్తంలో ఏ ప్రజాకవియో ఈ క్రింది అనుప్రాసతోకూడిన గేయం రచించాడు. అది ఈనాడు ప్రజలకెంతో ప్రియమైనగేయం. ఈ గీతంలోని ప్రతి చరణం చిరస్మరణీయం.

సుందర్ ముందరి యే, హో
తేరా కౌన్ విచారా, హో
దుల్లా భట్టీ వాలా, హో
దుల్లే ధీ బ్యాహీ, హో
సేర్ షక్కర్ ఆయీ, హో
కుడీ దే బోఝే పాయీ, హో
కుడీ దా లాల్ పటఖా, హో
కుడీదా సాలూ పాటా, హో
సాలూ కౌన్ సమేటే, హో
చాచా గాలీ దేసే, హో
చాచే చూరీ కుట్టీ, హో
జిమా దారాం లుట్టీ, హో
జిమీం దారాం సదాయే, హో
గిన్-గిన్ పౌలే లాయే, హో

ఇది ప్రామాణిక జానపదగేయం. దీనిలో కథానికసూత్రాలు ముందు వెనుకలుగా చిక్కుపడి ఉన్నాయి. జానపదగేయంలో యిలా జరగడం సహజమే. కథ ప్రజలకు సునాయాసంగా తెలుస్తుంది. ప్రజాకవి దాన్ని తానుకోరిన రూపంలో చిత్రిస్తాడు. సుందరి మాతృహీనురాలు. తండ్రి రక్షణకూడా ఆమెకి కరువయింది. పినతండ్రి ఒక జమిందారు. ఆ ప్రదేశంనుంచి అక్బర్‌చక్రవర్తి తరలిపోతున్నాడు. సుందరిని చక్రవర్తికి కానుకగా సమర్పించాలని జమిందారులంతా నిర్ణయించారు. గ్రామంలో అందరినీ మించిన గొప్ప సౌందర్యవతి (లాల్ పటాఖా) అందరినీ మించిన పేదపిల్ల (పటేసాలూవాలీ)ఆపిల్లలను రక్షించేవాడు—పాపం, ఎవడున్నాడు? ఈ విషయం దుల్లాభట్టీకి తెలిసింది. అతడు దీనులపాలిట దీనబంధువు. వెంటనే ఆమెను తన కుమార్తెగా గుర్తించి సుందరి వివాహ ప్రయత్నం చేసాడు. అతి త్వరలో నిశ్చయించిన ఆ వివాహానికి అట్టహాసంగా ఏర్పాట్లు జరుగలేదు. సేర్ షక్కర్ (సేరు పంచదార) తోనే సుందరి పెండ్లిచేశాడు. కాని అతడు స్త్రీగౌరవాన్ని

మంటగలిపే జమిందారులను నానా అగచాట్లుపాలు చేశాడు. ఈరకమైన జానపద గేయాలను రచించి పంజాబు లోకనాయకులు కథాప్రపంచంలో తమ స్థానాన్ని స్థిర పరచుకున్నారు. కావ్యనాయకులుగా ప్రసిద్ధికెక్కే ముందు వారు ప్రజాకావ్య నాయకులు. ఖండకావ్యనాయకులుగా రూపొందారు. ఈ లోకనాయకులు పంజాబు దేశంలోగల సామాన్య ప్రజాధర్మంవైపు తదితరుల దృష్టిని మరల్చారు. పంజాబు లోకధర్మపు సారాంశమంతా "సుందర—ముందరియే" అనే జానపదగేయం ఇతర పంజాబు కథల్లో లభిస్తుంది. పంజాబులోని 'లాల్ పటాఖా' సౌందర్యాన్ని ఏదో విధంగా 'ఫటే సాలూవాలీ' (చినిగిన ఓణీ ధరించినట్టిది) బీదరికంతో జోడించారు. కుమ్మరి సోహిణీ, చాకలి సస్సీ, గేదెలను మేపే అజీమ్ బేగ్ పశువులకాపరి రాంఝూ—పంజాబుదేశపు సౌందర్యం పేదరికం యవ్వనాలకు సంకేతాలు. రాజ కుమారులైన పూరన్, రసాలూ జానపద కథానికల ద్వారా ప్రజా హృదయాల్లో నాటుకుపోయారు. దానికి ముఖ్య కారణం యిది—వారు రాజకుమారులైయుండి రాజరికాన్ని భోగ—భాగ్యాల్ని కాలదన్ని నిరుపేదలుగా తిరుగుతూ లోకధర్మాన్ని గూర్చి ప్రచారం చేశారు. పంజాబు జాతీయ ప్రతిభ నిరుపేదల సౌందర్యంపై తన ఆమోదముద్రవేసింది. జనసామాన్య స్వీకృతికి గీటురాయి సదాచారం. ఈగేయంలో దుల్లా సుందరిని కుమార్తెగా స్వీకరించాడు. హీర్—రాంఝూల ప్రేమపై దేవతల అభయహస్తం వుంది. పూరన్‌కు గురు గోరఖ్‌నాథ్ శుభ ఆశీర్వచనం వుంది. ఇటువంటి ఉదాహరణలు ఎన్నో ఇంచు మించు ప్రతి కథలోనూ కనబడతాయి. అది ప్రేమ కానివ్వండి—పేదరికం కానివ్వండి—దొంగతనం కానివ్వండి—సన్యాసి వైరాగ్యం కానివ్వండి—ప్రతిచోట సదాచారం ఒక సర్వజన సంక్షేమ ధార్మికసత్యంగా గోచరిస్తుంది. సదాచారం పేదరికానికి కూడ ఏదో ఒక మార్గంలో మహదైశ్వర్యాన్ని ప్రసాదించింది.

మన కథలలోని మూడవ మహత్తరవిషయం—వ్యక్తి స్వతంత్రభావన. అనేక పర్యాయాలు కుటుంబం ఈ స్వతంత్ర మార్గంలో ప్రతిబంధక మౌతుంది. అయినా, వ్యక్తి కుటుంబ కట్టుబాట్లను దాటాలనుకుంటాడు. వ్యక్తి కుటుంబం మధ్య సంఘర్షణ పంజాబీకథల్లో కనబడే విశిష్ట లక్షణం. ఈ సంఘర్షణ లేకుండా ఈ కథానికల గూర్చి ఊహించనైనా ఊహించలేము. పంజాబుదేశపు ప్రేమికులు సాంస్కృతికమైన కట్టుబాట్లకు లోబడివుండాలనుకుంటారు కాని,కుటుంబబంధనాల్లో

చిక్కుకుని కూపస్థ-మండూకాల్లా వుండేందుకు సమ్మతించరు. ప్రతిపంజాబు దేశస్థుడు సర్వసమ్మతమైన సంస్కృతీ–సభ్యతలకులోబడి ఉండేందుకు అంగీకరిస్తాడు. అయినా దాని ఆధీనంలో వుంటూ తనజీవితనిర్ణయాల్ని స్వయంగా తీసుకోదలుస్తాడు. అప్పుడే సంఘర్షణ ఎదురవుతుంది. సుందరీ పినతండ్రి సుందరి ఇష్టానికి వ్యతిరేకంగా ఆమెను చక్రవర్తికి విలాసవస్తువుగా బహూకరించాలను కుంటాడు. ఇక్కడనుంచియే లోకధర్మం దాన్ని విరోధిస్తుంది. హీర్, సోహనీ, సాహిబా కూడ తమ కుటుంబాలతో ఘర్షణ పడతారు. సస్సీకి తన కుటుంబ ఆమోదముద్ర లభిస్తుంది. కాని, ఆమె ప్రియుని కుటుంబం వీరి ప్రేమకు అడ్డుగోడగా నిలుస్తుంది. పూరన్ దుఃఖగాథ ప్రారంభంలో సవతితల్లి, రాజైన తండ్రి సలవన్ యిష్టం వచ్చిన నిర్ణయాలతో ముందుకు సాగుతుంది. తల్లి-దండ్రులు తమ కుమారుణ్ణి తమ యిచ్ఛానుసారం మలచాలకుంటారు. కాని, కుమారుడు తన భావ స్వాతంత్ర్యంలో ఎలాంటి రాజీకి ఒప్పుకోడు. రసాలు కథకూడా రాజీకి లొంగని తీవ్ర స్వతంత్ర గమనంలో సాగిపోతుంది. మధ్యయుగంనాటి భారతీయ సాహిత్య జగత్తులో పంజాబీ నాయకీ - నాయకుల స్వతంత్ర స్వభావం సర్వగుణ సంపన్నమై తులదూగింది. కుటుంబ ప్రతిబంధకాలకు విరుద్ధంగా ఈ రకమైన తీవ్ర ప్రతిఘటన మరెక్కడా కనబడదు. సంఘం అత్యంత బలమైనది. కాని అది పరోక్షయథార్థం. మన కథలలో అర్థంలేని అస్పష్ట విరోధానికి తావు లభించలేదు. ఈ కథానికలు ప్రజా జీవనానికి అత్యంత సన్నిహితంగా ఉన్నాయి. కవులు వాస్తవికతమ సంఘం ముందు స్పష్టంగా ఉంచడానికి శ్రద్ధ వహించారు. సంఘానికి బలమైన అంగం కుటుంబం. మధ్య యుగంనాటి పంజాబీ రచనలలో భావ వ్యక్తీకరణ ఒక నినాదంగా వినబడుతుంది. కథలలోని పాత్రలు మరణపర్యంతరం తమ స్వాతంత్ర్యం పట్ల అచంచల విశ్వాసం కలిగివుంటారు. కాని ఎక్కడా ఆత్మ సంయమన పరిహద్దుల్ని ఉల్లంఘించరు. హీర్ తనతీవ్ర సంఘర్షణతో రాంఝూను పొందగలుగుతుంది. తరువాత ఆమె తల్లీ దండ్రుల ఆమోదం పొందగోరుతుంది. వారి ఆదుపులో వుంటూ తన నూతన జీవితాన్ని ప్రారంభించాలను కొంటుంది. పున్నూ వెళ్ళి పోయిన తరువాత సస్సీ అతనిని వెన్నంటుతూ పరుగెడుతుంది. సోహనీ తన ప్రేమకు విశ్వాస పాత్రుడైన తన ప్రియుణ్ణి కలుసుకొంటుంది. కాని, సాంఘిక ఆచారాల ననుసరించి జరిగిన వివాహాన్ని త్రోసిపుచ్చలేక పోతుంది. యోగియైన

పిమ్మట కూడా పూరన్ మనస్సులో తల్లిదండ్రుల పట్ల ఆదరభావం వుంటుంది. సవతితల్లికి వరమిచ్చేందుకు అతను మళ్ళీ తన పట్టణానికి తిరిగివస్తాడు. ఇలా అనేక విషయాలు ఈ కథల్లోలభిస్తాయి. పంజాబీదేశస్థుడు తన ఆచరణను స్వతంత్రాన్ని సంఘ కట్టుబాట్లలో వుంచాలను కుంటాడు. ఆ బంధానాలు ఉగ్రాత్మగా తయారైయితే, వ్యక్తిగత స్వతంత్రాన్ని నాశనం చేయదలిస్తే అతడు దానికి ప్రతికూలంగా నిలుస్తాడు. స్వతంత్రానికి దేశదిమ్మరిలా తిరగడానికి ఎక్కడా అవకాశంలేదు అదేవిధంగా సాంఘిక నియమాలకు కూడ ప్రతి బంధాలుగా మానవుని ఆత్మవికాసాన్ని అడ్డే అధికారంలేదు. పంజాబు ప్రజాహృదయం కథలను ప్రేమించినంతగా మరే ఇతర కావ్యరూపాన్ని ప్రేమించదు. మధ్య యుగం నాటి పంజాబీ సాహితీ ఉద్దేశ్యాలు కొన్ని లోక సమూహధర్మంగా రూపొందాయి. అవి మన మనస్సులో గాఢంగా నాటుకున్నాయి. అవి పంజాబీ ప్రజానీకమంతటితో ఒకే రకమైన ఆమోదం పొందలేదు. పంజాబు కథల బాహ్యశరీరం ఆత్మలు రెండూ ధర్మానికి సంబంధించినట్టివి. పంజాబుది తన స్వంత లోకధర్మం. సంఘం బంధనాలనుండి యిది ముక్తి పొందినది. నిజానికి పంజాబీ లోక వ్యవహారంలో లోకధర్మం యిమిడివుంది. దానికి సామాన్య అర్థంచెప్పుకోవాలంటే పంజాబీ దేశస్థులు ఎక్కడ పుట్టి పెరిగారో అక్కడ ఆచార వ్యవహారాలను స్వీకరించారు కానీ తమ అంతరాత్మలోని సత్యాన్ని నిర్భయంగా ప్రకటించారు. ఆంతరంగిక సత్యాన్ని స్వేచ్ఛగా విహరించేటట్లు చేశారు. లౌకిక సంఘ సత్యాన్ని అదుపులో పెట్టేందుకు వారు అనుమతించలేదు. సదాచారానికి మధ్యే మార్గమే పంజాబీయుల దైనందిన వ్యవహారం, అదే పంజాబీ కథలకు మార్గం. దైనందిన జీవితంలో ఈ పథంలోనే మానవుడు ముందుకు సాగిపోగలడు.

క్లుప్తంగా చెప్పాలంటే. సామాన్యత, సదాచారం, స్వాతంత్ర్యం సంయమనం యొక్క సంయుక్త ప్రపంచమే పంజాబు కథానికల ప్రపంచము.

హరిభజన సింగ్

# విషయ సూచిక

# హీర్ - రాంఝా

— మోహన్ సింగ్

భారతదేశానికి మొగలాయీలు రావడానికి పూర్వమే హీర్ జీవిత ఘట్టం ముగిసింది. రాజపుత్రులు కొత్తగా ముస్లిం మతాన్ని స్వీకరిస్తున్నదినాలవి. సియాళ్, ధార్ ప్రదేశములందున్న రాజపుత్రులు ఈ మతాంతరమునకు ఉపక్రమించారు. క్రీ. శ. 1258లో ఫరీద్ శకర్ గంజ్ బాబాద్వారా రాయసియాల్ సుపుత్రుడైన రాయశంకర్ ముస్లిం మతాన్ని స్వీకరించాడు. వీరు ఇస్లాం ధర్మాన్ని అవలంబించినా హిందూ ధర్మాచారాలను పాటిస్తూ ఉండేవారు. వారి స్త్రీలు ఘోషా పద్ధతి అవలంబించలేదు. తుర్కీదేశీయులు ధరించే నీలిరంగు బట్టలను వారు ధరించే వారు కాదు-తుర్కీయులు ఉపయోగించే ఇత్తడి పాత్రలను వారు తమ గృహంలో ఉపయోగించేవారుకాదు. సియాలులు ఇక్కడకు రాకపూర్వమే వారి పూర్వీకుడు మలఖాన్ క్రీ. శ. 1162లో ఝంగ్ అనే గ్రామాన్ని అక్కడ నిర్మించాడు. చూచక్ అను పరాక్రమశాలి సియాలుల సైన్యానికి సర్దారుగా ఉండేవాడు. హీర్ ఈ మిహిర్ చూచక్ కుమార్తె. వీరి మిహిర వంశంలో జన్మించిన కారణంగా ఆమె అల్లారు ముద్దుగా పెరిగింది.

హీర్ తన స్నేహితురాండ్రతో కలసి తోటలలో ఊయలలూగేది, చీనాబ్‌నదిలో జలకమాడేది. వసంతకాలంలో అందంగా అలంకరించిన నావలో కూర్చుని చీనాబ్ నదీతీర ప్రాంతాలకు వెళ్ళి ప్రకృతి సోయగాన్ని తదేకంగా తిలకించేది. ఒక్కొసారి నదిమధ్య జలకములాడుతూ సూర్యోదయ-సంధ్యాసమయాలలోని రంగురంగుల ప్రకృతి దృశ్యాలనుచూసి పరవశం చెందేది. హీర్ నిండుజవ్వని; అభిమానవతి; సుగుణవతి-అంతేకాదు; ఆమె మంచి సాహసోపేత అన్నిటినీమించి ఆమె అపురూప సౌందర్యవతి. సౌందర్య యౌవ్వనముల సంగమం ఆమెలో ఒక విచిత్ర ఆకర్షణను కలిగించేది. చూపరుల మనసులను యిట్టే ఆ సౌందర్యం ఆకర్షించేది. ఆమె నడక నవాబుగారి గజేంద్ర గమనంలా వుండేది భారతీయ సాంప్రదాయ

ప్రకారం చెప్పాలంటే ఆమె మోహినీ ఇంద్రాణిలాంటి మనోహరమూర్తి. ఇరాన్ సాంప్రదాయంతో చూస్తే ఆమె చైనాదేశపు కళాత్మకమైన సజీవ ప్రతిమ. రోము నగరపు సుకుమారమైన నగిషీ చిత్రం!! అంతెందుకు; హీర్ లక్షలాది జనసముదాయంలో దాచాలన్నా దాగని అసమాన సౌందర్యవతి.

ఝంగ్ గ్రామాన్ని సౌందర్యవంతంగా తీర్చి దిద్దడమేగాక చీనాబ్ నదీలోయ ప్రాంతాలను ప్రయోజనాత్మకంగా చూచక్ రూపొందించాడు. నదిని దాటేందుకు యాత్రికుల సౌకర్యార్థం ఎన్నో చిన్న చిన్న పడవలు ఏర్పాటు అయ్యాయి. పగలస్తమానం బాటసారులు, వ్యాపారస్థులు రేవులను దాటుతూ వుండేవారు. ప్రతి బాటసారి దృష్టి హీర్ నావపై పడేది. నావికుడైన లుడ్డన్ ఆమె నావను ఎంతో సుందరంగా అందాలు చిందేటట్లు అలంకరించేవాడు. ఖాళీగావున్న ఆ అందాల నావను చూడగానే బాటసారుల నయనాలు అలౌకిక స్వప్నాలను సందర్శించేవి. అందాలరాణి హీర్‌ను చూడగలిగే యాత్రికులు దివ్యానుభూతిని పొందేవారు అనటంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. ఆమె అసమాన సౌందర్యం వెన్నెల కాంతుల నీనే ఆమె మిస మిసలాడే యౌవ్వన గాధలు కోకొల్లలుగా విదేశీ వ్యాపారులు-యాత్రికులద్వారా సుదూర ప్రదేశాలకు వ్యాపించాయి.

తఖ్త హజారానగరం ఝంగ్‌కు ఎనభై మైళ్ళ దూరంలో ఉంది. హీర్ సౌందర్యగాధలు అక్కడ కూడ వ్యాప్తిచెందాయి. అక్కడ యువతీ యువకులకి ఆమె పేరు సుపరిచితమయింది. ఆమె అంటే వారికి ఎనలేని ప్రేమ. తఖ్త్ హజారా నాయకునిపేరు మౌజు. అతను రాంఝూ జాతికి చెందినవాడు. అతనికి ఎనమండుగురు కుమారులు. అందరిలో చిన్నవాడు ధీరోరాంఝూ. ధీరో అందమైనవాడు, సరస స్వభావం కలవాడు. తండ్రి మరణానంతరం మిగిలిన సోదరులంతా ఆస్తినంతా పంచుకొని ఎవరివాటా వాళ్ళు తీసుకొన్నారు. పొలాలను కొలుచుకుని మంచి మంచి పంటభూములను పంచుకున్నారు. ఎందుకూ కొరగాని చవిటి పర్రబంజరు భూమిని ధీరోరాంఝూకు అంటగట్టారు. తండ్రికి గారాబు కుమారుడు కావటంతో అతను సుకుమారంగా పెరిగాడు. ఎన్నడూ కష్టపడి పనిచేసి ఎరుగడు. అందుచేత అతను తనపొలంవైపు కన్నెత్తియైనా చూడలేదు. చక్కగా ముస్తాబై వీధుల వెంట షోకిల్లాగా తిరిగేవాడు. అతని వదినెలకు అతనంటే ఎంతో అనురాగం. ఏపనీ చేయకపోయినా కొంతకాలం అతణ్ణి ఎంతో ప్రేమతో చూశారు. కాని అతను

చక్కగా విలువైన మంచి బట్టలను ధరించి వీధులలో పిల్లన గ్రోవితో పాటలు పాడటం తప్ప మరి ఎందుకూ పనికిరాడని తెలుసుకున్నాక, చులకనగా చూడటమేగాక సూటీ పోటీ మాటలనడం కొద్దిగా తిట్టడం ప్రారంభించారు. అతను తన వదినగారి ప్రేమానురాగాలకు ఏదో కొంత ప్రతిదానం చేసియుంటే అతణ్ణి అంతగా దుయ్య బట్టేవారుకాదేమో! కాని, రాంఝూకు ఇవన్నీ అనవసరం. అతనిస్వభావమే విలక్షణ కళాసౌందర్య విలసితం. అతని యౌవ్వనం ఎవ్వరి స్వార్థాలను లక్ష్యపెట్టని యౌవ్వనం. నిజానికి అతనికి అతనేసాటి. ఒకనాడు అతని చిన్నవదినెదారు — "రాంఝూ నీవు మమ్మలను కాదనదలిస్తే వెళ్ళి సియాల్‌వారి అందాలరాణి హీర్‌ను పెండ్లాడిరా చూద్దాం" అంది వ్యంగ్యంగా నిరసిస్తూ.

వదినెగారి వ్యంగ్యోక్తి రాంఝూ హృదయాన్ని గాయపరచింది—"హత్థవం ఝులీ జుత్తియాంభార్‌కచ్చే, రాంఝూహోతురేయా వారిస్ శాహా జేహా" [చేతిలో పిల్లనగ్రోవి, చంకలో చెప్పులజత తీసుకొని వారిస్ చక్రవర్తిలా బయలుదేరాడు.] మొదటిరోజు ప్రయాణంలో రాత్రివేళ అతను దారిలోనున్న ఒక మసీదులో బసచేశాడు. మసీదులోఉన్న మౌల్వీతో ఆరాత్రి రాంఝూ కలహమాడవలసి వచ్చింది. మరుసటి రోజు ఉదయమే రాంఝూ లేచి తన దారిని తాను బయలుదేరి పోయాడు. సుదీర్ఘ యాత్రను ఎన్నో ఇబ్బందులనెదుర్కొని అతను చివరికి చీనాబు నదీతీరానికి చేరుకున్నాడు. అప్పుడే లుడ్డన్ నావికుడు తన పడవను రేవునుంచి వదలడానికి సిద్ధంగా వున్నాడు. అదిచూసి రాంఝూ నిట్టూర్చి— భగవంతునికి కృతజ్ఞతలు చెప్పి లుడ్డన్‌తో తనని దాటించమని అర్థించాడు. కాని, అతని అభ్యర్థనను లుడ్డన్ పెడచెవినిపెట్టి అతణ్ణి వెనక్కినెట్టి పడవను ముందుకు నదిలోనికి తోసుకుపోయాడు. ఆ నావికుని భార్యలు రాంఝూ అనుపమ సౌందర్యాన్నిచూసి పరవశంచెంది అతని చుట్టూచేరి కూర్చున్నారు. అతణ్ణి అనేక రకాల కుశల ప్రశ్నలు వేసి తమ ఛలోక్తులతో ఉత్సాహ పరిచారు. అతని కాళ్ళుచేతులుకూడ పిసికి అలుపట తీర్చారు. అలుపు తీరటమే తడవుగా అతను తన పిల్లన గ్రోవిని ఊదుతూ వీనులకింపైన రాగాలాపనలను చేయసాగాడు. చుట్టుప్రక్కల నదీతీరానగల ఆబాలగోపాలం ఆ వాయిద్య సుధా రసాన్ని గ్రోలడానికి అతని దగ్గరకు చేరారు. లుడ్డన్ భార్యలు రాంఝూకు ఎంతో సుపరిచితులయ్యారు. వారు అతణ్ణి హీర్ నావపైకి తీసుకొనిపోయారు. ఆ పడవలో పట్టుబట్టల తెరలమధ్య హీర్ పడకగది వుంది. సుదీర్ఘయాత్ర కాలినడకతో చేసిన

రాంఝూకు ఆ మెత్తని పాన్పుపై వాలగానే గాఢంగా నిద్రవచ్చింది. తన పాన్పుపై ఎవరో పరదేశీయుణ్ణి లుడ్డన్ నావికుడు పరుండబెట్టాడని హీర్‌కు తెలిసింది మండి పడింది ఆమె తన చెలికత్తెలను వెంటబెట్టుకొని నదీతీరానికి హుటాహుటి వెళ్ళింది వెనుక ముందులాలోచించకుండా వెళ్ళివెళ్ళగానే బెత్తంతీసుకొని అదే పనిగా లుడ్డన్‌ను రక్తం చిందేటట్లు చావమోదింది. ఆ తరువాత గబగబా ఆమె తన పడవ వద్దకు వెళ్లింది తన సుకోమలమైన పాన్పుమీద అపరిచితుడైన పరాయి పురుషుడు పడుకోవడం చూసి కోపంతో అతణ్ణి ఒక దెబ్బ కొట్టింది. కాని రాంఝూ ఆ దెబ్బకు త్రుళ్ళిపడిలేచి ఏమీ బాధను కనపరచకుండా 'ఓహో సుకుమారీ' అని నవ్వుతూ 'నీదయకు ఎంతో సంతోషం' అన్నాడు.

హీర్ కమలదళ నేత్రాలనుండి ఒక వినూత్నకాంతి మెరుపులా మెరిసింది. ఒక్కసారిగా ఆమె మనసు మారిపోయింది. పడవకుకట్టిన తెరలన్నీ తొలగించి రాంఝూ దగ్గరగా పాన్పుమీద కూర్చుంది. ఎంతోసేపు మౌనంగా కనుసన్నలతో ఏమేమో మూగభాషలో మాట్లాడుకున్నారు. తుదకు హీర్ తన ప్రేమను తెలియ జేసింది. అంతట "నీవు నీ చెలికత్తెలతో రాట్నాలు వడుకుతూ ఉద్యానవనాలలో ఊయలలూగుతూ నన్ను మరచిపోవుకదా"—? అన్నాడు రాంఝూ. అంతట గంభీర ముఖ ముద్రతో ఆమె యిలా అంది.

మైనూఁ బాబలేదే కసమ్ రాంఝియా వే,
మరేమాఁ ఊఁ జేతుధధీ ముఖమోడాఁ।
అన్నీఁ హోయేకీ నైన ప్రాన్ జావణ,
తేరే బాఝ్ జో కౌంతుమైఁ హోరు లోడాఁ।
మైఁ తాఁధుర్ దరగాహో ధీలివా రాంఝూ
ధీవాఁసూర్ జే ప్రేత దీరీత్ తోడాఁ।

[రాంఝూ, నేను నా తండ్రిపై ప్రమాణంచేసి చెబుతున్నాను నిన్ను-ఎన్నడైన తిరస్కరిస్తే నా తల్లికి దూరమైపోవుదునుగాక. నిన్నుతప్ప మరొకరిని భర్తగా కోరితే అంధురాలనై మరణింతునుగాక. నేను పవిత్రప్రేమ బంధనాన్ని ఉల్లంఘిస్తే పందినై పుట్టుదునుగాక.]

ఇరువురిమధ్య గట్టి వాగ్దానాలు జరిగాయి. హీర్ తన చాతుర్యంతో తల్లి దండ్రులను ఒప్పించి రాంఝూను తమ యింట పశువుల కాపరిగా నియమించింది

ఈ కుర్రవాడు అపర మన్మథునిలా, ఎంతో అందంగా నాజూకుగా కనబడుతున్నాడు. ఇతణ్ణి పశువుల కాపరిగా మనవద్ద వుంచడం సబబుకాదు. మన పశువులు ఇతరుల పశువులతో కలిసి వెళ్ళిపోయినా ఇతను గ్రహించలేడు. అడవుల్లో ఎన్నోకష్టాలు కలుగుతాయి. వాటిని ఇతను ఏమి సహించగలడు? అంతేకాదు, ఆ కొండలు అడవులలో క్రూరమృగాలు విచ్చలవిడిగా తిరుగుతూ వుంటాయి. వాటి బారినుండి ఎలా తప్పించుకొన గలడు"?— అని చూచక్ నెత్తిన నోరుపెట్టుకొని చెప్పాడు. కాని హీర్ తండ్రికి ఎన్నోరకాలుగా ధైర్యం చెప్పింది.

బడా చతర్ తే అకల్దా కోక్ సెక్దా,
మంఝీం బహుత్ సంభాల్కే చారదా ఏ!
హిక్కే నాల్ పి ఆర్ దే హూంగదేకే,
సోటా సింగ్తే మూల్నా మారదా ఏ!

[ఈ కుర్రవాడు చాల తెలివి కలవాడు. కడు జాగరూకతతో మన పశువులను మేపుతాడు. ఎంతో జాలిగా వాటిని సాకుతాడు అతను మన గేదెల కొమ్ముపై ఎన్నడూ నిర్దాక్షిణ్యంగా కొట్టడు.]

రాంఝూ పన్నెండేళ్ళు సియాలవారి గేదెలను చక్కగాకాస్తూ జాగ్రత్తగా సంరక్షించాడు. అతను ప్రతిరోజు గేదెలను నదీతీరపు అడవిలోకి తోలుకొని పోయేవాడు. చక్కగా మేపేవాడు. సంధ్యాసమయం కాగానే పిల్లనగ్రోవి వాయిస్తూ అతను ముందు నడుస్తూవుంటే పశువులు అతని వెనుక నడుస్తూ ఇంటికి చేరుకొనేవి ప్రతి రోజు హీర్ గిన్నెనిండా భోజనంతీసుకొని అడవికి వెళ్ళేది. ఇరువురూ కలిసి భోజనం చేసేవారు. వారి ప్రేమానురాగాలు ఉన్నత శిఖరాలను అందుకొనేవి మల్లెపొదల మధ్య రాంఝూ-హీరులు దాగుడుమూతలాడుకొనేవారు ఎండకు నదిలో తళతళ మెరిసే తరంగాల గలగలలు చూసి ఇరువురూ దివ్యానందంలో ఓలలాడేవారు. కాని, వీరి రహస్య ప్రేమ ఎంతకాలం దాగుతుంది! ఝంగ్ గ్రామ ప్రజలంతా వీరి ప్రేమలీలలను గూర్చి పలురకాలుగా చెప్పుకోవడం ప్రారంభించారు. నోటికొక మాట! నాలుకకు ఎముక లేదుకదా! కాని హీర్-రాంఝూల జంట, రతీమన్మథుల జంటలా ఎంతో అన్యోన్యంగా కనబడేది. వారి ప్రేమనుగూర్చి ఎవ్వరూ చెడుగా తలపోయలేదు. ప్రతి గ్రామస్థుని హృదయంలో వారిప్రేమ గోప్యంగా వుండి పోయింది.

ఈ మధురానురాగ జీవితరంగంలో ఒక తుఫాను రేగింది. హీర్ పెద తండ్రి కైదోఁకుంటివాడు, అతనిరూపం అదోరకంగా ఉంటుంది. నెత్తిపైకలం కారీ టోపి; మెడలో గురువిందగింజల దండ, చేతిలో మనిషి పుర్రె, ఎప్పుడూ భంగూ-సారాయి అంటే అపరిమితమైన సరదా. ఊరుబయట కుటీరంలో నివాసం. చిలుకలు, మైనా గోరువంకలు, కోడిపుంజులు, పెట్టలు, కౌజు పిట్టలను మందలుగా పెంచేవాడు. అతని జీవిత సహచరులవి. నిజం చెప్పాలంటే— అతను సగం జాటు జాతికి సగం సాధు జాతికి చెందినట్లు కనబడతాడు. కల్లు-సారాలు త్రాగుతూ చాలా కాలం ఆమద్యప దుకాణాలనే నివాసంగా చేసికొన్నాడు. ఎప్పుడూ కాలుకాలిన పిల్లిలా తిరుగుతూనే ఉంటాడు. రాంఝూ—హీర్‌ల అనురాగం అలికిడి అతని చెవులకు తగిలింది. వారిప్రేమ దినదినాభివృద్ధి చెందడం అతనికి అసూయ కలిగింది. అది ఎట్లా సహించగలడు? హీర్ ఆమె స్నేహితురాండ్రు ఆరంభంలో రాంఝూతో కలిసి కూర్చుని భోజనాలు చేయడం-మల్లెపొదల్లో ప్రేమికులిరువురు కేరింతలు కొడుతూ దాగుడుమూతలాడడం చూసి అతను ఎలా వూరుకోగలడు?

ఒకనాడు కైదోఁ హీర్‌ను వెన్నంటివెళ్లి ఆమెకు కనబడకుండా మల్లెపొదల్లో దాక్కొని వారిచేష్టలన్నీ గమనించాడు. హీర్ తెచ్చిన భోజనాన్ని రాంఝూ తిరుటు న్నాడు. ఆమె నదికి నీరు తీసికొని రావడానికై వెళ్ళింది. ఇంతలో కైదోఁ అతణ్ణి సమీపించి ఎంతో దీనంగా కాస్త భోజనం పెట్టమని అర్థించాడు. రాంఝూ గిన్నెను అతని ముందుకు జరిపి చేతినిండా అన్నంముద్ద తీసుకో అన్నాడు. కైదోఁ గుప్పెడు అన్నం తీసికొని కుంటుకుంటూ గ్రామంవైపు చరచరా వెళ్ళిపోయాడు. హీర్ నీళ్ళు తీసుకొని వచ్చింది. రాంఝూ అమాయకత్వాన్ని చూసి ఆమె కోపగించుకుంది. ఆ కుంటివాడు తన అలవాటు ననుసరించి గ్రామంలో రకరకాలుగా తమపై దుష్ప్ర చారం చేస్తాడని ఆమెకి తెలుసు. కైదోఁ ఇంకా గ్రామం చేరకముందే హీర్ రివ్వున పరుగెత్తుకు వెళ్ళి అతణ్ణి దారిలోనే పట్టుకుంది. అతని టోపీ, మెడలో దండలు చేతిలో దండం లాగివేసి అతణ్ణి బాగా చితక బాదింది. అతని గుప్పెట్లో అన్నం అంతా మట్టిపాలయింది.

హీర్ వెళ్ళిపోయాక నెమ్మదిగా కైదోఁలేచాడు. నేలపై పడిపోయిన అన్నం ముద్దను ఏరుకున్నాడు. గ్రామంలోని, ఇంటింటికి వెళ్ళి, రాంఝూ-హీర్‌లపై నానా అభాండాలను వేస్తూ నిందించాడు. చూచక్ దంపతులు ఈ అవమానకరమైన

నింధకు ఎంతో బాధపడ్డారు వాగు సంఘం ఎదుట తలెత్తుకొని తిరగలేకపోయారు ఇది విని హీర్ సోదరుడు సుల్తాన్ మండిపడ్డాడు—"ఈ కత్తితో పశువుల కాపరిని ముక్కలు, ముక్కలుగా చేసివేస్తాను" అంటూ ఒరనుండి కత్తిని దూశాడు కొంత మంది రాంఝూను నానా చీవాట్లుపెట్టి గ్రామంనుండి బయటకు పంపివేశారు. హీర్ ఈ సంఘటనను తన ఓటమిగా భావించలేదు. ఆమె ఎంతో సాహసంతో తన సోదరుడు సుల్తాన్‌తో యిలా అంది.

అఖ్ఖాంలగ్గీ అఁ ముడన్ న వీర్ మేరే
వేమైఁఘోల్ ఘత్తీ బలిహారియాఁవే
వహన్ పయే దరియా నాకదీరుకదే
భావేఁ మార్ దేఖో బన్హాఁభారియాఁవే!
ఖూన్ నికలనోఁ కదీనారుకదాఁవే
జిత్థోలగియాఁ తేజ్ కటారియాఁవే!....

[ఓనా సోదరుడా! ఒక్కసారి మనసారా ప్రేమించిన నేత్రాలు మరల తమ ఉద్దేశాన్ని మార్చుకొనలేవు. నేను నా ప్రేమకు బలి అవుతాను. ప్రవహించే నదులకు ఎన్ని అడ్డకట్టలు వేసినా అవి ఎన్నటికీ ఆగవు—అవి ప్రవహిస్తూనే వుంటాయి పదునైన బాకు బలంగా దిగిన చోటనుండి రక్తం ధారావాహినిగా ప్రవహిస్తుంది అది ఎంతమాత్రం ఆగదు సుమా"]

పన్నెండేళ్ళు పడిన కష్టమంతా మట్టిపాలు కావడంచూసి రాంఝూ ఎంతో దుఃఖించాడు. ఆ మరుసటి రోజున గేదెలను మేతకి వదిలారు. రాంఝూ లేకపోవడం చూసి అవి ఒక్కఅడుగైనా ముందుకు వేయలేదు. కుడితితొట్టి ముట్టనైనాలేదు. ఇదిచూచి చూచక్ మీలకేలు తమ కుటిలనీతి ఉపయోగించారు. రాంఝూను బుజ్జగించి గేదెలవెంట సాగనంపారు. ఇంత అవమానం జరిగిన తరువాత నీవు మళ్ళీ, ఆ రాంఝూవద్దకు ఒంటరిగా పోవడం సబబుకాదు అని కుమార్తెకు ఎన్నోరకాలుగా నచ్చచెప్పారు. హీర్ పెండ్లి అతిత్వరలోచేయాలని అంతటితో ఆ పశువుల కాపరి బెడద తొలగిపోతుందని తల్లిదండ్రులు దృఢంగా నిశ్చయించుకొన్నారు. అయినా గ్రామస్థుల సానుభూతి ఆ యువతీయువకులపట్లవుంది. హీర్ ఎంతో తెలివిగలది. వెంటనే రాంఝూను కలుసుకునేందుకు మిట్టీణయాన్ యింటిని స్థావరంగా ఏర్పాటు చేసుకుంది. రాంఝూ పశువులను పచ్చికబయలులో విడిచిపెట్టి అక్కడికి వచ్చేవాడు

మీట్టీజియాన్ యింటిలో గంటలతరబడి కూర్చుని రాంఝూ హీర్‌లు మనసువిప్పి ఏమేమో మాట్లాడుకొనేవారు. ఒకప్పుడు నదిలో యిరువురు ఈత యీదేవారు. మరొకప్పుడు హీర్ తన స్నేహితురాండ్రు రాంఝూతో సహా స్నానంచేస్తూ నదిలో ఓలలాడుతూ వుండేది.

ఒస్ తఖ్త హజారేదే దంబరేతే,
రంగ్ రంగ్ దియోం జాలీ ఆంపాందిహై

[ఈ తఖ్త హజారాకు చెందిన అమాయకపు యువకునిపై ఆకర్షణీయమైన రకరకాల ఉచ్చులనువేయుచున్నది].

నానాటికి వీరిప్రేమ లీలలు నలువైపులా వ్యాపిస్తున్నాయి. అది చూసి తల్లి-దండ్రుల గుండెలో రాయిపడింది. భేడాతో తమ కుమార్తె వివాహము ఖాయిపర్చారు. కొద్దిరోజులలో భేడా తన బంధువర్గంతో అట్టహాసంగా, మేళ-తాళాలతో రంగపురము నుంచి ఝుంగ్‌గ్రామానికి తరలివచ్చాడు. వియ్యాలవారు గ్రామంలో విడిది దిగి వింత-వింత చమత్కారాలను చూపిస్తున్నారు. రకరకాల పిండివంటలు వండుతూ షడ్రసోపేతంగా విందులు జరుగుతున్నాయి. అందాలుచిందే సప్తరంగులమందుగుండు సామానుల వెలుగుతున్నాయి. ఊరు వూరంతా కోలాహలం చిందులు త్రొక్కుతూ వుంటే, ఉత్సాహ ఉల్లాసాలు ఉరూత్రలూగుతున్నాయి. అంతా దీపావళి సందడిగా ఉంది. కాని, రాంఝూ యిదంతా చూసి విపరీతంగా వ్యధచెందాడు. అతడు ఉదాసీనంగా, నిస్సహాయుడుగా మిగిలిపోయాడు. ఒకప్పుడు భంగుత్రాగుతూ నదీతీరంలో పిచ్చివానిలా కూర్చునేవాడు. మరొకసారి తాను మేపే గేదెల మెడపై చేతులువేసి తలవాల్చి ఏడ్చేవాడు. హీర్ స్నేహితురాండ్రు అతణ్ణి పిలిస్తే వారివైపు బాధగా చూసేవాడు. ఆచారం ప్రకారం హీర్‌ను పెండ్లికూతురునిచేసి యింటిలో ఒకమూల కూర్చోబెట్టారు. రాంఝూ హృదయవేదన ఆమెకు తెలుసు— "నేను అత్తవారింటికి వెళ్ళేముందు-రాంఝూతో ఒక విషయం చెప్పాలి. మీరువెళ్ళి అమ్మాయివేషంలో అతణ్ణి నావద్దకు తీసికొని రండి"—అని హీర్ తన స్నేహితురాండ్రకు చెప్పింది. రాత్రి చాలా పొద్దుపోయిన తరువాత పెండ్లికూతురి మేనత్తలు, పెదతల్లులు, పినతల్లులు అందరూ ఆమె దగ్గరనుండి లేచివెళ్ళిపోయారు. ఇక ఆమెవద్ద కొద్దిమంది స్నేహితురాండ్రు మిగిలారు. రాంఝూ స్త్రీవేషంలో హీర్‌వద్దకు వచ్చాడు. అతని ఆడవేషాన్ని చూసి కొంతమంది సమ్మోహితులయ్యారు. మరి కొంతమంది

ఉదాసీనంగా ఉండిపోయారు—" రాంఝూ నామాట విను. నన్ను ఇప్పుడే ఎక్కడి కైనాతీసుకొనిపో. రేపు నాతల్లిదండ్రులు నన్ను పల్లకీలో కూర్చోబెట్టి అత్తవారింటికి సాగనంపుతారు అప్పుడు ఎవరైనా ఏమిచేయగలరు!" అని హీర్ రాంఝూను అర్థించింది. రాంఝూ హీర్‌ను పెండ్లాడి తన యింటికి తీసుకువెళ్ళాలనే సంకల్పంతో ఇక్కడకు వచ్చాడు.

హీర్ ఇష్క నా మూల్ స్వాద్ దేందా
నాల్ చోరియాం అతే ఉధాలియాందే.

[హీర్‌ను చాటుమాటుగా లేవుకొనిపోతే ప్రేమకుతగ్గ ఆదర్శం ఏముంటుంది!]

హీర్ ఎన్నోరకాలుగా నచ్చచెప్పింది. కాని, రాంఝూ తన పట్టు విడువలేదు. మరునటి రోజున పెళ్ళికూతుర్ని పల్లకీలో కూర్చోబెట్టుకొని వరుడు భేడా తన రంగ పురానికి బయలుదేరాడు. వధువు తండ్రి విలువైన బట్టలు, ఆభరణాలు, మంచి పశువులు వరుడికి కట్నంగా యిచ్చాడు. రాంఝూ లేకుండా పశువులు కదలలేదు. గత్యంతరములేక రాంఝూను మొగపెళ్ళివారు వెంటబెట్టుకు వెళ్ళారు. ఝంగ్ గ్రామమునుండి రంగాపురం సుమారు 70 మైళ్ళ ప్రయాణం దారిలో బసలుచేసు కొంటూ, జంతువులను వేటాడుతూ ఖేడా కాలం గడుపుతున్నాడు. పల్లకీకి కొద్ది దూరంలో హీర్ పెట్టెను మోసుకొంటూ రాంఝూ నడుస్తున్నాడు. మెడలోని ముత్యాల దండను తెంపివేసి ఆ ముత్యాలను హీర్ పల్లకీనుండి బయటకు విసరివేసింది. క్రిందపడిన ముత్యాలను ఏరమని సైగచేసి రాంఝూకు సంజ్ఞచేసింది. అతను గుప్పెట నిండా ముత్యాలు ఏరి పల్లకీలోనున్న పెండ్లికూతురుకు ఇవ్వబోయాడు. అతని కళ్ళల్లో తెల్లటి మెరుపు ముత్యాల వరుసలుచూసి హీర్ యిలా అంది.

వైవే రాంఝు యా జోర్ మైం లాధక్కే
మేరే బస్థీం గల్ బేబస్ హోయీ!
ఫడ్‌కే మాం పియాం, కాజీ ఆం బన్నతోరీ
సాడే నాల్ కేడీ ఖర్ ఖస్ హోయీ
జీవుందే కహే తాంమిలాంగే ఫేర్‌జేవీ
హాల్ సాల్ తాందోస్తే బస్ హోయీ.

[ఓ రాంఝూ, నేను నాబలాన్నంతా ఉపయోగించికూడా ఓడిపోయాను. ఈ విషయం నా వశంలో లేదు. నా తల్లిదండ్రులు, గ్రామపెద్దలు బలవంతంగా

పెండ్లిచేసి నన్ను అత్తవారింటికి సాగనంపారు. నాపట్ల ఎంతో అన్యాయం జరిగింది. నా ప్రియమైన రాంఝూ బ్రతికివుంటే మళ్ళీ కలుసుకొందాం. ప్రస్తుతానికి మన స్నేహం అంతమైపోయింది.]

# 2

పెండ్లివారు వధువుతో సహా తమగ్రామం రంగాపురానికిచేరారు. సైదా తండ్రి అజ్జూ పరమానందభరితుడయ్యాడు. వధువు హీర్ నిరుపమ సౌందర్యాన్ని గూర్చి అంతకుముందే గ్రామప్రజలు దేవకన్యగా ఆమెని పొగడుతున్నారు. గ్రామమంతా ఆమె సోయగాన్ని తిలకించడానికి వచ్చింది. కాని ఆమె సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేసే సంతోషం ఆమె ముఖంలో కనబడ్డంలేదు. ఆమెలో విచారరేఖలు అదృశ్యరేఖలుగా అంకితమై వున్నాయి. ఆమె హృద్గత వేదనా చిరుతరంగాలను గమనించేవారులేరు అందరికంటె ముందుగా వధువు హృదయలోతుల్లో దాగిన వేదనారేఖల్ని సైతీ గమనించింది. సైతీ సూక్ష్మదృష్టికలది, చురుకైనది. హీర్‌వలె తానుకూడా భగ్న ప్రేమాగ్నిలో దహించుకుపోతోంది. ఆమె హృదయాన్ని మురాద్‌బలోచ్ గాయపరిచాడు. భగ్నప్రేమానుభవమార్గంలో పయనిస్తున్న కారణంగా ఆమె హీర్ హృదయానురాగాన్ని గుర్తించకలిగింది. ఆమె హీర్ బాధను అనుభవించుటలో పాలు పంచుకోసాగింది. సైదాఖేడా హీర్‌తో మాట్లాడాలని ఎన్నో యత్నాలుచేశాడు. కాని లాభంలేకపోయింది. ఏనాడో ఆమె రాంఝూకు అంకితమైపోయింది. ఎంతోమంది కథాకారులు చెప్పినట్లు—ఎప్పుడైనా సైదా హీర్ సామీప్యానికి వస్తే అదృశ్య దేవతలు అతణ్ణి దూరంగా నెట్టివేసినట్లనిపించేది. అతను భయభ్రాంతుడైపోయేవాడు. హీర్ అంటే భీతిచెందేవాడు. అతని హృదయంలో భయం పీఠంవేసుకు కూర్చున్నట్లనిపించేది.

చాలారోజులు హీర్‌కు రాంఝూ విషయమే తెలియలేదు. ఆమెలో ఉదాసీనత అంతకంతకు పెరుగుతూంది. పగలంతా ఏమీతోచనిదానిలా పడివుండేది. చాప క్రింద నీటివలె గ్రామప్రజల్లో హీర్‌కు ఏదో భూతమావహించిందనే భావం వ్యాపించింది. ఎంతకూ రాంఝూ జాడతెలియని కారణంగా హీర్ ఝంగ్ గ్రామంలోని సియాల్ వంశంలో వివాహితురాలయిన ఒక అమ్మాయి ద్వారా కబురుచేసింది. ఆ అమ్మాయి తన కన్నవారింటికి వెళుతోంది.—"రాంఝూ, మన పవిత్రప్రేమను

అపవిత్రం కానవ్వవద్దు; నీవు యోగివేషంలో వెంటనే ఇక్కడికి రా" అని కబురు చేసింది. హీర్ స్నేహితురాండ్రు కూడ రాంఝూను రంగాపురం వెళ్ళమని ధైర్యం చెప్పారు. దాంతో అతను యోగి బాలనాధుని ఆశ్రమానికి బయలుదేరాడు.

రాంఝూ బాలనాథ్ మఠానికి చేరాడు. అతని నిరుపమాన సౌందర్యం— మిస మిసలాడే యౌవ్వనం చూసి యోగి ఆశ్చర్య చకితుడై పోయాడు. ఎంతోమంది ఆయనవద్ద ఎన్నో సంవత్సరాల నుండి యోగదీక్షకై పడిగాపులు పడిఉంటూ యోగీశ్వరుని పాదసేవచేస్తున్నారు. కాని వారికి దీక్ష లభించలేదు. కాని బాలనాథ్ రాంఝూకు తక్షణం యోగ దీక్షనివ్వడానికి సంతోషంగా అంగికరించాడు. గురువు తన శిష్యబృందానికి రాంఝూ యోగ దీక్షకు అవసరమైన ఏర్పాట్లన్నీ చేయమని ఆదేశించాడు. వారు రాంఝూపై అసూయతో మండి పడ్డారు. సర్వజ్ఞుడైన గురువు బాలనాథ్ రాంఝూ భక్తి-శ్రద్ధలను, హృదయ పరిపక్వతను ఆకళింపు చేసికొన్నాడు. రాంఝూ మొదటినుండి నిజమైన ప్రేమ యోగ శిఖరాన్ని అధిష్ఠించాడు. ఇక మిగిలింది. కేవలం యోగ వేషధారణ మాత్రమేనని గురువు గ్రహించాడు. అయినప్పటికి బాలనాథ్ దీక్షనొసగే సమయంలో నియమానుసారం రాంఝూకు యోగసాధనా విలువల్ని గూర్చి ఉపదేశం ఇచ్చాడు. ఆయన ఇలా అన్నాడు.

వడ్డీ మా ఊఁబరాబర్ ఛోటడీనూఁ
అతేభైన్ బరాబర్ ఛోటడీ సూఁ।

(తన కంటే పెద్ద వారయిన స్త్రీలను తల్లులుగాను, చిన్నయైన స్త్రీలను సోదరీ మణులుగా గౌరవించాలి.)

కాని రాంఝూ, నేనీ షరతులను అంగీకరించజాలనని, తాను హీర్ కొరకే యోగాన్ని స్వీకరిస్తున్నానని గురువుతో స్పష్టంగా చెప్పాడు. అదవిని బాలనాథ్ హృదయం కరిగిపోయింది. రాంఝూకు రుద్రాక్షమాల, యోగులు ధరించే టోపి, చెవులకు రాగి పోగులు, చేతికి పుర్రెనిచ్చి తన మఠం నుండి సాగనంపాడు. బాల నాథ్ కనుమరుగు పడేవరకు వెళుతున్న రాంఝూను బాలనాథ్ తదేక దృష్టితో ఏదో దివ్యానుభూతితో తిలకించాడు. ఆ తరువాత రాంఝూ ఆసీనుడై దీక్షను పొందిన శిలా ఖండానికి బాలనాథ్ ప్రణమిల్లాడు. అక్కడ నేటికీ ఆ శిల యోగ మఠంలో సురక్షితంగా ఉంది. అక్కడికి పోయే భక్తులు - యాత్రికులు ఇప్పటికీ ఆ పవిత్రశిలకు ప్రణమిల్లుతూ ఉంటారు.

రాంఝూ యోగి వేషంలో మఠం మెట్ల పైనుండి క్రిందికి దిగగానే అతని సౌందర్యము, తేజస్సు ద్విగుణీకృతమై చూపరులనేత్రాలకు మిరుమిట్లు గొలిపాయి రాంఝూ తన ప్రయాణ మార్గంలో ఎన్నో మజిలీలు చేసుకొంటూ చివరికి తన గమ్యస్థానమైన రంగాపుర సమీపానికి చేరుకున్నాడు అక్కడ పశువుల కాపరి నోట తన ప్రేమగాథను విని చకితుడయ్యాడు. తన ప్రేమగాథ ఆ ప్రదేశమంతా ఎలా తెలిసిందాయని తీవ్రంగా యోచింపసాగాడు. పశువులకాపరి నుండి రంగాపుర విశేషాలన్నీ తెలుసుకొని అతను గ్రామానికి చేరుకున్నాడు. మంచినీటికోసం గ్రామ నూతివద్దకు వెళ్ళాడు. అతని మనోహర రూపాన్ని చూసి అక్కడి గ్రామ యువతులందరూ మంత్ర ముగ్ధులయ్యారు క్షణకాలంలో అవివాహిత కన్యలు, నవోఢ యువతులు, గృహిణులు గుంపులు గుంపులుగా అతని చుట్టూ చేరారు. వారిలో హీర్ ఆడపడచు సైతీ కూడ ఉంది

> ఘర్ ఆకే ననాన్‌నే గర్ల కీతీ,
> ఖాబీ ఇన్ జోగి నవాఁఆయానీ।
> కన్నీ ఉసదే దరశనీ ముందరాఁనే,
> గలహైంకలా అజబ్ సుహాయానీ।
> షిరే భట కదా దిచ్చహవేలియాఁ వ్రే।
> కోయీ ఉసనేలాల్ వేంజాయానీ।

[ఇంటికి తిరిగి వచ్చి ఆడపడుచు ఇలా అన్నది "వదినా, ఒక నూతన యోగి మన వూరువచ్చి వున్నాడు. అతని చెవులకు రాగి పోగులున్నాయి. మెడలో రుద్రాక్షమాల ఎంతో శోభాయమానంగా వుంది. ఏదో అమూల్య రత్నాన్ని పోగొట్టుకొన్నవానిలా అతను ఈ భవనాల మధ్య తిరుగాడుతున్నాడు]

సైతీ మాటను విన్నదే తడవుగా హీర్ గుండె జల్లుమంది. రాంఝూయే యోగియై వచ్చి వుండవచ్చునని తలపోసింది, ఆమె హృదయం చక్రంలాగ అల్లల్లాడి పోతోంది ఆమె రోమ రోమం రాంఝూకై తల్లడిల్లుతోంది, సయ్యద్‌వారిస్ షా హీర్ స్థితిని గూర్చి ఎంతో కోమలంగా హృదయ విదారకంగా వర్ణించాడు.

> ముట్టీ ముట్టీ ఏ గల్లనా కరోభైనా
> మైఁతీ సుణదేయాఁహీలథ్ గయాజేనీ
> తుసాఁఏ జదో కణే గల్లకేతీ

మేరే ధుర్ కలే జదే పయీజేనీ।
ఫిరే వోస్త్ధ తూరా తే భంగ్ సేందా'
భాస్ ఉస్నే ముల్లక్యోంలయీజేసీ।
జిస్ భా ఉంచా పుత్త ఫకీర్ హోయా।
దిత్తారబ్బదా ఓహ్తాంనధి డడీ చౌద్ గయీజేనీ।

సోదరీ దాచి, దాచి మాట్లాడకు. నేను ఈ మాట విన్నంతనే చచ్చినంత పని యైంది. నీవు చెప్పిన మాట నా హృదయములో నాటుకు పోయింది. యోగి సారాయి, ఉమ్మెత్త కాయల భంగు త్రాగి, త్రాగి మృత్యువును ఎందుకుకొని తెచ్చుకొన్నాడు. కుమారుని సన్యాసాశ్రమం స్వీకరించడం మత్తు పదార్థాలను సేవించడం, కళ్ళారాచూసిన తల్లి ఎలా సహించ కలుగుతుంది. తన ప్రియుని చెవులు చిల్లులు పడేటట్లు కుట్టివుంటే ఇక నా జీవితం సర్వనాశనమైనట్లు భావించు]

హీర్ మనసులో ఒక సందేహం కలిగింది. ఆమె మాటి మాటికి—"భగవంతుడు నిజముగా రాంఝాను సన్యాసిని చేస్తే నేను సర్వనాశనం అయిపోయినట్లే ఇంతగా నమ్మిన నన్ను చిల్లుగవ్వకు కొరగాకుండా చేసినట్లే—" అని వాపోయింది. అతనే రాంఝాయని, హీర్ ప్రియతముడని సైతీకికూడ యింకా స్పష్టముగా తెలీదు.

మరుసటిరోజున రాంఝా పెళ్ళివారియింటికి భిక్షకై వచ్చాడు. సైతీ-రాంఝాల మధ్య ఆ సమయంలో కాస్త వాగ్యుద్ధమురేగింది. హీర్ వారివైపు వీపుపెట్టి అంతా వింటూవుంది. సైతీ యోగివేషంలోవున్న రాంఝాను- "నీవు నిజముగా యోగివైతే మా వదినగారి జబ్బు ఏమిటో చెప్పు"- అని గట్టిగా ప్రశ్నించింది. దాంతో అతడు హీర్ ప్రేమగాధను చెప్పనారంభించాడు. మాటల సందర్భంలో సైతీ-మురాద్ ప్రేమగాధనికూడా కదిలించాడు. అదిచూసి సైతీ కొంచెం మెత్తపడింది. ఆమె ఏదో సాకుతో దాసీని పిలిచి- "ఏమే, నీవు ఈ సన్యాసికి కాస్త భిక్ష తెచ్చిపెట్టు-లేకుంటే వదిలేటట్లులేడు-" అంది. దాసీ రాయిబా గుప్పెడు బియ్యంతెచ్చి అతని పాత్రలో వేయబోయింది. అతను భిక్షాపాత్రను చేతినుంచి జారవిడిచాడు. బియ్యం వాకిలంతా చెల్లాచెదురుగా పడిపోయాయి. రాంఝా హీర్‌తో మాట్లాడడానికై అట్లా చేశాడు. హీర్ యోగివైపు తిరిగింది. అతణ్ణిచూసి ఆమె అబ్బురపడిపోయింది. అతని ప్రేమదీక్షకు ఆమె విలువల్ని కట్టలేకపోయింది. సైతీకి హీర్ తన మనసంతా

దాపరికమంతా వివరించి చెప్పింది. వదినె-ఆడబడుచులు కలసి తమతిప ప్రేమను సఫలత చెందేందుకు మార్గాన్వేషణ చేయసాగారు.

రాంఝూ గ్రామ సమీపంలోగల తోటలో మకాం వేశాడు. ఒకప్పుడు అతను యోగివలె మృదువైన మాటలతో సరసంగా వ్యవహరించేవాడు. మరొకప్పుడు కటువుగా-భీతావహంగా కనబడేవాడు ఎంతోమంది కోర్కెలను తీర్చేవాడు. ఒక్కొక్కసారి దండం చేతబూని కోపంతో తనవద్దకు ఎవరినీ రావద్దని తరిమేవాడు అనేకమంది స్త్రీలు తమ హృదయ వేదనను యోగికి వివరించిచెప్పి తమ వేదనకు చికిత్స ఏమిటని అడిగేవారు. ఆఖరికి హీర్‌కూడ తన రోగానికి చికిత్స చేయించుకొనే నెపంతో రాంఝూను కలసుకొంది. రాంఝూ హీర్‌ను చూసి లేచి నిలబడ్డాడు. హీర్ యిలా వ్యవహరించింది:

అవ్వల్ పైర్ పడదే ఐరకాద్ కర్ కే,
ఫేర్‌నాల్ కలేజే దే లగ్గ గయీ।
నవాఁతౌర్ అజూబేదా నజర్ ఆయా.
దేఖో జల్ పతంగ్ తే అగ్గ గయీ,
కహీ లగ్గ గయీ, చినగ్ వగ్గ్ గయీ,
ఖబర్ జగ్గగయీ, వజ్రదగ్గగయీ,
యారో తగ్గాఁ దీరేవడీ హీర్ జట్టే
ముఁహా లగదేయోఁ జోగీనూఁ తగ్గ్‌గయీ
అగ్గేధు ఆఁ ధుఖాయా జోగియోఁదా
హూన ఫూర్ కే ఝుగదే అగ్గ గయీ.

[హీర్ ఎంతో శ్రద్ధగా యోగి పాదాలను తాకింది. ఒక్కసారిగా అతణ్ణి గట్టిగా కౌగలించుకొంది. అక్కడ ఒక నూతన విచిత్రం వెలుగొందినట్లయింది. దీపముపై మిడుతలు దహించుకుపోయినట్లయింది. ఒక చిన్న నిప్పురవ్వ దావాగ్నిని వెలిగించినట్లు వీరి ప్రేమాగ్ని ప్రపంచం నలుమూలలా ప్రసరించినట్లుంది. మోసగాళ్ళకు సర్దారు అయిన హీర్ ఆ యువయోగి ఎదుటకురాగానే అతణ్ణి మోసగించి ఎత్తుకొనిపోయినదని పెద్దగా ప్రచారం జరిగింది. ఒక విధముగా ఆ యువయోగి మొదట్లో ప్రేమాగ్నికణాలను వెలుగొందించాడు. ఇక ఈ ప్రేమాగ్ని తీవ్రతస్వరాన్ని దహించివేస్తుంది అనిపించింది.]

హీర్ తోటనుండి యింటికి మరలింది. ఆమె సైతీతో "సైతీ, నీకు నీ

ప్రియుడు లభించేటట్లు, నాకు నా ప్రియుడు లభించేటట్లు ఏదైనా ఉపాయం ఆలోచించు. మన ఇరువురి పున్నమవెన్నెలవంటి యవ్వనం మననుండి దూరమవుతూ వుంది. నేను ప్రతిరోజు తోటలోనికి వెళ్ళటం మంచిదికాదు. నేను ఇంట్లోవుండగనే కోరినపుడెల్లా నా ప్రియుడు నాకు గోచరించే మంత్రం ఏదైనావుంటేచెప్పుసుమా-" అంది ఆత్రముగా.

ఇంకేముంది హీర్-సైతీలమధ్య గాఢ స్నేహం కుదిరింది. ఆరోగ్యం కుదుటపడేందుకు హీర్ ఆరుబయట ప్రదేశాలలో తిరగటం అవసరమని సైతీ తన తల్లికి నచ్చచెప్పి ఆమెని ఒప్పించింది. మరుసటిరోజు ఉదయమే సైతీ, హీర్, ఆమె స్నేహితురాండ్రు నూతిచెంతకు చేరారు! అక్కడ హీర్ ఒక పెద్ద తుమ్మ ముల్లును తన కాలికి గుచ్చుకొన్నది. అదిచూసి వారంతా హీర్‌కు పాము కరచినదని గగ్గోలుచేశారు. దంతములుబిగించి, ఊపిరిబిగుసుకొని హీర్ నేలపైపడుకుంది. ఆమె ఊపిరి బిగబట్టింది. క్షణకాలంలో ఆమె శరీరము నీలి, పసుపు రంగుగామారింది. గ్రామ గ్రామమంతా కనురెప్పపాటులో అక్కడ వాలింది. మంచముపై పడుకోబెట్టి ఆమెను ఇంటికి తీసుకుపోయారు. ఎంతోమంది మంత్ర తంత్రగాళ్లు వచ్చారు కాని ఫలితములేకపోయింది "మన గ్రామపు తోటలో ఒక యోగి వచ్చివున్నాడు. అతను సిద్ధిపొందిన మహా యోగిగా కనబడుతున్నాడు" అని సైతీ చెప్పింది. యువతులంతా కలిసి సైదానుయోగివద్దకు ప్రోత్సహించి పంపారు. యోగి తన చేతి దండము తీసుకొని సైదాపై విరుచుకుపడ్డాడు. అతను ప్రాణము అరచేతిన బెట్టుకొని భయముతో గడగడ వణకుతూ ఇంటికి పరుగెత్తుకుపోయాడు. చివరికి సైదా తండ్రి అజ్జూ స్వయంగా యోగివద్దకు వెళ్ళాడు యోగి తన మనసులో తలచినట్లే జరిగింది. ఇక చెప్పవలసినదేముంది.

మంతర్ ఇక్‌తే పుతలియా దో ఉడ్డన్,
అల్లా వాలేయాం ఖేల్ రచాయా ఈ,
ఖిసకూ శాహ్ హోరీ అజ్ ఆన్ లత్తే,
తంబూ ఆణ ఉఘాలు ఆం లాయా ఈ.

(వారిస్ షా)

[మంత్రం ఒకటే అయినా, రెండు బొమ్మలు నాట్యంచేస్తున్నాయి. భగవంతుని లీలలు ఎంత విచిత్రం! ఖిసకతూ శాహ్ నేడు ఇచటకు దయచేసిరి స్త్రీలను తరుము కొనిపోయేవారు, తమ గుడారాన్ని వేసుకొన్నారు.]

సైతీ అన్ని ఏర్పాట్లుచేసేవని తనచేతిలోకి తీసుకొన్నది. ఊరిబయట మాదిగ వాడలో ఒక ఇంట యోగి బసచేసేందుకు ఏర్పాటు జరిగింది. గదిలో కేవలము పెళ్ళికూతురు లేదా ఒక అవివాహితకన్య మాత్రమే వుండాలి. తక్కినవారంతా అక్కడినుంచి వెళ్ళిపోవాలి వధువును ఏదో విషసర్పము కాటువేసింది. అని యోగి మహారాజు అన్నాడు.

నాఏ ఫనీ అర్ నాఫ తిలియర్
నా వైశక్ కౌదాఁ హోఈ,
నాఏహ్ కక్కాడ్ నా సంగచూడన్,
ఏనా విచ్చోఁ నా కోయీ,
ఏఁతాఁ ఖాధి చోటియాలే బిసీయర్
యైథోఁ చుట్టణ్ ముష్కాల్ హోఈ.

(దామోదర్)

[గోధుమనాగు, తెల్లనాగు, సాధారణ నల్లనాగుపాము కాటువేయలేవు. ఈ మెను నూరేండ్లు నిండి ముదిరిన నల్లత్రాచుపాము గట్టిగా కాటువేసింది. శరీరం నిండా బాగా విషమెక్కింది. ఈ విషాన్నితీయడం నాకు ఎంతో కష్టంగావుంది.]

ఇది విని అందరూ భయభ్రాంతులై అక్కడనుండి వెళ్ళిపోయారు. యోగి, సైతీ, హీర్ ముగ్గురూ అక్కడ మిగిలారు. అర్ధరాత్రివేళ రాంఝూ దేవతలను స్మరించాడు. బహా ఊల్ దీన్ జకరియా అనే దేవత ఒక్కసారిగా గభేలున ఒక గోడను పడగొట్టి దారిచేశాడు. రాంఝూ-హీర్‌లు తమ గదినుండి బయలుదేరి బయటకు పోయేటప్పుడు సైతీ- "నా ప్రియుణ్ణికూడా నాకు ప్రసాదించండి" అని అంది. రాంఝూ మళ్ళీ పంచదేవతలను స్మరించాడు. మురాద్ బలోచ్ ఒంటె ఘల్లుఘల్లుమనే గంటలతో అక్కడకు వచ్చింది.

# 3

తెల్లవారగనే ఖేడా రెండు దళాలను ఏర్పాటుచేశాడు. ఒక దళము హీర్‌వెంట, మరియొక దళము సైతీవెనుక పరుగెత్తారు. మొదటి దళాన్ని బలోచ్ చితుకకొట్టి తరిమివేశాడు. రెండవదళం రాంఝూను పట్టుకొని అతణ్ణి చితుకకొట్టి మృతప్రాయుణ్ణి చేసి హీర్‌ను తమవెంట తీసికొనిపోయారు రాంఝూ రాజయిన అదలీవద్దకు వెళ్ళి ఫిర్యాదుచేశాడు. రాజు అదలీ తన సైనికుల్ని పంపి హీర్-ఖేడాలను బంధించి తన

ఎదుటకు రప్పించాడు— "మహారాజా! ఇది ఏదో పెద్ద మోసంగా వుంది. మేము ఇతణ్ణి యోగియని భావించి నా భార్యకి వైద్యం చేసేందుకు పిలిపించాను. ఇత నేమో ఆమెని తీసుకొని పారిపోయాడు. రాజు హీర్‌ను ఖేడాకు అప్పగించాడు ఈ అన్యాయాన్ని చూసి రాంఝూ తీవ్రంగా నిట్టూర్చాడు. ఆ తరువాత నలువైపుల నుంచి ఆ గ్రామానికి నిప్పు అంటుకొన్నది. రాంఝూ మహిమను చూసి రాజుకు అతని నిజాయితీపై నమ్మకము కుదిరింది. రాజు మళ్ళీ హీర్‌ను రాంఝూకు అప్ప గించాడు అంతట ఖేడా ఏడ్పు మొరలతో రంగాపురము తిరిగి వచ్చాడు.

హీర్ రాంఝూలు కొన్నిరోజులు పర్వత ప్రదేశాలలో తిరిగారు. చివరకు ఇరువురూ ఝంగ్ గ్రామము తిరిగి పోవడానికి నిశ్చయించుకొన్నారు. వారు ఝంగ్ గ్రామము పొలిమేరలలో అడుగిడగానే ఆ ఊరి పశువుల కాపర్లు చూచక్ ఇంటికి వెళ్ళి ఈ వార్తను చెప్పారు. వారు వెళ్ళి హీర్, రాంఝూలను తమ ఇంటికి తీసుకొని వెళ్ళారు. రాంఝూ చెవులనుండి రాగిపోగులను తీసివేశారు. జడలు ధరించిన అతని సిరస్సును ముండనము చేయించారు. పాయసం తినిపించారు కూర్చునేందుకు వింత రంగులతో కూడిన పట్టె మంచముపై పాన్పును పరిచారు. కాని ఈ ఆతిధ్యమంతా కేవలం నటన అయినా లోలోపల వారు అప్రతిష్ఠ అనెడి భయముతో క్రుంగి కుమిలిపోతున్నారు. చివరకు వారు ఒక ఎత్తు వేశారు. వారు రాంఝూతో—"ఇలాఉంటే ఏమీ—బాగుండదు. రాంఝూ నీవు తఖ్త్ హజారా వెళ్ళి పెండ్లివారిని విడిదికి తీసుకొనిరా హీర్‌ను నియమానుసారం పెండ్లి చేసుకొని తీసుకొని వెళ్ళు. రాంఝూ తక్షణం తఖ్త్ హజారాకు బయలుదేరాడు. అతడు దారిలో రకరకాలుగా ఆలోచిస్తున్నాడు—ఇక వదినగార్ల గర్వము అణచి వేస్తాను. వారు నన్ను చేసిన పరిహాసానికి సమాధానంగా చెప్పుదెబ్బ ఇస్తాను, కాని మనిషి ఒకటి తలిస్తే, దైవము మరియొకటి తలుస్తాడు! అది అంతా విధి వైపరీత్యం!!

ఇంతలో తల్లిదండ్రులు అవమానము భరించలేక హీర్‌కు విషం ఇచ్చి చంపివేశారు. రాంఝూకు ఇలా కబురు పంపారు—మేమనుకొన్నది వేరు. జరిగింది వేరు. భగవంతుని లీలలు చిత్ర విచిత్రాలు. రాంఝూ చేతికి ఆ ఉత్తరాన్ని ఇస్తూ ప్రతివాహకుడు వెక్కి వెక్కి ఏడ్వడం మొదలు పెట్టాడు—బాబు హీర్ ఆ భగ వంతుని చేరిపోయింది—అని గద్గద కంఠముతో వెక్కి వెక్కి చెప్పాడు.

ఇది వినడమే తడవుగా రాంఝూ ఒక నిట్టూర్పు విడిచి ప్రాణాన్ని వదిలాడు.

# 4

హీర్ ప్రేమకథ ప్రప్రథమముగా దమోదర్ కవి వ్రాశాడు. అతను ఝంగ్ గ్రామానికి కరణము. అతను అక్కడక్కడ "అఖ్ దమోదర్ అసాఁ అక్షీఁ డిట్ఠాజొనిర్ సవేటీ దేఖేతీ" (ప్రేమమూర్తి హీర్ జీవితపు అంతిమ గడియలలో జరిగిన విషాదాంతము నా కళ్లారా చూశాను—అని దమోదర్ కవి అంటాడు.)

దమోదర్ హిందూ పరంపర ననుసరించి కథను దుఃఖాంతము చేయలేదు. అతనురచించిన కథాంతములో హీర్—రాంఝూలు మక్కా యాత్రకు వెళ్ళిపోతారు. దమోదర్ రాంఝూ, వారిస్ రాంఝూవలె ఆరోగ్యవంతముగా పంజాబు దేశస్థునివలె కనబడడు కృష్ణ భగవానునివలె మురళీ చేత ధరించి, మనోహర మూర్తిగా, ఆభరణాల నలంకరించిన బాల గోపాలుడుగా కనపడతాడు. ధీవర్ మసీదుకు వెళ్ళే టప్పుడు రాంఝూ నిరుపమానమైన సౌందర్యాన్ని చూసి ఇలా అంటుంది:

> దేఖ్ వికాణీ ధీవర్ ఆనీ
> కదమ్ ఉఠీవస్ నాహీఁ
> హేః జే చుఖ్ వదేరా హోవే ।
> తాఁ ఆప్ వియాహ్ కరాఁ ఈః ।

(ఇతణ్ణి చూసి ధీవరీ, మారు మాటాడకుంటానే అమ్మడు పోవడానికి సిద్ధపడింది. ఒక్క అడుగుకూడ ముందుకు వేయలేకపోయింది. అంగీకరిస్తే నేను స్వయంగా ఇతణ్ణి వివాహమాడతాను.

కాని దమోదరునికి విరుద్ధముగా వారిస్ షా కథని విషాదాంతముగా ముగించాడు. షియా ముస్లిం అయి ఉండడంవలన వారిస్ షాకు విషాదాంతానుభవము ఎక్కువ. అందువల్ల ఆయన ఈ కథను విషాదాంతము చేసి, కళ్ళకు కట్టినట్లు చిత్రించాడు.

ఎంతోమంది హీర్ కథానికను కల్పనా గాధగా భావిస్తారు. కాని ఝంగ్ గ్రామములో హీర్ సమాధి నేటికి వుంది. ఈనాటి వరకు "మాయీహీర్ (అమ్మ) హీరమ్మ" అని ఆమెను ఆరాధిస్తారు. అక్కడి ప్రజలు ఈ కథలో కొన్ని మలుపులు క్రొత్త క్రొత్తగా తిరిగినా ఇది తప్పక జరిగిన గాధయని ఈ సమాధీ ఋజువు చేసుంది. అంతేకాదు; హీర్ రాంఝూల ప్రేమగాథ పంజాబీయుల హృదయంలో ఎంత ప్రభావిత ముద్ర వేసుకుందంటే వారిరువురూ కేవలం భౌతిక ప్రేమకు సంకేతాలుగానే కాక, ఆత్మ పరమాత్మలకి చిహ్నాలుగా పంజాబీయులు గావిస్తారు.

# మిరజా-సాహిబాఁ

—గురుభక్ష సింగ్

గబ గబా నడుస్తూ వయ్యారంగా ఊగుతూ, జోగుతూ ఓ అమ్మాయి ఒక ఇంటి గుమ్మం దగ్గర నిలబడి తలుపు తట్టి పిలుస్తుంది. ఇంటి లోపలనుండి సమ వయస్కుడైన ఒక అబ్బాయి ఆదరా-బాదరా బయటకు వస్తాడు. 'వద్దు-వద్దు' అంటున్న ఆ అమ్మాయి పుస్తకాల సంచి లాక్కొని తన సంచితోబాటు భుజానికి తగిలించుకొంటాడు. ఉషారుగా ఇద్దరూ పాఠశాలకి బయలుదేరతారు.

'ఓ మిరజా నీవు నా పుస్తకాల సంచి ఎందుకు తీసుకొంటావు'?

'నీ పుస్తకాల సంచి తీసుకొంటేనే నాకు పాఠశాలకు రావాలనిపిస్తుంది. అసలు చదువు అంటే నాకునచ్చదు.'— ఆ అబ్బాయి అమాయికంగా సమాధానం చెప్పాడు

'నీకు నచ్చకపోయినా చదువుకో అని నేను అంటూనే ఉంటాను. ఏదైనా పుస్తకం చదువుతూ వుంటే నాకు ఎంతో ఆనందంగా ఉంటుంది. ప్రస్తుతం నేను ఒక పుస్తకాన్ని చదువుతున్నాను. అది చదువుతున్నంతసేపు చాలా ఆనందంగా ఉంటుంది.' అంటూ ఆ పిల్ల తన పక్కనే నడుస్తున్న స్నేహితుడి నడుము చుట్టూ చేయి వేసింది.

'సరే-మంచిది.—సాహిబాఁ! నీవు చెప్పినట్లుగానే నేను చదువుతాను. కాని, ఆ మౌల్వీ సాహెబుగారు పాఠం చెపుతుంటే. అది నాకు ఎంతమాత్రము బుర్ర కెక్కదు ఇది నాకు పెద్ద తలనొప్పిగా వుంది, —తన నడుముచుట్టూ వున్న అమ్మాయి చేతి వేళ్ళను తనలో తాను లెక్కిస్తున్నాడు.

మౌల్వీ సాహెబు వచ్చి అరుగుపైన కూర్చున్నాడు. తరగతిలో మౌనంగా కూర్చున్న మిరజాను చూశాడు. అతను సాహిబాఁ కుడివైపున ఉదాసీన భావంతో కూర్చున్నాడు.

"అమ్మాయీ, సాహిబాఁ! నీవు నీ స్నేహితుణ్ణి బాగా చదివేటట్లు చూడు. చదువంటే అతనేమీ పట్టించుకోడు-చూడు, మౌనంగా—రాయిలా అతడు ఎలా

కూర్చున్నాడో! చదువుకునేందుకు మసీదులో అడుగు పెట్టేసరికి ఉదాసీనంగా అయి పోతాడు. మసీదునుండి బయటకు అడుగు పెట్టగానే ఎంతో ఉల్లాసంగా కన బడతాడు."

"అవునండీ, నేను ఈవేళ ఎంతో నచ్చచెప్పాను. ఇకనుండి బాగా చదువుతానని అంటున్నాడు."

"ఓ మిరజయా బాబూ! నామాట విని ఇకనుంచి బాగా చదివితివా మంచిదే. తరగతిలో రాయిలా కూర్చుంటే—మీరు వచ్చి మీ అబ్బాయిని దానబాదుకు తీసుకొని వెళ్ళిపోమని మీ నాన్నగారికి కబురు చేస్తాను. ఇక్కడ అనవసరంగా నీ సమ యాన్ని-నాసమయాన్ని పాడుచేస్తున్నావు సుమా."

"మౌల్వీజీ! మీరు ఇంకొక్కవారం ఓపికపట్టి చూడండి. నేను అతని మేనత్త బీబో యింటికి వెళ్ళి అక్కడ ఇతను చదివేట్టు చూస్తాను. ఇతని మన సులో చదువుపట్ల శ్రద్ధ కలుగలేదు. వయస్సుకు కాస్త పెద్దవాడే మరి "

మసీదు స్కూలు విడిచిపెట్టగానే సాహిబాఁ మిరజాతోపాటు అతని మేనత్త బీబో యింటికి వెళ్ళి మౌల్వీ చెప్పిన మాటలు ఆమెకు చెప్పింది. అంతకు క్రితం కూడా బీబో కూడ బాగా చదువుకోమని మిరజాకు చెబుతూ వస్తుంది, అయినా, ఆమె ఈరోజు చెప్పిన మాట అతని లేత హృదయములో గట్టిగా నాటుకు పోయింది

"అబ్బాయీ! మౌల్వీగారు మీ నాన్నగారికి నీగురించి ఉత్తరం వ్రాస్తే నేను నీపట్ల శ్రద్ధ తీసుకోలేదని మీ నాన్న అనుకొంటారు. నీవు సరిగ్గా చదువుకోవడం లేదని ఆయనకి తెలిస్తే రెండు రోజులలో వచ్చి నిన్ను తీసుకొని పోతారు. ఆయన ముందు బ్రతికినంతకాలం సిగ్గుతో తల వంచుకోవలసి వస్తుంది."

బీబోకు సంతానం కలుగలేదు. అందుచేత తన సోదరి కుమారుని తెచ్చు కుంది. సియాలులోని మౌల్వీ కూడ మంచి పండితుడుగా పేరు పొందాడు సాహిబాఁ మిరజా మేనమామ కూతురు.

"నిజమే అత్తా! నా చదువుకూడ అంతటితో ముగుస్తుంది. నేను ఇక పెద్దదానినయ్యానని అమ్మ అంటూనే వుంది. నన్ను చదువుకోసం మసీదుకు వెళ్ళవద్దని గోల పెడుతోంది. నేను అమ్మతో మిరజా వుంటాడుగా భయ

మేమిటి అని ధైర్యం చెబితే ఆమె ఒప్పుకొంటుంది. ఇక మిరజా లేకపోతే అమ్మ నన్ను స్కూలుకు వెళ్ళనివ్వదు

ఇది విని మిరజా దీర్ఘాలోచనలో పడ్డాడు.

"బాబూ మిరజా మాట్లాడు నాయనా నీవు నా యింటిలో ఉంటే శూన్యంగా వున్న ఇల్లు ఆనందమయంగా అవుతుంది. నీవు నాగురించియైనా మనసు నిలిపి చదివావా-ఎంతో సంతోషం నేను నా చెల్లెలిముందు నిజాయితీ గల మనిషిగా చలామణి అవుతాను." అని మేనత్త ఆర్ద్ర హృదయంతో అంది

వాత్సల్య ప్రేమతో నిండిపోయిన మిరజా సంవత్సరపు చదువును ఒక నెలలోనే పూర్తి చేశాడు. మౌల్వీ మిరజాను చూసి పరమానందం చెందాడు దగ్గరకు తీసుకొని అతని వీపు తట్టాడు.

ఇంతకు ముందు సాహిబాంతో కలిసి స్కూలుకు వెళ్ళడం-ఆమెతో మళ్ళీ తిరిగి రావడం-ఇదే మిరజాకు సంతోషకర విషయం ఇక ఇప్పుడు అతను పగలస్తమానం బాగా చదువుకోవడంతో కాలం గడచిపోతోంది. మేనత్త ఎంతో పరవశం చెందింది. మౌల్వీ తన శిష్యుణ్ణి చూసి పరమానంద భరితుడయ్యాడు, ఇక సాహిబాం విషయం చెప్పాల్సిన అవసరం లేదు...............ఆమె ప్రతి రోజు మిరజాతో కూర్చుని స్కూలులో యిచ్చిన పాఠాలను చదివేది. అతనిచే చదివించేది మిరజాకు నిత్యం సాహిబాం తన ప్రక్కను కూర్చుని ఉన్నట్లే తోచి, ఉల్లాసంగా చదివేవాడు.

అతను సాహిబాం పుస్తకాల సంచి తీసుకొని వెడుతూ ఉన్నట్లు, తన నడుముకు చుట్టిన ఆమె చేతివేళ్ళను లెక్క పెడుతున్నట్లు దూరంగా ఉన్న స్కూలుకు వాళ్ళిద్దరు హుషారుగా వెళ్ళుతున్నట్లు కలలు కనేవాడు. వారి హృదయాలలో ఏదో అనిర్వచనీయమైన ఆనందం నిండి పరవళ్ళు తొక్కేది. ఆ ఆనందాతిరేకంలో చటుక్కున అతను గాభరాతో నిద్రనుంచి మేల్కొనేవాడు.

కొన్ని రోజులు గడచిన తరువాత మీరజాకు మరో విధమైన స్వప్నాలు రాసాగాయి...............సాహిబాం అతణ్ణి చదివిస్తూ వుంది; పుస్తకాలు త్వర త్వరగా సమాప్తమైపోతున్నాయి...............చివరకు చదువుతున్న పుస్తకం క్రింద పెట్టేసి ఆమె అతని మిల-మిల మెరిసే కళ్ళవైపు చూస్తూంది. మిరజాచెయ్యి పుచ్చుకొని "ఇక నేను నిన్ను చదివించేదేముంది? నన్ను పూర్తిగాచదివి వేశావు"- అని

అంది. సాహిబా వేళ్ళస్పర్శతో అతని కోమల హృదయంలో ఎన్నో పాఠాలు లిఖితమవటం—ఇంతలో త్రుళ్ళిపడి నిద్రనుంచి మేల్కొనడం జరిగేది. ఆ జాగృతావస్థ స్వప్నావస్థ ముందు అతి నీరసంగా ఉండటం చూసి మళ్ళీ కళ్ళు గట్టిగా మూసుకునేవాడు— "మిరజియా! ఇంతసేపటివరకు చదివినా నీకు ఇంకా తృప్తి కలుగలేదు. అందుచేతనే మళ్ళీ నావద్దకు వచ్చావా?" సాహిబా నవ్వుతున్న ముఖం మళ్ళా కలలో కనపడేది. "సాహిబా! నేను ఇప్పుడు చదువుకోవడానికి రాలేదు. నీతో కలిసి కాస్సేపు గగన వీధుల్లో విహరించాలని మనసు ఉవ్విళ్ళూరు తూంది. చక్కని గుఱ్ఱాన్ని తీసుకొని వచ్చాను. ఇక నీవు నావెనుక కూర్చో" అని ఆప్యాయంగా అన్నాడు. నిజానికి, అతను భువిపై కాదు; గగన వీధుల్లో విహారం చేస్తున్నాడు.

ఆ సంవత్సరం మిరజా-సాహిబాల వయసులో అతి మధురమైన ఘట్టం. పగలు జరిగినవి రాత్రుళ్ళు నక్షత్రాలుగా మారి వారి కలల్లో మిణుకు-మిణుకుమంటూ ఉండేవి. భూమ్యాకాశాలు వివిధ రంగులతో విలసిల్లుతున్నాయి. వారి ఆత్మలు చెట్టా-పట్టాలు వేసుకుని మధురమైన యవ్వనపు ఉద్యానవనాల్లో ప్రవేశిస్తున్నాయి

అబ్బాయి చదువు బాగా సాగుతోందని, అతడు శ్రద్ధగా చదువుతున్నాడని తండ్రికి కబురు అందింది ఆపేక్షగా ఒకరోజున కొడుకుని చూడాలని వచ్చాడు అతని బలమైన శరీరాన్ని చూసి తండ్రి హృదయంలో గిలిగింతలు గలిగాయి

వీణ్ణి ఈ తొలి యౌవ్వనంలో విలువిద్యలో నిపుణున్ని చేస్తాను గుఱ్ఱపు స్వారిలో ఇతనిని మించినవాడెవడూ లేడనిపించాలి. ఎంతటి బలమైన శత్రు వయినా ఏమాత్రం కష్టం ఇతనికి కలిగించని విధంగా సమర విద్యలో తయారు చెయ్యాలని అతను యోచించాడు.

అతను తన మరదలు బీబోతో మాట్లాడాడు "ఇంకా, మిరజా ఒక సంవత్సరం పాటు చదవాలి"— అనిసలహా ఇచ్చింది.

దాంతో బింజల్ ఖరల్ తల ఊపుతూ— "అదికాదు బీబో! నేనెంతగానో చదివాను. భూమి కలవారికి శత్రువులు అనేకమంది యుంటారు. వీడిలో యౌవ్వనపు ఛాయలు గోచరిస్తూన్నాయి. ఇక ఇతన్ని కత్తిసాము, విలువిద్య, గుఱ్ఱపుస్వారిలో అసమానుణ్ణి చేస్తాను. యుద్ధ విద్యలో మిరజాను మించినవాడు

మరొకడు లేకుండా చూస్తాను-" అని అన్నాడు మిరజా దానాబాద్ వెళ్ళక తప్ప లేదు. తన మేనత్త ను మిరజాను రెండురోజులు తన ఇంటికి తీసుకొని రమ్మని పట్టు పట్టింది.

ఆ రెండు రోజులు ఒక్క క్షణంకూడ ఎడబాటు లేకుండా మిరజా-సాహిబాఁలు కాలం గడిపారు. ఒక పళ్ళెంలో రొట్టెలు తినేవారు. ఏమేమో అమాయకంగా మాటలాడుకొనేవారు.

"సాహిబాఁ నీవు పుస్తకం చదివి నాకు కొన్ని కథలు వినిపించు. నీకు నచ్చినవే నాకూ నచ్చుతాయి"— అని మిరజా కోరాడు. తక్షణం సాహిబా పరుగు-పరుగున వెళ్ళి పుస్తకం తెచ్చింది. అటు, ఇటూ పేజీలు తిరగవేస్తూ ఒక కథను వినిపించింది. ప్రేమ మూర్తీభవించిన శిల్పంలాటి ఒక యువరాణి కథ అది

"ఈ కథ నీ స్వంత కథలాగ చెప్పినట్లుంది.........." అంటూ మిరజా నిశ్చేష్టుడై కథ అంతం కావడం చూసి ఉలిక్కి పడ్డాడు.

"మిరజా, నీవు నాకు ఏదో పెద్దవాడివిగా కనబడుతున్నావు"— అంటూ సాహిబాఁ అతని గడ్డంమీద చిటిక వేసి,— చిన్నపిల్ల ఒక్కసారిగా నిండు యౌవ్వనవతియై పవిత్ర ప్రేమలో మునిగిన యువతివలె ఉంది నా స్థితి"— అంది

"సాహిబాఁ! ఇంకా నాకు కథ వినిపించు"— అంటూ ఆమెను ఎంతో మెచ్చుకొన్నాడు మిరజా గుక్క తిప్పుకోకుండా నాలుగైదు కథలు మిరజాకు వినిపించింది సాహిబాఁ ఒక్కసారిగా ఆమె మనసుకు యేమి తోచిందో తెలీదు. పుస్తకం మూసివేసింది— "మిరజియా! ఎప్పుడైనా నీవు నన్ను తలచుకొంటావా? చెప్పు—" మిరజా భుజంపై చెయ్యివేసి అడిగింది.

తలుపులన్నీ వేసియున్న గది తలుపులు, కిటికీలు ఒక్కసారిగా తెరచుకుంటే బయట వున్న వెలుతురు ప్రవాహంగా లోపలికి చొరబడి కళ్ళను మిరిమిట్లు గొలుపుతుంది. అదే విధంగా మిరజా హృదయంలో కంపిస్తూ నాట్యంచేస్తున్న భావాలు పెదవులు దాటి బయటకు రాలేకపోయాయి. అతను సాహిబాఁకు సమాధానం చెప్పలేకపోయాడు.

"మిరజియా! నీవు నన్ను పూర్తిగా మరచిపోతావన్న మాట"!— మిరజా

హృదయం పూర్తిగా తెలుసుకుని కూడా సాహిబాఁ అమాయకంగా అడిగింది.

"సాహిబాఁ! నేను నీగురించి ఏదీ మరవలేను"— అతని పెదిమలు వణికాయి

సాహిబాఁ అతని పెదిమలను శ్రద్ధగా చూసింది— అతని కళ్ళని గమనించింది అస్పష్టంగా అశ్రువులు కనబడ్డాయి. కన్నీరు జలజలా రాలుతాయేమో ననే తలంపుతో అతణ్ణి మరొక ధోరణిలోనికి సంభాషణ మార్చుతూ— "మిరజియా నాకు సంబంధించిన ఏ విషయమూ ఎక్కువగా జ్ఞాపకం ఉంటుందో చెప్పు" అంటూ తన రెండు చేతులతో మిరజా అరచేతిని నిమిరింది.

నా నడుము చుట్టూ నీచెయ్యి.........కాదు, కాదు నాకు నీవు చదువు చెప్ప డానికి నువ్వు రావడం-ఇదీకాదు- అన్నిటికంటె ఎక్కువగా జ్ఞాపకం ఉండే విషయం— రాత్రి నాకు వచ్చిన కల అది ఏమిటో నీకు తెలుసా? అవగానే నీ ముఖ కవళికలు మారడం. అది శాశ్వతంగా నా కళ్ళ ఎదుట కొట్ట వచ్చినట్లు నిలుస్తుంది.........సాహిబాఁ! నిజం చెప్పనా? నేను నీ విషయం, ఏది బాగా జ్ఞాపకం చేసుకొంటానో తెలీదు— కాని, నేను నిన్ను ఎన్నటికి మరవను—మరువ లేను— అన్నది నాకు బాగా తెలుసు"

మరుసటిరోజు ఉదయం అల్పాహారం చేసిన తరువాత బింజల్ ఖర్ల్ తన గుఱ్ఱమెక్కి తన గ్రామానికి ప్రయాణమయ్యాడు. మిరజా మేనత్తను ఆలింగనం చేసికొని తన జేబునుండి ఒక చాకు తీసి సాహిబాఁకు తన జ్ఞాపకార్థం ఇవ్వమని అందిస్తుండగా తండ్రి అతణ్ణి త్వరగా రమ్మని పిలిచాడు. అతి కష్టంగా కాళ్ళు కదిలాయి. పదే-పదే సాహిబాఁను అనురాగంతో చూస్తూ మిరజా తండ్రి వెనుక గుఱ్ఱంపై కూర్చున్నాడు.

దానాబాద్ చేరడమే తడవుగా తండ్రి మిరజాను సమర విద్యాభ్యాసానికై అనుభవజ్ఞుడైన గురువుకు అప్పగించాడు.

తండ్రి అశ్వశాలనుంచి తన స్వారీకై మిరజా ఒక గుఱ్ఱాన్ని ఎన్నుకున్నాడు. అది గాలిలో ఎగిరి వెళ్ళుతున్నదాయన్నంత వేగంగా పరుగెత్తే గుఱ్ఱం. ఎంతోమంది రౌతులు దానిపై స్వారి చేయడానికి జంకారు. దానిపై స్వారి అంటే మృత్యువుతో చెలగాటమే. మొదటిసారిగా చూడగానే ఆ గుఱ్ఱం మిరజాను తనకు తగిన రౌతుగా గుర్తించింది.

సంవత్సరాలు గడచిపోతున్నాయి. కలలోకన్న ఉత్తమజాతి గుఱ్ఱం మిరజాకు లభించింది. తన కలలోని ప్రియురాలు తనతోబాటు గుఱ్ఱంపై వున్నప్పుడు కూర్చుంటుంది అవి ఆలోచించాడు. సాహిబాఁ తనజ్ఞాపకార్థం మిరజాకు అలఫ్-లైలా పుస్తకం ఇచ్చింది. ఆమె వినిపించిన కథలన్నీ ఆ పుస్తకంలో పదే పదే చదివేవాడు. రాత్రిళ్ళు సాహిబాఁ అన్వేషణలో గుఱ్ఱంపై ఆకాశ వీధుల్లో విహరిస్తూయున్నట్లు కలలు కంటూ ఉండేవాడు..................

ఎన్నోసార్లు అతనికి సియాల్‌కు బయలుదేరి వెళ్ళాలనిపించేది.— సియాల్‌లో సౌందర్య వసంతం వెల్లివిరిసిందని అతనికి వార్తలు అందుతూ వుండేవి.

సాహిబాఁలో నిండు యౌవ్వనం తొణికిసలాడుతోంది. జీవనసాగరం తరంగాలతో నిండిపోయింది. ఆమె రోజూ బీబో యి టికి వెళుతూ వుండేది. బీబో మిరజా వెళ్ళాక చాలసార్లు దానాబాద్ వెళ్ళివచ్చింది. ఓమాటు మిరజాను కలుసుకుని వచ్చింది...............

"మిరజా ఎంత అందంగా వున్నాడు!" మేనత్త నోటినుండి ఈ మాట వినగానే సాహిబాఁ ఆనందంతో పరవశం చెందింది — అత్తయ్యా! మీరు మిరజాను ఒక్కసారి సియాల్‌కు రమ్మనమని అనలేదా?" అంది.

"మిరజా ఇక్కడకు రావాలని ఎంతో ఆరాటపడుతున్నాడు కాని మా బావ ఖానేకు ఒకటే పిచ్చి-ఈ లోకంలో మిరజాలాంటి విలుకాడు-కత్తిసాము గుఱ్ఱపుస్వారి చేయుటలో అతణ్ణిమించి మరొకడు ఉండకూడదట-రాత్రింబవళ్ళు గురువు అతణ్ణి అంటిపెట్టుకునే ఉంటున్నాడు" అంది.

"అత్తయ్యా, ఒకానొకప్పుడు నేనుకూడ మిరజాకు గురువునని అతనికి జ్ఞాపకం వుందా?" అని సాహిబాఁ ప్రశ్నించింది.

అతనికి జ్ఞాపకం లేకనా నీవు అడిగేది? ఎంతమాట! నీవు ఇచ్చిన పుస్తకం మిరజా నా వద్దకు తెచ్చాడు ఏమాత్రం అవకాశం దొరికినా-ఒకటో రెండో కథలు చదువుతూ ఉంటానని సాహిబాఁకు చెప్పండి సుమా అని నాతో అన్నాడు." అంది బీబో.

రాత్రి పొద్దుపోయేవరకు సాహిబాఁకు నిద్ర పట్టేదికాదు. అదే పనిగా ఆలోచిస్తూ ఉండేది- మిరజా నాకు ఏమవుతాడు? అతను ఇక్కడకువస్తే అతని నడుముపై తనచెయ్యి వేయగలుగుతుందా? మిరజా తనచెయ్యి ఆమె భుజంపై

వేస్తే ఆమెకెలా వుంటుంది?- ఇలా తలుచుకుంటూ ఉంటే ఆమె శరీరమంతా ఒక్కసారిగా గగుర్పాటు చెందేది. ఈ ఆలోచనా ప్రవాహంలో కొంతసేపటికి ఆమెకు నిద్ర పట్టేది కన్ను మూయగానే మిరజా అమాంతంగా వచ్చి తన గుఱ్ఱంపై ఎక్కించుకొని మబ్బులలో ఆమెను తీసుకొనిపోయి గగన విహారం చేస్తున్నట్లు స్వప్న లోకంలో మునిగిపోయేది.

సాహిబాఁకు వివాహ సంబంధాలు వస్తున్నాయి. బీబో ఒకసారి సాహిబాఁ తల్లితో మిరజాలాంటి వీరుడు మరెక్కడా లభించడు అని అంది. సాహిబాఁ తల్లికి ఆమాట ఎంతో నచ్చింది. ఆమె తనభర్త ఖీవాఖాన్ ఉద్దేశం అడిగింది. ఖీవాఖాన్ చాల దూరదృష్టి కలవాడు. —"అమాయకురాలా! మనకు లేక లేక ఒక అమ్మాయి ఈపిల్ల ఏదైనా గొప్పయింటి కుర్రాణ్ణి మన అల్లుడిగా ఎందుకు చేసుకోకూడదు? బిజల్ అంతస్తు మన అంతస్తుకు మించినది కాదు. చందద్ వంశం వారు మనకు పాటివారవుతారు. వాళ్ళు మంచి హుందాగా, వ్యవహరిస్తారు. వారి యింట తాహిర్ అనే పెళ్ళికాని కుర్రాడు ఉన్నాడు వారితో మనకు బాంధవ్యం కుదిరితే మనరొట్టె నేతిలో పడ్డట్టే వారి ప్రతిష్ఠ ఐశ్వర్యాలు మనకు దక్కినట్లే అవుతుంది" అన్నాడు అభిమానంగా.

తండ్రి మాటలు విని సాహిబాఁ ఎంతో బాధపడింది. ఆమె శరీరంపై తేళ్ళు, జెర్రెలు ప్రాకినట్లయింది. ఆమె హృదయం తునాతునకలయింది. మేనత్త బీబో ఇంటికి వెళ్ళి ఎంతగానో ఏడ్చింది.— అత్తయ్యా నీవు వెళ్ళి తన తల్లిదండ్రులను ఒత్తిడి చేయమని మిరజాకు చెప్పు. నీవే నన్ను కాపాడాలి- నాన్న నసేమిరా అంగీకరించడు" అంది, సాహిబా హృదయ వేదనతో.

బీబో దానాబాద్ వెళ్ళింది. అక్క, బావగార్లను సంప్రతించింది. బీబో అక్కకు తన తండ్రి స్వభావం బాగా ఆకళింపు చేసికొన్న వ్యక్తి. తన భర్తకు స్వాభిమానం మెండు. ఇరువురు వీరి పెళ్ళికి సుతరామూ ఇష్టపడ్డంలేదు-అతను "ఖీవాచందద్‌తో సంబంధం కలుపుకోవాలని వుంది-నేను సాహిబాఁ తండ్రివద్దకు వెళ్ళి ఈ సంబంధాన్ని గురించి మాట్లాడను" అని బిజల్ కుండ బద్దలు కొట్టినట్లు చెప్పివేశాడుకూడ

గత్యంతరం లేక చివరికి బీబో మిరజాకు ఎంతో నచ్చజెప్పింది సాహిబాఁను చేసుకొనే హక్కు ముందు తనకే ఉందని తన తల్లిదండ్రులతో గట్టిగా

చెప్పమన్నది. "మిరజియా, ఆలస్యం అమృతం విషం-ఇక ఎంతమాత్రం ఆలస్యం జరగడానికి వీలులేదు పెండ్లి చూపులకు రమ్మని పిలవడానికి పురోహితుడు చంధడ్ వారి యింటికి వెళ్ళడానికి సిద్ధంగా వున్నాడు. అది తెలిసి సాహిబా౯ తిండి తిప్పలు మానేసి నీపై బెంగ పెట్టుకు కూర్చుంది"- అంది బీబో.

మిరజా తన విలువిద్య గుఱ్ఱపుస్వారి కత్తిసాములు ఒక్కసారిగా మరచి పోయాడు. మేనత్తతో కలసి సియాల్‌కు చేరాడు.

సాహిబా౯ స్థితి అంతా విచిత్రంగా వుంది. వాళ్ళ యిద్దరి కలయికను గూర్చి ఎన్నో రకాల ఊహలు ఆమె మనస్సులో గూడు కట్టుకొని ఉన్నాయి; మిరజాను చూసేసరికి ఆమె చేతులు పైకి లేవలేదు; పెదవులు చలించలేదు. ఒక్కసారిగా కొట్టవచ్చినట్లు తన కలలన్నీ కళ్ళముందు నిలబడినట్లయింది.

మిరజా ఆమెను చూశాడు ఆమె భుజంపై చేయి వేద్దామని అతనికి అనిపించింది. కాని ఆ భుజం ఇదివరకులాంటి భుజం కాదు; ఆమె చెయి పూర్వంలా రోజూ అతని నడుంచుట్టూ చుట్టే చెయ్యి కాదు.

"సాహిబా౯!" అతని నోటినుంచి ఒక్కమాట పెగలి వచ్చింది.

"మిరజియా!" అని మాత్రము సాహిబా౯ సమాధానం ఇవ్వగలిగింది.

వీలుచూసుకుని చొరవతీసికొని మిరజా తన తాతగారిని కలుసుకుని మాట్లాడాడు "తాతగారూ! నేను మీ మనుమడను-ఇందులో సందేహం లేదు. ఇక మీరు నన్ను మీ కుమారునిగా గుర్తించండి. నేను సాహిబా౯తో చిన్ననాటినుంచి ఆడుకున్నాను చదువుకున్నాను; ఆమెను మరొకరికిచ్చి పెళ్ళి చేయడం నాకెంతమాత్రము ఇష్టము లేదు. ఆమెపై నాకున్న అధికారాన్ని వమ్ముచేయడం మా ఇరువురి మధ్యనున్న ఆత్మీయతను పాడు చేయడమే అవుతుంది."

"అబ్బాయీ మిరజియా నీవంటే నాకు ఎంతో వాత్సల్యం. కాని సాహిబా౯కు మరొక్క సోదరి ఉండి ఉంటే నేను నీమాటను కాదనేవాడను కాదు. చంధడ్ వంశంతో బాంధవ్యం కలుపుకొని నిశ్చింతగా ఉండాలని నా కోరిక. వారితో ఈ సంబంధం కుదిరితే ఇక నన్నెవరు కన్నెత్తియైనా చూడ సాహసించరు. మీరు మాకు దూరంవారు కానేకారు; ఆప్త బంధువులు"- అన్నాడు నిదానంగా తాతగారు.

"తాతగారూ, ఇప్పటికీ మిమ్మలను కన్నెత్తి చూడగలిగేవాడు పుట్టలేదు. నా తండ్రికి నేను ఏకైక పుత్రుడనైతే వచ్చే ఇబ్బంది ఏమీ లేదు. నేను ఒక్కడనే అయినా పదకొండు మందితో సమానం" అని దృఢంగా పలికాడు మిరజా

"బాబూ, నీ మనస్సును నొప్పిస్తున్నందుకు ఎంతో విచారిస్తున్నాను పెళ్ళి చూపులకై పెద్దలను వారి ఇంటికి పంపాను. ఇక నేను ఆడిన మాటను తప్ప లేను. వారు అంగీకారం ప్రకటిస్తే నేను ఎలా మాట తప్పగలను?" ఖచ్చితముగా జవాబు చెప్పాడు తాతగారు

మిరజా లేచి మేనత్త ఇంటికి వెళ్ళాడు. "అత్తా! మీరు మన ఇంటికి సాహిబాఁను రప్పించండి. నేను ఆమెని కలుసుకొని మాట్లాడాలి అని వినయంగా అడిగాడు.

చాలాకాలం తరువాత అతను ఇదే యింట్లో మళ్ళా నేడు సాహిబాఁకై ఎదురు చూస్తున్నాడు. అప్పట్లో అతని కళ్ళుమాత్రమే సాహిబాఁకై ఎదురు చూసేవి. కాని, నేడు అతనిలో ప్రతి అణువు ఆమెకై తహ-తహలాడుతోంది.

"సాహిబాఁ రావాలి.........అప్పట్లో ఆమె నాకంటె పొడగరిగా ఉండేది. ఇప్పుడామె నా భుజాలకు మించి ఉండదు. ఆమె నిండు రూపాన్ని-ఇసుమంత యేని చెదరి పోకుండా నా విశాల హృదయంలో దాచుకొంటాను ". అని అను కుంటూ ఉండగా సాహిబాఁ రానే వచ్చింది. ఆమె కాళ్ళకు అందియలు లేవు. అయినా ఆమె ఇదివరకు కంటే ఎంతో అందంగా కనబడింది. ఆమెని చూడగనే తాను చేసుకొన్న నిర్ణయం హృదయంలో దడ-దడ కొట్టుకోసాగింది.

ఆమె సమీపానికి వచ్చినప్పుడు అతని పెదిమలు చలించలేదు. సాహిబాఁ తన చేతిని నెమ్మదిగా అతని నడుము దగ్గరకు పోనిచ్చింది. మిరజా కూడ సిగ్గుపడుతున్న వానిలా తన చేయి ఆమె భుజంమీద వేశాడు. ఇరువురి చేతులు ఒకరినొకరు గాఢంగా కౌగలించుకోవాలని తీవ్రంగా వాంఛిస్తూ సిగ్గు పడు తున్నట్లుంది.

సాహిబాఁ చూపు విలక్షణమైనది. ఈ చూపులో ఏదో గిలిగింతలు. పెడుతున్నట్లుంది, ఆమె ఆత్మ విహంగం కను రెప్పలపై వ్రేలాడుతోంది:

ఎగరాలనే తలంపు ఏదో హృదయమనే గోపురాన్ని అన్వేషిస్తోంది. పక్షికి ఈ గోపురపు ప్రతిబింబం మిరజా నేత్రాల్లో కనబడింది. రెప-రెప శబ్దమయింది. పక్షి కొమ్మనుంచి ఉల్లాసంగా ఎగిరి మిరజా బాహు పాశంలో గట్టిగా బంధింప బడింది. కౌగిలినుంచి బాహువులు సడలించగానే వారి కళ్ళల్లో తాము పరాయి వారమనే భావం ఇరువురిలో ఏమాత్రం గోచరించలేదు. ఒకరి కళ్ళల్లో మరొకరి ప్రతిబింబం గోచరించడమే కాదు-ఒకరికి మరొకరి గుండెదడ వినబడుతోంది. మనస్సు విప్పి మాట్లాడుకోవడం తేలిక అయింది వారు పరస్పరం ఏమి చెప్పు కోవాలన్నా బాధాకరంగా లేదు.

"మిరజియా. నన్ను నీవు ఏమి చేయదలచావు?" సాహిబాఁ అడిగింది.

"నీవు నాదానవు అన్న నమ్మకం కుదరడమే చాలు. ఇక నానుంచి నిన్ను బలవంతంగా లాగి తీసుకొని పోగలవాడు ఈ ప్రపంచంలో ఇంకా పుట్టలేదు-" అన్నాడు అనురాగ ఆవేశాలతో.

"చంధడ్ వారి వంశానికి పెద్ద సైన్యం ఉందని విన్నాను" అంది సాహిబాఁ.

"నాకు నా బాహుబలమే ఒక పెద్ద సైన్యం-" అంటూ మిరజా సాహిబాఁ భుజాలపై తన చేతుల్ని ఉంచాడు.

"మిరజియా నాసోదరులతో నీకు పోరు సల్పవలసిన అగత్యం కలుగకుండు గాకయని ఆశిస్తున్నాను-" సాహిబాఁ ముఖం వెల-వెల పోయింది.

"నీకే కాదు, వారు నాకూ సోదరులు లాంటివారే" నాగుఱ్ఱం నావద్ద వున్నంతవరకు నా బాణాలు అంబుల పొదిలో ఉన్నంత సేపు ఎవరితోను పోరు సలప వలసిన అవసరంరాదు. నాతో పోరాడడానికి ఎవ్వరికీ సాహసం చాలదు. నీకు నీతల్లి-దండ్రులకు అపకీర్తి వస్తుందనే భయం ఉంటే సత్వరం చెప్పు-" అంటూ మిరజా ఆమె భుజాలపైనుంచి తన రెండు చేతులను తీసివేశాడు

"అవమానకర వాతావరణాన్ని వాళ్ళు స్వయంగా సృష్టించుకొంటున్నారు. నావల్ల వారికి ఎట్టి దెబ్బ తగలకూడదని నాతలంపు. నేను నావంశంలో పుట్టి పెద్దదాననై నీలాంటి యువకులలో యువరాజులాంటి నీ క్రీగంటి చూపులతో ప్రేమకు గురిఅయాను. మన ఇరువురి ప్రేమ కారణంగా నా వంశవృక్షానికి ఎట్టి హాని జరుగరాదు-" అంది సాహిబాఁ.

"ఏమీ ఫరవాలేదు. నీవు నిశ్చింతగా వుండు. సరియైన సమయానికి నాకు కబురు అందాలి. తక్షణం నేను నాగుఱ్ఱం వాయువేగంతో నీదగ్గరి వాలి పోతాం అని గట్టిగా నమ్ము." అన్నాడు ధైర్యం చెబుతూ మిరజా.

మరుసటి రోజున చంధడ్ వారితో సంబంధం కుదుర్చుకొని వెళ్ళిన పెద్దలు వచ్చారని ఆమె విన్నది. ఒక్కమారుగా రెక్కలు నరికిన పక్షిలా అయింది ఆమె పని. పెళ్ళి ఏర్పాట్లు ముమ్మరంగా సాగిపోతున్నాయి. పెళ్ళిరోజు సమీపించిన కొద్దీ సాహిబా జీవితం నిలువునా నట్టేటిలో మునిగినట్లైంది. కాలం గిర్రున తిరిగింది. ఇక రేపు పెళ్ళివారు వస్తారు అన్న సందడి ఊరందరికీ ఉత్సాహం కలిగిస్తోంది.

మిరజానుంచి సాహిబాకి ఎట్టి వార్త రాలేదు. మేనత్త బీబో స్వయంగా వెళ్ళి మిరజాకు విషయమంతా పూస గ్రుచ్చినట్లు చెప్పింది. "సాహిబాను ఎంత మాత్రం చింతించవద్దని" మిరజా మేనత్తతో కబురు పంపాడు.

కోలాహలంగా మొగపెళ్ళివారు విచ్చేశారు. వారితో అనేక భోగం మేళాలవారు వచ్చారు. గ్రామమంతా వినోద-విలాసాలతో, పాన-పానీయాలతో మత్తుగా ఉర్రూతలూగుతోంది. సాహిబా బీబోల గుండెలు భయంతో కొట్టుకొనసాగాయి. మిరజా రాకకై చూసి వారికళ్ళు కాయలు కాచాయి. సంధ్యా సమయం కూడ చీకటి తెరలలోకి ప్రవేశించింది.

ఇంతలో ముసుగు ముఖంతో ఒక గుఱ్ఱపు రౌతు గుఱ్ఱాలశాలలో ప్రవేశించి అక్కడ తన గుఱ్ఱాన్ని బంధించాడు. బీబో ప్రాణంలో ప్రాణం వచ్చింది. ఆమె భర్త పెండ్లివారి వినోద-విలాసాలలో పాల్గొనేందుకు వెళ్ళాడు. అతిథిని లోపల నిలబెట్టి సాహిబా విషాద గాథను అతనికి వినిపించింది. "ఇక నీవు ఏమి చేస్తావు నాయనా? " అని ప్రశ్నించింది.

"పరే అత్తయ్యా, సాహిబాను సిద్ధంగా వుండమని చెప్పండి. తొలికోడి కూసేసరికి నేనూ-నాగుఱ్ఱం ఆమె గుమ్మందగ్గర వుంటాము. ఆ సమయంలో అందరూ గాఢ నిద్రలో మునిగి ఉంటారు".

ఒక్కొక్క క్షణం ఒక శతాబ్దంకంటె దీర్ఘంగా సాగుతోంది సాహిబాకు.

"రేపు మిరజా రాకపోతే నేను పాలకీలో ఎక్కి మృత్యుదేవత భుజాలపై

"అత్తవారి యింటికి వెళుతూ వుంటాను ............ మిరజా రాకుంటే-అతడు నన్ను వదలివేస్తే ఇక నేను ఎవరికొరకు బ్రతకాలి?....మిరజా నన్ను తనదానిగా చేసుకుంటే-ఖైదీగా నైనా జీవితం గడుపుతాను...." అని పరి పరి విధాల తలపోస్తోంది.

మంగళ వాయిద్యాలు మ్రోగుతున్నాయి. సాహిబాఁ గుండెల్లో రాయి పడింది. ఆమె తన రెండు చేతులతో తన గుండెను గట్టిగా అదిమి పట్టుకుంది- "అయ్యో ఇంకేముంది. మిరజా రాలేదు!"- అని నిట్టూర్చి తక్షణం చావుకై ఉపాయమేమిటా యని ఆలోచించసాగింది.

బీబో వచ్చి సాహిబాఁను తన బాహువుల్లో దాచుకుంది. ప్రియుని రాక విని ఆమెలో ఆశా జ్యోతులు వెల్లివిరిశాయి. నిరాశనిశీథంలో ఆశా జ్యోతులు వెలిగొందాయి.

ఆ వెన్నెలరాత్రి సగం గడిచిపోయింది. భోగం మేళాల మేళతాళాలు నాట్య విన్యాసాలు చూసి హాయిగా ఎవరింట వారు నిద్ర పోతున్నారు. గ్రామమంతా నిశ్శబ్దంగా వుంది. ఆ నీరవ నిశీథంలో సాహిబాఁ మంచంపై పడుకుని తన ప్రియుని పిలుపుకు ఎదురు చూస్తూంది. అలసటయనే సాకుతో పడుకునే వేళకూడ ఆమె తన బట్టలను మార్చుకోలేదు.

గుఱ్ఱం గిట్టల ధ్వని............

సాహిబాఁ లేచింది; నలువైపులా కలియచూసింది. అందరూ మత్తుగా నిద్ర పోతున్నారు. నిదుర మత్తులో వున్న ముఖాలన్నీ ఆమెకు చాలా బాగున్నట్లనిపించాయి. ఒక్కసారిగా ఆమె నిట్టూర్చింది.- "ఈ యింటితో సంబంధాన్ని విడిచి బయటకు పోకుండా ఉంటే ఎంత బాగుండేది!" అనుకుంది. సవ్వడి కాకుండా ఆమె బయలుదేరింది. నెమ్మదిగా తలుపు తెరచి బయట గోడను ఆనుకొని నిలబడింది.

క్షణంలో గుఱ్ఱం వచ్చి ఆమెవద్ద నిలబడింది. గుఱ్ఱంపైనున్న ముసుగు రౌతు రికాబునుండి ఒక కాలు బయటకు తీశాడు. సాహిబాఁ ఆ కాలును రికాబులో వుంచింది. రౌతు అందించిన చేతిని పట్టుకొని ఒక్కసారిగా ఎగిరి సాహిబాఁ రౌతు వెనుక కూర్చుంది. అతని అపార కృపకు మౌన కృతజ్ఞత ప్రకటిస్తూ ఒకసారి ఆముసుగు రౌతు నడుంచుట్టూ తన సుకోమల బాహువుల్ని చుట్టి అతణ్ణి

గట్టిగా తన కౌగిలిలో బంధించింది. ముసుగు రౌతు తన ముఖాన్ని క్రిందికి వంచి ఆమె బాహువులను ముద్దు పెట్టుకొన్నాడు.

శర వేగంతో గుఱ్ఱం గ్రామ పొలిమేరల్ని దాటిపోయింది. ఆనాటి మిరజా కలలు నేడు కల్లలు కాలేదు. అవి సజీవరూపం దాల్చాయి.

కొంతదూరం వెళ్ళాక మిరజాకు సీసోదరులకు ఎలాంటి విపత్తు రాదు అన్న వాగ్దానం గుర్తుకు వచ్చింది. అయినా, వారు అతణ్ణి వెంబడిస్తే ప్రతి ఘటన తప్పదు- అని ఆలోచించి మిరజా దానాబాద్ మార్గాన్ని వదలి మరో సుదీర్ఘ మార్గంవైపు గుఱ్ఱాన్ని మరలించాడు.

గుఱ్ఱపు స్వారితో తెల్లవారింది. చక్కగా వికసించిన సుమన సందోహంతో నిండిన పూదోట వారికెదురైంది. సుగంధం గుబాళిస్తోంది. గుబురుగా వున్న చెట్ల సముదాయం క్రింద గుఱ్ఱాన్ని ఆపి మిరజా క్రిందికి దిగాడు. అతను సాహిబాఁను తన రెండు చేతులతో గుఱ్ఱంపైనుంచి దించి కౌగిలిలోనికి తీసికొన్నాడు ఆ ఆనందంలో ఆమె చింతలన్నీ మటుమాయమయ్యాయి. మిరజా భుజంనుంచి ధనస్సును తీసింది. మిరజా ధనుస్సుకు ఒక బాణాన్ని ఎక్కుపెట్టి వుంచాడు.

"ఈ బాణాలు, ఈ ధనుస్సు, ఈ గుఱ్ఱం- ఈ నా బాహువును బాహుబంధనంలో నీవు! ఇక ఇహ పరలోకాలు నావే" సాహిబాఁ శిరస్సు ముద్దు పెట్టుకుంటూ మిరజా అన్నాడు ఆనంద పరవశంలో.

"మిరజియా ఇక్కడ ఎందుకు ఆగావు? పద ఇంటికి పోదాం"

అలాకాదు, సాహిబాఁ- అక్కడికి పోతే మళ్ళీ ఏమేమి గొడవలు-కొట్లాటలు ఎదురవుతాయో తెలీదు ఆ చిక్కులో పడేముందు నిన్ను పూర్తిగా నా హృదయంలో దాచుకోవాలనే ప్రగాఢ వాంఛ తీర్చుకుంటాను. ఒక్కక్షణం నీవు ఈ ప్రపంచాన్నంతా మరచిపో. వేదనాపూరితమైన హృదయ మందిరంలో నీవు నా ఆశాజ్యోతివి; సాహిబాఁ నా వియోగ వ్యధను దూరం చెయ్యి."

ఒక్కసారిగా సాహిబాఁ పాదాలు భువినుంచి లేచిపోయాయి. పునీత ప్రేమాకాశంలో ఆమె రివ్వు రివ్వున ఉరకలు తీస్తూ మిరజా కంఠానికి తన బాహువులు చాచింది.

రెండు హృదయాలు పెనవేసుకున్నాయి. చిరకాలంగా వియోగ వ్యధతో

శూన్యంగావున్న హృదయాలు సంయోగ ప్రేమతో నిండుకున్నాయి. మిరజా ఆత్మనుంచి ఏదో కఠోర బంధనం తొలగినట్లయింది. "సాహిబాం, ఈ ఘడియలో కలిగిన అమూల్య దివ్యానందానికి జీవితం బలియిచ్చి నా ఋణం తీర్చుకోవ డానికి సంసిద్ధుణ్ణి. నా శిరస్సు నీ తొడలపై వుంచనీ, నీవు పైనుండి నా కళ్ళలో నీ కళ్ళుకలిపి చూడు"- అన్నాడు పరిపూర్ణ హృదయంతో.

మిరజా పడుకున్నాడు. బాహువులు వెనుకకు చాచి సాహిబాను కౌగిటిలోకి తీసుకొన్నాడు. ఆమె తల అప్రయత్నంగా వంగిపోయింది. మరోసారి అతను ఆమె శిరస్సును తన వైపుకు తిప్పుకున్నాడు.

అలసట చెందిన అవయవాలపై అప్రేమ తుషారపాతం బద్ధకాన్ని మేల్కొలి పింది. అతని కళ్ళు మూతలు పడ్డాయి. ధనస్సు తూణీరం మిరజాకు గుచ్చు కోవడం చూసి సాహిబాం వాటిని తొలగించి ఒక ప్రక్కన పెట్టింది. మిరజా నిశ్చింతగా దివ్యానంద స్వప్న జగత్తులో నిద్రించడం చూసి ముగ్ధురాలయింది.

అతన్ని విరోధులు వెన్నంటివస్తూ వుండవచ్చుననే అనుమానం ఆమెకు ఒక్కసారిగా కలిగింది. కాస్త చప్పుడు వినబడితే ఆమె కంపించి పోయేది అతణ్ణి మేల్కొల్పాలని తలచేది; కాని ఆ చప్పుడు మరేదో అయివుండేది.

"ఎవరైనా మా విషయం యింటికి తెలియజేస్తే అన్నయ్యలు ఇటువైపునకే వచ్చినచో ఏంచెయ్యాలి"?

సాహిబాం తూణీరంలోని శరాలను లెక్కించింది. పన్నెండు పైగా ఉన్నాయి. ఆమె ధనువుపై తన చెయ్యి సారించింది. అది దయా దాక్షిణ్యాలు లేని ధనస్సు. సోదరులు ఆమెకు జ్ఞాపకం వచ్చారు; మిరజా గురి రామబాణంలాంటి గురియని జ్ఞాపకం వచ్చింది- ఆమె హృదయం ఒక్కసారిగా కంపనం చెందింది.

"మిరజా నాకు మాట యిచ్చాడు" అని ఆలోచించుకొని చల్లగా నిట్టూ ర్చింది. "అయినా, మా అన్నయ్యలు శత్రువులై మాపై దాడికి వస్తే మిరజా తన వాగ్దానాన్ని ఎలా చెల్లించుకుంటాడు? విరోధుల సంఖ్య ఎక్కువగా వుంటేనో ...............తన అజేయమైన బాణాలతో వాళ్ళను తరిమి కొట్టగలడు!" అను కుంటూ నెమ్మదిగా మిరజాను మేల్కొల్పింది— "మిరజియా, నిద్రనుండి లే మనం ఇక్కడనుంచి వెళ్ళిపోదాం" అని

పాపం మిరజా ఏదో మధురాతి మధుర స్వప్నంలో మునిగి పోయాడు. చివరకు "ఏఁ, ఎవరైనా వచ్చారా"? అని అడిగాడు నెమ్మదిగా.

"అబ్బే ఎవరూ రాలేదు." అంది సాహిబాఁ మరుక్షణం అతను తన మధుర స్వప్నలోకంలోకి వెళ్ళిపోయాడు.

మా అన్నయ్యలు తప్పక వస్తారు. సాహిబాఁకు భయాందోళనలు ఎక్కువైనాయి. "అయ్యో అందరూ మిరజా చేతుల్లో చచ్చిపోతారు!" అనుకొని భయభ్రాంతురాలయింది.

...............తన ప్రియాతి ప్రియమైన మిరజా శిరస్సును నెమ్మదిగా తన తొడలపైనుంచి క్రిందికి దించింది. అంబులపొది తీసుకొని వెళ్ళి దూరంగా వున్న గుబురైన చెట్టు వెనుక భాగాన ఎత్తైన కొమ్మకు తగిలించి వచ్చింది. మళ్ళీ గాఢంగా నిదురించుచున్న మిరజా శిరస్సును తన తొడలపై పెట్టుకొంది.

నిరాయుధుడై వున్న మిరజాను వారు చంపివేస్తే........? అని ఆలోచిస్తూ వుంటే ఆమెకు అపరిమిత భయం వేసింది. ...........నేను ఇరుపక్షాల మధ్య నిలబడి మిరజాను రక్షిస్తాను, నన్ను ముక్కలు ముక్కలు చేసిన తరువాతనే వారి కత్తి మిరజాను తాకగలుగుతుంది! ఆయన మరణం నేను చూడలేను. అయితే నా మరణం ఆయన చూసి సహించగలడా?" అని ఇలా ఏవేవో ఆలోచిస్తుంటే ఆమె మనస్సు నిశ్చింతగా ఉన్నట్లయింది.మిరజా నుదురుపై చిందరగా పడిన ముంగురులను సవరిస్తూ అతని శిరస్సును సాహిబాఁ ముద్దు పెట్టుకుంది.

ఒక్కసారిగా గుఱ్ఱాల పరుగుల చప్పుడు వినబడింది, "అయ్యో ఇంకేముంది. అనుకున్నంత పని జరిగింది! వాళ్ళు రానే వచ్చారు" అనుకొని బాధపడ సాగింది సాహిబాఁ.

గుఱ్ఱంపై అందరికంటె ముందు వస్తున్న తమ్ముడైన ఛిందాను గుర్తు పట్టింది. ఆమె నిరాశ చెందింది! నిద్రపోతున్న మిరజాను కదిపి కదిపి లేపి "మిరజియా! లే లే; గుఱ్ఱాన్నిఎక్కి ఇక్కడనుండి పారిపోదాం" అంది కంగారుగా.

"నా బాణాలెక్కడ? నా అంబులపొది ఎక్కడ! సాహిబాఁ, మాట్లాడవేఁ ఇంతకు ముందువరకు అంబులపొది నా మెడలోనే తూణీరం ఉందిగదా! నేను

మరణించను. నా బాణాలు తమ ధాటితో ప్రళయాన్ని పుట్టిస్తాయి. సాహిబాఁ, నా అంబులపొది యెక్కడ?" అని ప్రశ్నించాడు.

"మిరజియా, నన్ను క్షమించు; తప్పునాది. అన్నదమ్ముల మోహంలో పడి నీయెడల అన్యాయంగా ప్రవర్తించాను. అంబుల పొదిని నా బాహువుల నుండి తీసి దూరంగా పెట్టాను. ఇక అది ఉపకరించదు. వాళ్ళు వచ్చి పడ్డారు. ఒక్క ఎగురు ఎగిరి గుఱ్ఱంపై కూర్చో" అంది సాహిబాఁ.

"సాహిబాఁ అది సాధ్యం కాదు. నిన్ను మరచిపోవడం అసంభవం నిన్ను విడిచి నేను పోలేను". అంటూ రివ్వున వెళ్ళి గుఱ్ఱపు జీనునుండి కత్తి తీస కొని వచ్చాడు. "సాహిబాఁ, ఇక నీవు నేలకు ఒరిగే వీరులను లెక్కపెట్టు నీ సోదరులకు ఏదైనా దెబ్బ తగిలితే నన్ను క్షమించు........నేను పోరు శలుపుతూ మరణిస్తాను" అన్నాడు మిరజా.

సాహిబాఁ మిరజా మెడను గట్టిగా చుట్టుకొని కౌగలించుకొంది. మిరజా ఆమెను దూరంగా నెట్టివేశాడు. "వారు నిన్ను ఎందుకు చంపుతారు? నిన్ను నాకు దూరం చేసి నా ఛాతీలో బాకుతో పొడిచేందుకు ఒక్కరూ సరిపోరు ఇరువురు కావాలి. నాకు అడ్డురాకు సాహిబాఁ, వారు మనల్ని సమీపించారు. నన్ను నా అదృష్టానికి విడిచిపెట్టు!" అన్నాడు మిరజా సాహిబాఁతో.

మిరజా ఒక్కసారి కత్తిని ఝళిపించాడు. గుఱ్ఱాలనుంచి ఏడుగురు గవే లున క్రిందికి దుమికారు. కత్తులు మెరిశాయి. సాహిబాఁ గుఱ్ఱంనుంచి దిగి వారి మధ్యకు వచ్చి నిలబడింది.

"ఓ వీరులారా ఇక నేనుగాని మిరజాగాని పారిపోము. ఓనా సోదరులా త్వరపడి అఘాయిత్యానికి పాల్పడబోకండి" అంది వీరనారిగా సాహిబాఁ.

"మేము ఎవ్వరి మాటా లెక్కచేయం. మేము దొంగలను ముట్టడించాము" అన్న ఈ స్వరం ఆమె సోదరుల స్వరం కాదు. ఈమాటలన్న వాని కంఠం ఆమె గుర్తించలేక పోయింది. ఆమె గతరాత్రి పారిపోయి వచ్చింది. లేకుంటే ఈసరికి తాహిల్ ఆమె భర్తయై వుండేవాడు. అతనిదే ఆ కర్కశ కంఠస్వరం.

"ఓ, నా సోదరులారా! మిమ్ములను నమ్మి నేను మిరజాకు ద్రోహం చేశానని చెబుతున్నాను గమనించండి."

ఓహో, అక్కయ్యా, నీవు మాపట్ల ఎంత గొప్ప విశ్వాసపాత్రురాలిగా వ్యవహరించావు!" అన్నాడు తమ్ముడు వ్యంగ్యంగా.

"నేను ఒకే పర్యాయం నా జీవితంలో నా హృదయం యెడల నమ్మకంతో వ్యవహరించాను. అన్ని వేళల్లో నేను ఇతరులపట్ల విశ్వాసపాత్రురాలిగా నడిచాను. సరే, ఆ విషయం ప్రస్తుతం అనవసరం. మీ ప్రాణాలను రక్షించాలనే ఉద్దేశంతో ఈయన ధనుర్బాణాలను దాచాను. లేకుంటే మీలో ఎంతమంది ఈ సమయంలో ఆయనముందు నిలువరించి యుండేవారో మీకు తెలుసు. నేను చెప్పే మాటను వినండి. నేను మీపైగల విశ్వాస కారణంగానే అట్లా చేశాను" అంది.

"నీవు చెప్పదలచుకున్నదేమిటి"? అన్నాడు అన్నగారు.

"ఇతన్ని మేము ప్రాణాలతో విడిచిపెట్టం, మాపట్ల ఇతను ఒక దొంగ!" తాహిర్ తన గుండెల్లోని అక్కసును బయటకు కక్కాడు..........అతను మిరజా పొట్టకు గురిపెట్టి బాకును విసిరి కొట్టాడు.

బాకు గురి తప్పింది; దానితో మిరజా రక్తం ఉడికిపోయింది. అతను సింహంలా గర్జించాడు. "సాహిబాఁ ఈ మనిషిని గూర్చి నీకు ఏలాంటి వాగ్దానం చేసి వుండలేదు" అంటూ ఒక్క దెబ్బతో తాహిర్‌ను నేలకు కూలదీశాడు.

ఇదిచూసి అందరూ అతనిపై విరుచుకు పడ్డారు. కత్తులు దూశారు. మిరజా కత్తి యుద్ధంలో అతి నిపుణుడు. అందరి కత్తి దెబ్బలను అతను ఒంటరిగానే తప్పించుకున్నాడు.

సాహిబాఁ అవిరామంగా విలపిస్తూ సోదరుల పాదాలను పట్టుకొని ప్రతిమలాడ సాగింది. "సోదరులారా! మీరు మిరజాను విడిచిపెట్టండి. అతన్ని చంపవద్దు. దీనికంతకూ నేనే కారకురాలిని. ఈ పాపాలకు మూలం నేనే. నేను స్వయంగా ఇతణ్ణి పిలిపించాను. నేనే ఇతణ్ణి మోసగించాను. వీరులారా. మీరు పరాక్రమవంతులు, ఉదారులు! మీ మంచితనానికి ఔదార్యానికి చిహ్నంగా మీ సోదరిపట్ల సానుభూతిగా..........

కత్తుల ఝళిపింపుల్లో ఆమె మొరను ఎవ్వరూ వినిపించుకోలేదు. చివరికి అతని బాహువులు బరువెక్కిపోయాయి. కత్తివోట్లతో అతని వక్షస్థలం జల్లెడలా అయిపోయింది. ఇక వారి కత్తి దెబ్బలను మిరజా ఎదిరించలేక పోయాడు. సాహిబాఁ

ఆ హృదయ విదారకమైన దృశ్యాన్ని చూడలేకపోయింది. ఆమె వారి మధ్యకు వచ్చి కూలబడి పోయింది.

"ఈమెను గట్టిగా పట్టుకోండి" అంటూ ఆమె సోదరులొకడు సాహిబాఁను కదలకుండా గట్టిగా పట్టుకున్నాడు.

మిరజాపై పడే ప్రతి కత్తి దెబ్బకు ఆమె హృదయం నెప్పున కేక వేసింది. చిట్టచివరికి మిరజా ఛాతీపై గట్టి దెబ్బతగిలింది. అతను ఒక్కసారిగా నేలపై కుప్పగా కూలిపోయాడు. కత్తి అతని చేతినుంచి జారి నేలపై పడిపోయింది.

సాహిబాఁ ఆడసింహంలా శక్తిని సంతరించుకొంది. తనను కదలనీయకుండా బంధించి పట్టుకున్న తన సోదరుణ్ణి ఒక్క ఊపుతో విదిలించి, నెట్టివేసింది. ఆమె మిరజా ఎదుటకు వచ్చింది; అతని కత్తిని తన చేతితో గట్టిగా పట్టుకుంది. "ఇక ఎవ్వరూ నాసమీపానికి రావద్దు. నేను మీసోదరి సాహిబాఁను కాదు; నేనొక పిచ్చిదానిని! మిరజా మరణానికి సిద్ధంగా వున్నాడు. నేను నిజంగా అతణ్ణి మోసగించాను, అతణ్ణి నేను క్షమాపణ చేసుకోనివ్వండి" అంది సాహిబాఁ.

ఎంతటి నిర్ణయం! ఎంతటి విషాదాంతం!! ఈ దృశ్యంచూసి నిస్తబ్ధత చెందనివాడెవడుంటాడు? వీరులంతా ఒకరి ముఖాలను మరొకరు చూసుకొని వెనక్కి తొలగిపోయారు.

సాహిబాఁ మిరజా నుదుటినుంచి రక్తంతో తడిసిన ముంగురులను ప్రక్కకు తొలగించింది. తన పవిటె కొంగుతో అతని కళ్ళనుంచి కారే రక్తాన్ని తుడిచింది. అతని ఫాలభాగాన్ని ముద్దుపెట్టుకొని "ఓ మిరజియా" అంటూ గొల్లున ఏడ్చింది.

"ఆ, సాహిబాఁ!"

"మిరజియా నన్ను క్షమిస్తావా?"

"క్షమాపణ దేనికి?........ నేను నా జీవితపు విలువలనన్నీ సముపార్జించాను.... నేను ఒక పునీత దేవతను స్పర్శించగలిగాను........."

"మిరజియా! నేను నీకు ఏమీ ఇవ్వలేకపోయాను కాని నీకు మరణాన్ని ప్రసాదించాను అంతే...."

"కాదు సాహిబాఁ నీవు నన్ను అమరుణ్ణి చేశావు"

"మిరజియా! ఒకక్షణం.... నాకొరకు నీ నేత్రాలను తెరచి వుంచగలుగుతావా?"

కళ్ళు మూతలుపడిపోతున్నాయి. "అయినా నీవు కోరితే.... తెరచి వుంటాయి .... నీవు నాచేతిని నీచేతితో పట్టుకుంటే కళ్ళు తెరచి వుంచగలను."

సాహిబాఁ మిరజా చేతిని పైకెత్తి ముద్దు పెట్టుకుంది. "మిరజీయా నేను నీ కొరకై బలిదానం కాగలిగివుంటే ఎంత బావుంటుంది? నీవు కన్నెత్తి నావైపు చూడాలని గాఢమైన వాంఛ. నేను నీకేకాదు నా అదృష్ట దేవతకే కృతఘ్నురాల నయ్యాను. నీకంటె నాసోదరులు నాకు ప్రియమైనవారని భావించవద్దు. నా సంతోషానికి బదులు ఇతరుల సంతోషాన్ని ప్రేమించే నా అలవాటు నీపట్ల ప్రాణ ఘాతుకమైంది. నేను నీదానను, నీనుంచి నన్ను ఎవ్వరూ వేరుచేయలేరు........"

సాహిబాఁ లేచి మిరజా తెరచిన కళ్ళఎదుటకు వెళ్ళి నిలబడింది. ఆమె చేతిలో మిరజా కత్తివుంది. ఆమె కత్తి పిడిని ముద్దుపెట్టుకొని దానితో తన పొట్టలో పొడుచుకుంది..............తూలి పడుతూ.... తడబడుతూ సాహిబాఁ మిరజా వీపునానుకొని పడిపోయింది.

# సస్సీ - పున్నూ

—అమృత ప్రీతమ్

రాజోద్యాన వనంలో చెట్లనిండా పువ్వులు వికసించినప్పుడు, చెట్టునుంచి విరిగి నేలపై చిందరవందరగా పడిన లతవలె, అంతఃపుర కిటికీవద్ద రాణి ఉదాసీనంగా కనబడేది. "భగవంతుడా! ఈ ధరాతలంలోని ప్రతి అంగుళం నేల సస్య శ్యామలమై సౌందర్యవంతంగా అలరారుతోంది. కాని, నాఒడి సంతాన భారంతో ఎందుకు సస్యశ్యామలం కాదు" అంటూ పదే పదే నిట్టూరుస్తూ ఉండేది.

సుమనాలకు శుభ ముహూర్తంగా ఋతురాజ వసంతం ప్రతి వత్సరం తరు, గుల్మ లతాదులతో దోబూచులాడుతూ కిల కిలా కేరింతలు కొడుతుంది. అందరినీ తన సౌందర్య సుగంధాలతో తన్మయత్వం చెందిస్తుంది. దీర్ఘ నిరీక్షణానంతరం రాణి సుకోమల శరీరంలో వసంతం తొంగిచూసింది. నిండు పూతతో నిండిన కొమ్మలా బరువెక్కిన శరీరంతో రాజ ప్రాసాదంలో అటు ఇటు వంగి వంగి నెమ్మదిగా తిరుగుతూ వుండేది.

ఆశా విహంగం వచ్చి రాణీ అంతఃపుర కిటికీలో కూర్చుంది. రాణి తన అరచేతులకు అందంగా గోరింటాకు పెట్టుకొని "ఈ పక్షికి నా అరచేతుల్లో గింజలు పోసుకొని తినిపిస్తాను"........అని తలపోసేది.

నిలువుటద్దం ఎదుట నిలబడి తన చంద్రబింబంలాంటి ముఖానికి ఎఱ్ఱని సుగంధపు పొడిని రుద్దుకుంటూ వుంటే దొండపండులాంటి ఆమె అధరాలపై అందమైన జోలపాట కూనిరాగాలు తీసేది........

చక్కని పట్టు ఉయ్యాలలో ఆమె మంచిముత్యాల వరుసలు తీర్చి దిద్దినట్లు కనుల పండువుగా తోరణాలుగా కట్టేది. రానున్న శిశువుకై నిరీక్షణా దివసాలను ముత్యాల పూసలతో లెక్కిస్తూ ఉండేది.

ఒకనాడు ముత్యాలు గుచ్చుతూ ఉండగా ఆమె చేతిలోవున్న దారం తెగి పోయింది. ముత్యాలన్నీ మంచుబిందువుల్లా నున్నని గచ్చుపై చెల్లాచెదరుగా

పడిపోయాయి. పరిచారికలు చలువరాతి గచ్చుపై మిల మిల మెరిసే ముత్యాలను జాగ్రత్తగా ఏరుతున్నారు. పాపం! రాణి తెగిపోయిన దారంలా దుఃఖంతో మునిగిపోతూ "నాకర్మ ఫల ముత్యాలు నాచేతులనుంచి జారిపోకుండా వుండు గాక...." అంటూ విలపించేది.

భంబోర్ నగరపు రాజు తన కోశాగారాన్ని తెరచి బీదలకు దానాలు చేయడం మొదలు పెట్టాడు. బీద ప్రజలు తమ జోలెలను నింపుకొని పరమానందంతో వెళుతున్నారు. రాజూ రాణీ రాత్రివేళ భగవంతుని ఎదుట తమ కొంగులను చాపి "లోకబాంధవా! దయానిధీ!! మేము నీగుమ్మందగ్గర చేరినభిక్షగాళ్ళం. నీవు సంతాన భిక్షతో మాజీవితపు జోలిని నింపు. ఓ దీనబాంధవా! నీవే మాకు సర్వస్వం" అంటూ దీన వదనారవిందాలతో అర్థించేవారు.

నెలవంకలాంటి తనయ రాజదంపతుల జోలిని నింపింది.

"ఈ చిన్నారిపాప నా వూహా సౌందర్యంకంటె ఎంతో అపురూపవతి." అనుకుంటూ రాణి పదే పదే ఆ బంగారు పాపవైపు చూస్తూ పరవశం చెంది పోయేది. ఆమె శరీరంలోని ప్రతి అణువు జోలపాట పాడినట్లుండేది.

రక్తనాళాలలో రక్తం అమృత స్తన్యంగా మారి రాణి వక్షంనుంచి ధారలు కట్టుతూ ఉండేది. ఒకనాడు పాలు త్రాగుతూ ఉండగా సస్సీ ఆర్ద్ర అధరాల నుంచి పాల బిందువులు అద్దంలాంటి గచ్చుపై పడ్డాయి. ఆ పాల బిందువులు ముత్యాల్లా మెరసి మురుస్తున్నాయి. ఒక్కసారిగా రాణికి గతించిన ఆ రోజు జ్ఞాపకం వచ్చింది. ఒకనాడు తనచేతినుంచి ముత్యాలపేట తెగి జారిపడింది. ముద్దులుగొలిపే ముత్యాలన్నీ మూగమనస్సుల్లా నేలపై రాలాయి. రాణి భయ కంపిత హృదయంతో తన ముద్దుల బిడ్డను గట్టిగా గుండెకు అదుముకుంది. అంతా అనూహ్యం! ఆ రాత్రంతా ఆమె పెదిమెలనుంచి వెలువడిన జోలపాట కంపిస్తూనే ఉంది............

ఉదయం రాజు దర్బారుకు వెళ్ళాడు. అదిచూసి రాణి కంగారుపడింది. రాజు వెనువెంటనే అంతఃపురానికి తిరిగి వచ్చాడు. ఆయన సస్సీ ఉయ్యాల వద్దకు వచ్చి సమాధివద్ద కూర్చున్న వ్యక్తిలా చతికిలబడ్డాడు.......

విలపిస్తూ వణకుతూ రాణి ఒకసారి తన పాపవైపు చూసింది. మరోసారి పాప తండ్రిముఖంవైపు తదేకంగా చూసింది. చివరకు రాజు ఇలా అన్నాడు.

"మనకు కలిగిన ఈ బిడ్డ మన రాజవంశానికి కళంకం. ఈ ముక్కుపచ్చలారని బిడ్డను ఏమి చేయాలి? ఈనాడు జ్యోతిష్కులు 'ఈ బిడ్డ యౌవ్వనవతి అయాక ప్రపంచమంతటిచేత తిరస్కరింప బడుతుందని, ఏదో యువకుని ప్రేమపాశంలో చిక్కుకొని ఇల్లూ వాకిలి విడచి పోతుందని.... అంతటితో మన వంశ గౌరవం కూడ మంట కలుస్తుందని జోస్యం చెప్పారు".

"కళంకం చంద్రునిలోకూడ వుంది" ...... అంటూ రాణి తెగిన లతలాగ రాజు పాదాలపై వ్రాలింది.

"రాణీ! తారా శశాంకుల దోషం క్షమిస్తారు. కాని మానవుని దోషం క్షంతవ్యం కాదు....!"

"ఈ పసిపాప చంద్రుని అంశమే కదా"—అంటూండగా రాణికి స్పృహ తప్పింది.

తనకు పుట్టిన బిడ్డని తన చేతులారా ఎలా చంపటం! మంత్రులు ఉన్నతాధి కారుల సలహా సంప్రదింపులతో రాజు గంధపు కట్టతో ఒక పెట్టెను అందంగా తయారు చేయించాడు. దానికి ముత్యాలు రత్నాలు పొదిగారు. పెట్టెలో మెత్తటి పట్టు పక్కను పరిచారు. పెట్టెలో నలువైపులా సువర్ణ నాణేల సంచులు, వాటి మధ్య రిక్త, మాంసపు ముద్దలాంటి తన చిన్నారి పాపను పడుకోబెట్టి ఆ పెట్టెను నదిలో వదలిపెట్టారు. "సర్వాంతర్యామీ! భగవంతుడా!! దీనోద్ధారణా!!! ఇక ఈ బిడ్డను నీకప్పగించాము!" అన్నాడు దీనాతిదీనంగా రాజు.

రాణికి స్పృహ వచ్చింది. ఆమె పెదవులమీద నిరంతరం నాట్యమాడే జోలపాట విలాపస్వరంగా మారింది. "అయ్యో! ఎంత అన్యాయం! ఏమిటీ విధి విలాసం? నీకు ఎటువంటి మంజూష లభించింది. ఆ పెట్టెకై మొసళ్ళను వేటాడే పాషాణ హృదయాలు నీకు హాని కలిగించరుకదా!...." అని పలు రకాలుగా తన బిడ్డకై పరితపిస్తోంది.

నగరం వెలుపల నదీ తీరంలా అత్తేయ అనే చాకలి బట్టలు ఉతుక్కొంటు న్నాడు. నదీ ప్రవాహంలో ఏదో మెరుస్తున్న వస్తువు గోచరించింది. అతను అనేకసార్లు కళ్ళు నలుపుకొని తేరిపార చూశాడు.

నిండుగా ప్రవహించే సలిల ధారలో సౌందర్యవంతమైన స్వప్నంలా ఏదో వస్తువు కొట్టుకొని పోతూవుంది....

రత్న వైఢూర్యాలు, ఆణిముత్యాలు పొదిగిన పేటికపై బాల భాస్కరుని అరుణ కిరణ కాంతులు పడుతూంటే అది మరీ ధగధగాయమానంగా మెరసిపోతోంది. అత్త్రేయ రజకుడు భగవంతుని స్మరించి, అమాంతంగా నదిలో దూకాడు. వింత కాంతులు విరజిమ్మే ఆ పేటిక పయనించే దిశవైపు గబ గబా ఈదసాగాడు. చివరకు దాన్ని సమీపించి పట్టుకున్నాడు. నెమ్మదిగా ఒడ్డుకు చేర్చి తెరచి చూశాడు. రెప్పవాల్చక ఎంతోసేపు ఆ పెట్టెలోని బంగారు పాపను చూస్తూ ఉండిపోయాడు. తనలాంటి సంతానహీనుని దగ్గిరకి అదృష్టదేవత ఈ రూపంలో స్వయంగా విచ్చేసింది ఆ సర్వాంతర్యామియైన భగవంతుడు హిమకరునిలాంటి సౌందర్యరాశిని నేడు తన ఒడికి చేర్చాడని ఆనందపడ్డాడు.

ఇంతకూ, ఈ భాగ్యలక్ష్మిని నిర్దాక్షిణ్యంగా ఎవరు నదీప్రవాహంలో వదలి వుంటారు? అని తీవ్రంగా ఆలోచించినా అతనికి ఏమీ అంతుచిక్కలేదు. అమాయకంగా తన కుడికాలి బొటని వ్రేలును నోటిలో పెట్టుకొని చీకుతున్న సస్సీని పదే పదే హృదయానికి హత్తుకుంటూ గద్గగ పోయాడు. ఆ క్షణంలో అతను దివ్యానందానుభూతి చెందాడు.

"ఎంతటి గొప్ప సౌందర్యరాశి" అత్త్రేయ తన భార్య ఒడిలోకి సస్సీని తీసుకొన్నప్పుడు ఆమె శుష్క నాళాలనుంచి ఒక్కసారిగా మమతా స్రవంతి పరవళ్ళు త్రొక్కింది.

పాప మెడలో బంగారు గొలుసుకు ఒక తాయెత్తు కట్టివుంది. అత్త్రేయ ఆ తాయెత్తుపై సస్సీ పేరు చదివాడు. ఆ తాయెత్తు పెట్టెకు పొదిగిన రత్నాలు ముత్యాలు అన్నీ ఒక చిన్న మూటకట్టి ఇంటి వెనుక గదిలో పదిలంగా దాచాడు. "చిట్టితల్లీ! ఇది నీయౌవ్వనపు మూలధనం, నీవు పెద్దదానవైన తరువాత వీటిని నీవే ధరించు" అన్నాడు ఆప్యాయంగా.

ఆరోజు అత్త్రేయ రక రకాల పిండివంటలు చేయించి కుల బంధువులందరికి విందు చేశాడు. మధురమైన పాయసపు పాత్రను నదీమతల్లికి సమర్పించాడు

"లోకబాంధవా! నేడు నేను ఈ విశాల ప్రపంచంలో జీవించడానికి తగిన మనిషినయ్యాను ఇంతవరకు నిద్రమత్తులో వున్న నా అదృష్టదేవత ఆకస్మికంగా మేల్కొంది, ఇదంతా నీ కృపాఫలం" అని వేనోళ్ళ భగవంతుణ్ణి పొగిడాడు.

అత్త్రేయ భార్య ఆ అందాలుచిందే సస్సీని ఎత్తుకొని గుండెలకు హత్తుకొన

గానే ఉప్పొంగిన ఆమె స్తన్యాలనుండి పాలు పొంగివచ్చాయి. తన పనికిమాలిన శరీరంనుంచి అమర సుమనం వికసించినట్టయిందామెకు.

విధి వైపరీత్యం ఎవరికెరుక! అంతఃపురపు సౌందర్యరాశి ఒక సాధారణ చాకలివాని వాకిట్లో ప్రాకుతూ తప్పటడుగులు వేస్తూ ఆడుకోసాగింది.

సస్సీ సౌందర్యం దిన దిన ప్రవర్ధమానంగా వెలుగొందుతోంది. యౌవ్వనం మొగ్గలు తొడిగి పూవులు పూయసాగింది. నీరద గమనంలో ఆమె సోయగం వృద్ధిచెందింది. చాకలి వంశాలనుంచి అనేక సంబంధాలు వస్తున్నాయి. తన కుమార్తె ముఖారవిందం చూసేసరికి అత్తేయ కళ్ళు మూతలు పడేవి. "ఈ అందాల భరిణయైన నా కుమార్తెకు ఎక్కడనుంచయినా ఒక దేవకుమారుడిలాంటి యువకుణ్ణి వెతికి తెస్తాను. ఈమెకు తగిన యువకుడు నాకు గోచరించుటలేదు" అని తీవ్రంగా యోచించేవాడు.

అత్తేయ కుమార్తె స్వర్గంనుంచి భువికి దిగివచ్చిన దేవకన్య. 'ఇతని ఇంటికి ఏదో రాజవంశపు సంబంధం వస్తుందని అతని బంధువులు అంటూ వుండే వారు.

సస్సీ నిరుపమానమైన సౌందర్యకిరణాలు దేశం నలుదిశలా వ్యాపించాయి. ఎక్కడ చూసినా ఏనోట విన్నా సస్సీ సౌందర్య పొగడ్తలే వినవచ్చేవి. పేదవారి పూరిగుడిసెలు దాటి మంత్రులు, ధనకుబేరుల చెవులవరకు ఈ సౌందర్య ప్రస్తావన సోకింది. ఎవరో రాజుగారితో "అత్తేయ చాకలి కుమార్తె రాజ భవంతులలో వుండ దగిన సౌందర్య ప్రతిమ" యని చెప్పారు.

తక్షణం రాజు చాకలిని పిలిపించాడు. అతని గుండెల్లో రాయి పడింది. "ఓ ఈశ్వరుడా! ఈ నదీ నదాలు ప్రతికూలంగా ప్రవహిస్తున్నట్లుంది. ఏమైనా సరే, రాజాజ్ఞను మన్నించాలి. త్రోసిపుచ్చడానికి వీలులేదు" అనుకున్నాడు అత్తేయ.

చాకలిభార్య సస్సీకి నలుగుపెట్టి అభ్యంగన స్నానం చేయించింది; మంచి బట్టలను కట్టింది. ఆమెకై దాచిన బంగారు గొలుసుతో వున్న తాయెత్తు మెడలో వేసింది.

అమ్మాయిని తీసుకొని తండ్రి రాజమందిరానికి చేరాడు. సస్సీ సౌంద ర్యాన్ని చూసి రాజు తనకళ్ళను తానే నమ్మలేకపోయాడు. ఇంతటి దివ్య సౌందర్యం

రాజ ప్రాసాదాల్లో కూడ ఎవరికీ లభించదు. ఈ బాలిక స్వర్గ సౌందర్య రాశిని తన గుప్పెట్లో పెట్టుకుని తీసికొని వచ్చినట్లుందని రాజు భావించాడు.

కాళ్ళక్రింద వున్న భూమి మెత్తని మఖమలులా అనిపించింది. రాజు ఉన్మాదిలో సస్సీ చేతిని పుచ్చుకున్నాడు. ఆమె భుజాలమీదికి తన చేతిని సాచడమే తడవుగా అతని దృష్టి ఆమె మెడలో తాయెత్తుమీద పడింది। అతని కాళ్ళక్రింద భూమి కంపించినట్లయింది....

రాజు అంతఃపురంనుంచి రాణిని పిలిపించాడు. సస్సీ మెడలోని తాయెత్తును ఆమెకు చూపించాడు.

"అయ్యో! నాబిడ్డా...." అంటూ రాణి కంఠస్వరం కంపించింది।

రాజు హృదయం ఎవరో నలిపివేస్తున్న ట్లనిపించింది. ఒకానొకనాడు నదిలో విడిచిపెట్టిన తన హృదయాంశం ఇంకా ఈ విశాల జగత్తులో సజీవంగా ఉందా? అని సందేహించాడు.

ఇట్టి మహత్తర సన్నివేశం ఈ జగత్తులో జరుగవలసినది కాదు అనుకొని నమ్మ శక్యంకాని ఆ స్వప్న సౌందర్యం తన కళ్ళఎదుటనుంచి మటుమాయ మవుతుందనే భీతితో రెప్పవాల్చక రాణి తదేక దృష్టితో ఆ అమ్మాయిని చూస్తూనే ఉంది.

రాజు అత్తేయని తనవద్దకు పిలిచి కూర్చుండబెట్టుకొని, నిజాన్ని దాచకుండా అమ్మాయిని గూర్చి చెప్పమని ఆదేశించాడు.

"ప్రభూ! ఆ భగవంతుడు కనికరించి సంతానహీనుడనైన నాకు ఈ బిడ్డను ప్రసాదించాడు. రత్నాలు, ముత్యాలు పొదిగిన పెట్టెలో ఈ పాప పట్టు దారాల ముద్దలా పడివుంది. ఆ పెట్టె ఒకనాడు నదీప్రవాహంలో కొట్టుకుపోతూ వుంది .. " అత్తేయ తన రెండుచేతులు కట్టుకొని నిజాన్నంతా పూస గ్రుచ్చినట్లు రాజుకు విన్నవించి ఆయన పాదాలను పట్టుకొని "ఈ బంగారుతల్లి మత్స్య కన్యలా జలంనుంచి వెలువడింది. మహాప్రభూ! పైన భగవంతుడు ఈ భువిని మహారాజు లేకుంటే ఈ దివ్యకన్య నా పేద కుటీరంలో ఆడుకోవడమేమిటి ప్రభూ.... ........" అన్నాడు భావోద్వేగంతో.

రాజు అత్తేయకి ఒక వంద సువర్ణ నాణాలను బహుమతిగా ఇచ్చాడు. ఇది అంతా భగవంతుని మహిమ! అంతఃపుర సౌందర్య ప్రకాశ పుంజాన్ని మాకు

ఇచ్చివేయమని అభ్యర్థించినట్లు అడిగాడు రాజు

రాణి హృదయంనుంచి ఆశా కిసలయాలు చిగురించాయి ఆమె "అత్తేయా! నేను నీకృతజ్ఞతకు ఋణంతీర్చుకోలేను తల్లినైన నాకు నా అదృష్టాన్ని తిరిగి ఇచ్చివేయక తప్పదు!" అంది.

అత్తేయ పెదవులు కంపించాయి. అతని నోటినుంచి మాట పెగిలి రాలేదు. అతని బదులుగా పస్సీ "మహారాణీ! మీరు కోరినప్పుడు నేను మీ యింటికి వస్తాను. నన్ను ఆ పూరిగుడిసెలోనే కాలం గడపనివ్వండి. చిన్ననాట చనిపోవనున్న నాకు ఈయన ఆశ్రయం ఇచ్చి కాపాడాడు." అంది గంభీరంగా.

రాజభవనాలలో పుండదగిన అందాలరాణి పస్సీ బాకలివాని వాకిట్లో స్వేచ్ఛగా ఆడుకొంటూ వుంది. మొదట ఈశ్వరునికి ఈమె సౌందర్య ప్రకాశం తెలుసు. ఆ తరువాత ప్రపంచపు నేత్రాలు ఈమెను చూశాయి. పస్సీ జలంలా స్వతంత్రురాలు; మనస్సు కలిగినప్పుడల్లా నదీ తీరాలలో స్వేచ్ఛగా విహరిస్తూ వుండేది

మహారాజు పస్సీ విహారానికై ఒక ప్రత్యేకమైన ఉద్యానవనాన్ని నాటించాడు. ఆ వనంలో పస్సీ తన స్నేహితురాంద్రతో ఉయ్యాలలు ఊగేది; పాటలు పాడేది. ఉద్యానంలోని కుసుమాలవలె పస్సీ ఆత్మపరమైన సుగంధం గుబాళించింది

ప్రపంచంలోని విభూతులన్నీ పస్సీపై కేంద్రీకృతమయ్యాయి. పండితులు, విద్వాంసులు, ఉపాధ్యాయులని పిలిపించటం జరిగింది. పస్సీ తన మనస్సును చదువుపై మరల్చింది. రాత్రులు దీపాలు వెలుగుతూ ఉండేవి. ఆ వెలుగులో ఆమె తన అంతరాత్మలో జ్ఞాన కాంతుల్ని నింపుకునేది.

నగరంలో గజనీ వ్యాపారి ఒకతోటను నాటించాడని తెలిసింది. అతను తన తోటలోని భవనంలో అత్యంత సుందరమైన చిత్రాలను వేయించాడు. అంత చక్కని చిత్రాలు ఆనాటివరకు ఎవ్వరూ ఎక్కడా చూడలేదు. అటువంటి చిత్రాలను గూర్చి విననైనా వినలేదు

పస్సీకి అన్ని విషయాలు తెలుసుకోవాలనే ఆసక్తి అధికమైంది. తన స్నేహితురాంద్రతో పరుగు పరుగున గజనీ వ్యాపారి తోటకు చేరుకొంది. ఆ

సుందర వనాన్ని చూసి ఆమె మనస్సు ఆనంద డోలికల్లో ఊగిసలాడింది. ఇరు వైపులా భవనపు గోడలు సుగంధ తెమ్మెరలను విరజిమ్ముతున్నాయా అన్నట్లుంది. ఒకవైపు సుమన సౌరభం, మరోవైపు వివిధరంగుల గుబాళింపులు దోబూచులాడుతున్నాయి. భవన ప్రాంగణంలో తోటమాలి పూలమొక్కలను నాటుతున్నాడు. భవనం లోపల చిత్రకాడుడు రంగులతో అనేక చిత్రాలను చిత్రిస్తున్నాడు. చిత్రాలు సజీవరూపాలు దాల్చినట్లున్నాయి. చూపరుల హృదయాలను అవి గిలిగింతలు పెడుతున్నాయి.

ససీ్స చిత్రాలను చూసి వాటి సౌందర్యానికి ప్రణామం చేసింది. ఆచిత్రాల్లో ఒక చిత్రాన్ని చూసి నివ్వెరపోయింది. ఆమె కాళ్ళు బంధింపబడినట్లయింది. ఆమె ముందుకు అడుగు వేయలేక పోయింది. కనురెప్పలు మూత పడలేదు. ఆమె శిలాప్రతిమలా నిలబడిపోయింది. చెలికత్తెలు ఆమెను ఎంతో కదిలించగా ఆమె చిత్రకారుని యెదుటకు వెళ్ళి చేతులు జోడించి "ఓ కళాపిపాసీ, ఈ చిత్రాన్ని నీవు ఎవరినిచూసి చిత్రించావు" అని ప్రశ్నించింది.

చిత్రకారుడు ఫక్కున నవ్వాడు. "సౌందర్యాన్ని భగవంతుడు నిర్మించాడు. ఎందుకూ కొరగాని నేను ఈ చిత్రాన్ని చిత్రించాను. ఇతడు కీచమ్‌వలీ అలీ హోత్ కుమారుడైన యువరాజు పున్నూ.... .. " అన్నాడు.

"పున్నూ.... పున్నూ...." ససీ్స రోమ రోమంనుంచి ఏకైక స్వరంగా వెలువడింది "పున్నూ....పున్నూ...." అని.

అందాన్ని తిలకించి, పరిశీలించాలని వచ్చిన ససీ్స తన సౌభాగ్యాన్ని తాను హస్తగతం చేసుకొన్నట్లయింది.

తన హృదయపు విలువలన్నిటితో ససీ్స, పున్నూ చిత్రాన్ని తన కళ్ళల్లో పదిలంగా దాచుకొంది.

భంబోర్ నగరపు ఉన్నతాధికారులలో ససీ్సకి దాసులు కానివారు ఎవరూ లేరు. నది రేవులన్నిటివద్ద గట్టి కాపలా పెట్టారు. వ్యాపారులపై అనేక ఆంక్షలు విధించారు. నగరం బయటినుంచి ఏ వ్యాపారి వచ్చినా అతణ్ణి ముందు ససీ్స సమక్షాన హాజరు పరచాలని ఆదేశం.

"వ్యాపారస్థుల ప్రాణాలకు, వారి వ్యాపార సామాగ్రికి ఎటువంటి హాని

జరగదు. కాని వారు అలీహోత్ కుమారుడైన యువరాజు పున్నూను ఇక్కడికి తీసికొని వచ్చేంతవరకు వారు తమ మాతృదేశానికి తిరిగిపోవడం సాధ్యపడదు." ఆదేశం జారీ అయ్యేసరికి వ్యాపారస్థులలో కల కలం బయలుదేరింది. ఒక వ్యాపారిని వారి తరపున దూతగా నియమించి కీచమ్ నగరానికి పంపారు. ఈ వార్త అలీహోత్ వినగానే బలోచ్ వంశంలో రోషాన్ని రగుల్కొల్పింది.

ఈ రోషాగ్నివార్త పున్నూకు తెలిసింది. అతను దూతను ఒక ఏకాంత ప్రదేశానికి పిలిచి అతనిద్వారా సస్సీ ప్రగాఢ ప్రేమనుగూర్చి తెలుసుకొన్నాడు.

సస్సీ హృదయాగ్ని పున్నూ హృదయాన్ని స్పృశించింది. అతను ఆపాదమస్తకం సస్సీ ప్రేమానురాగంలో దహించుకుపోయాడు.

ఉదయ భాస్కరుని అరుణ కిరణ కాంతుల్నిచూసి నేడు సూర్యుడు ఉదయించలేదు....సస్సీ ప్రేమానురాగం ఆకసమంతా ఆవరించిందని పున్నూ తలపోశాడు.

"కీచమ్‌నుంచి వ్యాపారులు వచ్చారు" అన్నవార్త కావలాదారులవల్ల సస్సీకి తెలిసింది. తక్షణం ఆమె వ్యాకుల చిత్తంతో పరుగు పరుగున వ్యాపారుల గుడారాలకు చేరింది. వ్యాపారులంతా రకరకాల వస్తువులు తమ గుడారాల ఎదుట చక్కగా అలంకరించుకొని కూర్చున్నారు.

పున్నూకూడ వ్యాపారుల వరుసలో ఒక వ్యాపారియై కూర్చున్నాడు. అటజ్ణ్ణే సస్సీ గుర్తించలేకపోయింది. పున్నూ సస్సీ నిరుపమ సౌందర్యాన్ని చూశాడు తాను ప్రాతఃకాలమున ఏ ఉదయ భానునికి నమస్కరించాడో ఆ బాలభానుడే అలని ఎదుట భూతలానికి దిగివచ్చాడా అన్నట్లు అతనికి తోచింది.

పున్నూ, సస్సీ సమీపానికి వెళ్ళి అత్తరులో ముంచిన మావి పుల్లని ఆమె పమిటకొంగుకు నెమ్మదిగా రాశాడు, సిద్ధపురుషుని పవిత్ర సమాధికి సుగంధ పదార్థాన్ని సమర్పించినట్లు

"ఇదంతా ఆ లీలామయుని మహిమలా వుంది! " సస్సీ నేత్రాలు ఒక్కసారిగా జ్యోతుల్లా మెరిసాయి. ఆమె తన కంపిత అధరాలతో "ఓ వ్యాపారీ నీవు అదృష్టదేవత వరించిన దేశాన్నుంచి వచ్చావు. నిజం చెప్పు. 'నీవు ఎక్కడైనా నా పున్నూను చూశావా" అని ప్రశ్నించింది.

"ఆఁ, చూశాను." వినయంగా పున్నూ శిరస్సు వంచాడు. నెమ్మదిగా తల పైకెత్తి సస్సీ కళ్ళల్లోకి చూసి "అప్సరసా! నిజమైన పున్నూను, నేను నేదే చూశాను, నీ కళ్ళల్లో చూశాను" అన్నాడు.

ఇరువురి శిరస్సులు ఒకదాని ఎదుట మరొకటి ప్రణమిల్లినట్లుగా అవనత మయ్యాయి.

సస్సీ ప్రేమలోపడి పున్నూ ఊరు వదిలి వెళ్ళిపోయాడన్నవార్త తెలియగానే అతని సోదరులు కోపంతో ఒంటెలనెక్కి వెనువెంటనే బంభోరు నగరానికి బయలు దేరారు. వారు అక్కడకు చేరేసరికి నగరమంతా జ్యోతిలా ప్రకాశవంతంగా కనబడింది. రక రకాల వార్తలు వింటూ పున్నూ బసచేసిన సస్సీ ఉద్యానవనం లోకి చేరారు. సుమన సందోహాల మధ్య సస్సీ, ఆమె స్నేహితురాండ్రు బుల్ బుల్ పక్షులవలె కలవరం చేస్తూ పూలతో దోబూచులాడుతున్నారు.

పున్నూ సోదరులు పరస్పరం ఏదో సలహా చేసికొన్నారు. తమ ఒంటెలను బయట చెట్లకు కట్టి ఉద్యానవనంలో ప్రవేశించారు. వారు సస్సీ పున్నూలపట్ల తమప్రేమను ప్రదర్శించారు. "మేము మా సోదరుని ఆనందంలో పాల్గొనాలని వచ్చాము" అన్నారు తేనె రంగరించిన మాటలతో అతి మధురంగా

"దయామయులారా! తమ రాకకై నేను ఎంతగానో ఎదురుచూస్తున్నాను." అంది ఆదరంగా సస్సీ. ఆమె తక్షణం రకరకాల వంటలను చేయడానికి ఏర్పాటు చేసింది.

సాయంకాలమయింది. పున్నూ సోదరులు సారాయి సీసాలు, పానపాత్రలు బయటకు తీశారు. "పాణిగ్రహణానికి ముందు మేము మూడురోజులు ఆనందో త్సవం జరుపుకుంటాము" అన్నారు. సస్సీ సఖురాండ్రు గోరింటాకు సుగంధ పదార్థాలతో కలిపి చక్కగా నూరారు. అత్తరు పన్నీరులు కలిపి నలుగుపిండిని తయారు చేశారు. వధూవరులకు పట్టు వస్త్రాలను కట్టబెట్టారు. మంగళ వాయి ద్యాలు మోగాయి.

రాజభవనంనుంచి తల్లియైన రాణి మంచి ముత్యాలు నింపిన పళ్ళాన్ని కాను కగా పంపింది. అతేయ ఎండుకొబ్బరి ఖర్జూరాలు తెచ్చి వియ్యాలవారికి సమర్పించాడు.

ఇది పుణ్యాన్ని సముపార్జించడానికి శుభప్రదమైన సమయం. కాని పున్నూ సోదరులు పాపానికి ఒడిగట్టారు. వారు పానపాత్రలో నిద్రమందు కలిపారు. అంతిమ పానపాత్రను వరుడు తీసికొనే ఆచారం వారికి ఉంది. అందుచేత పున్నూ మనస్సులో ఎటువంటి సందేహం కలగలేదు. పానపాత్రలోని సారాయిని త్రాగడమే తడవుగా అతనికి మత్తుగా నిద్ర రాసాగింది.

సస్సీ తన మిత్రురాండ్రతో తన గుడారానికి వెళ్ళిపోయింది. పున్నూ తన సోదరులతో వెళ్ళి గుడారంలో నిదురమత్తుతో ఒళ్ళు మరచి నిద్రపోయాడు.

తెల్లవారింది; సస్సీ మేలుకుంది రాత్రంతా ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన అంధకారం సూర్యుని ఎదుటనుంచి సెలవు తీసికొంటోంది. పున్నూ గుడారం చినిగి చిందరవందరగా పడివుంది. అర్ధరాత్రివేళ పున్నూ సోదరులు నిద్ర మత్తులోవున్న పున్నూను ఒంటెపైనెక్కించుకొని కీచమ్ నగరంవైపు తీసికొని పోయారు.

సుమనరాశి సుగంధమంతా సస్సీ అధరాలపై విషమ విషాదంగా మారి పోయింది. ఆమె ప్రేమమయ హృదయంలో తుపాను రేగింది. ఆమె పిచ్చి దానిలా ఆ సమయంలో తనప్రియుణ్ణి బలవంతంగా లాక్కొనిపోతున్న ఒంటెవారి నుంచి రక్షించమన్నట్లుగా రెండు చేతులు ముందుకు చాచి ఎడారులవైపు పరుగిడు తోంది.

ఆమె సఖురాండ్రు ఏడ్పు మొరలతో సస్సీని వెంబడించారు. కాని ఉన్మాద స్థితిలో పరుగిడుతున్న సస్సీని వారు సమీపించలేకపోయారు. సస్సీ ఒంటెల అడుగుజాడల వెంట విరామం లేకుండా పరుగులు తీస్తూనేవుంది. ఇంతకూ ఆమె ఏదరికి చేరిందో ఎవరికీ తెలియదు.

"పున్నూ! పున్నూ!" అనే సస్సీ కేకలు ఎడారిలో ఇసుక తిన్నెలా ఉవ్వెత్తుగా ప్రతిధ్వనించి వాయు మండలంలో విలీనమై పోయాయి.

సస్సీ అరికాళ్ళకు పెట్టిన పారాణి రక్తసిక్తమై మరీ ఎరుపెక్కింది.

నెత్తిపై సూర్యుడు సస్సీ ప్రేమ విరహతాపంలా భగ భగ మండుతున్నాడు. ఆపాదమస్తకం అగ్నిస్తూపంలా మండుతూ ఆమె ఎడారుల్లో విరామమెరుగక పరుగెత్తుతూంది.

రాణీ పంపిన ముత్యాలహారం సస్సీ మెడలోనే ఉంది. ఆమె విడివడిన శిరోజాల్లో—చిక్కుకొని తుదకు ఆ ముత్యాలసూత్రం తెగిపోయింది. జల జలా ముత్యాలు ఇసుకలో రాలిపోయాయి. అప్పట్లో ఆమెకు తనఅదృష్టాన్ని పరీక్షించిన గతం గుర్తుకొచ్చింది. ఆమె శిశువుగా వున్నప్పుడు ఉయ్యాలకు కట్టడానికై తన తల్లి ముత్యాల దండలను గుచ్చుతున్న సమయంలో దాని దారం తెగిపోయింది....

సస్సీకి రాణీతల్లి చెప్పిన' మాటలు జ్ఞాపకంవచ్చి ఆమె నోటినుంచి ఒక్క సారిగా దీర్ఘ నిట్టూర్పు వెలువడింది "నా అదృష్టాన్ని ఆనాడే అమ్మ గమనించింది........" అన్న శబ్దాలు వెలువడ్డాయి అప్రయత్నంగా.

సస్సీ అరికాళ్ళ బొబ్బల బాధతో క్రిందపడిపోయింది. ఇసుకలో రాలి పోయిన ముత్యాలను చూసింది. మళ్ళీ మరుక్షణం ఒంటెల పాదగుర్తులను వెతకడం మొదలెట్టింది.

ఎడారిలోని సైకతం సస్సీ అనంతమైన ఆలోచనలవలె అనంతమైనది.

"నేను జలానికి, స్థలానికి మూలధనాన్ని. ఒకానొకప్పుడు అనంత జల రాశి నన్ను అమూల్య మూలధనంగా తన అరచేతుల్లో పైకెత్తి కాపాడింది. ఇప్పుడీ ఎడారులు నా ప్రేమయనే మూలధనంవలె నన్ను సంభాళిస్తు కాపాడతాయి........" సస్సీ వ్యథా విరహాలతో తన హృదయానికి ఊరట కలిగించుకుంది.

కుకనూస్ పక్షి గానం చేస్తున్నప్పుడు దాని రెక్కలనుంచి అగ్నిజ్వాలలు వెలువడుతాయి. అది గానం చేస్తున్నకొద్ది జ్వాలలు ఉవ్వెత్తుగా లేస్తుంటాయి. చివరకు అది తన రెక్కలనుంచి వెలువడిన జ్వాలలలోనే భస్మమై పోతుందని సస్సీ గురువులవల్ల విని వున్నది.

ఆమె అంగ ప్రత్యంగములనుంచి విరహజ్వాలలు లేస్తున్నాయి. ఆ తాపంతో ఆమె యింకా పెద్దగా పున్నూ....! పున్నూ....! అని అరచింది.

ఇక ఆమె అవయవాలు ప్రేమాగ్నిలో భస్మం కాజొచ్చాయి....

దగ్గరగానున్న మెట్టప్రక్కనుంచి ఒక గొల్లపిల్లవాడు గొఱ్ఱెలను తోలుకొని పోతున్నాడు. అతనికి వేదనాభరితమైన కేకలు వినబడ్డాయి. అతను వడగాలిని చీల్చుకుంటూ మెట్ట ప్రక్కనుంచి పరుగు పరుగున అక్కడికి వచ్చాడు. రత్నాలు

ముత్యాలు అంచులందు పొదిగిన చీరె ఏదో ప్రేతవనంలా నిర్జనమైన ఎడారిలో పడి ఉండడం చూశాడు.

"అయ్యో, భగవంతుడా!" అంటూ ఆ కుర్రవాడు చీరెకొంగు పైకెత్తి చూశాడు. ససీ్స స్పృహతప్పి పడిఉంది.

ఆ బాలుడు తన గొఱ్ఱెపైనున్న నీటి తోలుసంచి తీసుకొనివచ్చి ఆమె ముఖం మీద నీళ్ళు చల్లాడు.

కొద్దిసేపటికి సస్సీకి స్పృహ వచ్చింది. మళ్ళీ మరుక్షణం "పున్నూ...., పున్నూ...." అని గట్టిగా కేకలు వేసింది. నీటి బిందువులతో దోసెలి నింపు కున్నట్లుగా ఆమె పున్నూ నామస్మరణంతో తన కంఠాన్ని నింపుకుని ప్రాణాన్ని వదిలింది.

ఆ గొల్లబాలుడు ఎంతోసేపు మౌనంగా ఆమెముందు చతికిలబడి కూర్చుండి పోయాడు. అస్తమిస్తున్న సూర్యునితోబాటు అతను అక్కడే ఇసుకలో ససీ్సని సమాధి చేశాడు.

గొల్లబాలునిలో నూతనంగా అంకురిస్తున్న యౌవ్వనం ఒక్కసారిగా వైరాగ్యంగా మారిపోయింది. ఈ అప్సరకన్య సమాధిపై దీపంలా ఆ వైరాగ్యం నిరంతరం వెలుగుతూ ఉంటుంది.... అని అతనికి అనిపించింది.

సాయంకాలం మసకగా వున్న చీకటి అప్పుడే వ్యాపించింది. ఇంతలో ఏదో ఒంటె ఆ సమాధి సమీపంనుంచి ముందుకు సాగింది. ఒంటెపై ఒక యువకుడు ఉన్నాడు. నిర్మానుష్యమైన ఎడారిలో ఆ కుర్రవాడు కూర్చుని వుండడం చూసి క్షణకాలం అతను తన ఒంటెను ఆపాడు. అతడు, ఇక్కడ ఎక్కడైనా కాస్త మంచినీళ్ళు దొరుకుతాయా? అని ఆ అబ్బాయిని అడిగాడు.

గొల్లకుర్రవాడు ససీ్సకి గుక్కెడు నీరుపోసిన పాత్రతో నీరు నింపి అతని ముందు ఉంచాడు.

ఆ యాత్రికుడు నీళ్ళు త్రాగాడు. ఆశ్చర్యకరంగా "ఈ నిర్జనమైన ఎడారిలో చెట్టూలేదు, నీడాలేదు. నీవు ఇక్కడ ఒంటరిగా ఎందుకు కూర్చున్నావు?" అని ప్రశ్నించాడు.

ఆ అబ్బాయి సమాధిని చూపించాడు. "నా మనస్సు ప్రపంచం అంటే విరక్తి చెందింది. నేడు ఇక్కడ ఒక అప్సరసలాంటి అమ్మాయి దిక్కూ మొక్కూ లేకుండా చనిపోవడం చూశాను...." అన్నాడు దీనంగా.

"ఎవరు"? యాత్రికుని చేతిలోనున్న నీళ్ళపాత్ర కంపించిపోయింది.

"ఎవరో, ఏమో పున్నూ, పున్నూ అంటూ ఆమె ప్రాణాన్ని వదలింది...."

ఒంటెరౌతు వణుకుతున్న చేతిని గొల్లకుఱ్ఱవాని భుజంపై ఉంచాడు. "తమ్ముడూ! నీవు నాపై దయచూపి ఈ సమాధిని త్రవ్వి దాన్ని కాస్త పెద్దదిగా చెయ్యి!" అన్నాడు.

గొల్ల కుఱ్ఱవాడు ఖంగారుగా ఆ యాత్రికుని చూస్తూ ఉండిపోయాడు కాని ఆ రౌతు ఇంక ఏమీ చెప్పలేకపోయాడు, అతనే స్వయంగా తన చేతులతో ఆ సమాధి ఇసుకను గబగబా తొలగించసాగాడు అతను సమాధిని త్రవ్వడం పూర్తి చేశాడు.

సస్సీ మృత శరీరానికి ముందుగా నమస్కరించాడు. తరువాత తాను కట్టుకున్న బట్టలను ఊడదీసి వాటిని ఆమె కాళ్ళవద్ద ఉంచాడు...."ఓ సస్సీయా! న సోదరులే నన్ను మోసగించారు నాకు వాళ్ళు యిచ్చిన నిదురమత్తు మాత్రల మత్తు నుండి స్పృహ రాగానే నీపట్ల నా విశ్వాసాన్ని ఋజువు చేసుకునేందుకు నీ దగ్గర తిరిగి వచ్చాను...." అన్నాడు అతి దీనంగా

పున్నూ తన ఖడ్గబలంతో సోదరులతో పోరాడి వారి బారినుంచి తప్పిం కొని తిరిగి వచ్చాడు. అదే కత్తితో అతడు తన రొమ్ములో పొడుచుకుని స సమాధిలో కుప్పగా కూలిపోయాడు.

ఆ గొల్లబాలుడు ఖంగారుపడిపోయాడు.....అతనికి అంతా అయోమయం వుంది. ఆ సమాధిని యిసుకతో నింపుతూ సమాధి దీపపు జ్వాలలా అత గడ గడా వణకిపోయాడు.

# సోహనీ-మహీవాల్

—కర్తార్‌సింగ్ దుగ్గల్

పంజాబు పంచనదుల దేశం-జీలం, చీనాబ్, రావి, బియాస్, సట్లేజ్. 1947వ సంవత్సరంలో భారతదేశ విభజన సమయంలో మూడు నదులు పాకిస్తాను వాటాకు పోగా రెండు నదులు బియాస్, సట్లేజ్ భారతదేశపు వాటాకు లభించాయి. మూడు నదులు కలిగిన తన భూభాగాన్ని పాకిస్తానువారు పంజాబు అని పిలుస్తారు. రెండు నదులు వున్న భూభాగాన్ని మనంకూడ పంజాబు అంటాము. ఈ కృత్రిమ సరిహద్దు రేఖలు ఏదో ఒకనాడు పలకపై వ్రాసిన అంకెలవలె చెరిగిపోవచ్చు. పంజాబు అంతా ఈ అంధకారాన్ని అతిక్రమించి ఉవ్వెత్తున లేచి బయట పడవచ్చునని ఆశించవచ్చు కూడా

పంజాబులోగల నదులలో చీనాబ్ నదిని గూర్చి ఎక్కువగా ఉల్లేఖిస్తూ ఉంటారు. అక్కడి జానపద సాహిత్యంలో ఈవర్ణన అధికంగా గోచరిస్తుంది.

జానపద గేయాలు, కథా కథానికలలో చీనాబ్ నదిని ఝనా అనే పేరుతో వర్ణించారు ఈ నదీజలంలో ఏదో అద్భుతమైన మహిమ వుందని ప్రజల నమ్మకం ఒక్కొక్కసారి ఆ నది మానవుణ్ణి ఎందుకూ కొరకాకుండా చేస్తుందని, ఇహ పరలోకాలకు కూడా పనికిరానట్లు మార్చివేస్తుందని కూడ అంటారు. ఈ నదీతీరంలో దామోదర కవి కళ్ళ ఎదుట హీర్-రాంఝూల విషాదాంత కథనం జరిగింది. ఈ నదీతీరంలో మిరజా సాహిబాల మహోన్నత ప్రేమ మహోజ్జ్వలంగా వెల్లివిరిసింది. వారిరువురు తమ ప్రేమలో భగ్నహృదయులై పోయారు. ఈ ఝనా జలాలపై సోహని మహీవాల్ ప్రేమగాధ రక్తరంజితంగా వ్రాయబడింది.

ప్రపంచ దేశాలన్నీ భారతదేశాన్ని బంగారు పక్షిగా తలచే రోజులనాటి మాట యిది దేశ విదేశాలనుంచి వ్యాపారులు, విలువైన రక రకాల వస్తువులు తీసుకుని ఈ దేశానికి వచ్చేవారు. మళ్ళీ మనదేశపు చిత్ర విచిత్రమైన విలువైన వస్తువులను తీసుకొని తమ దేశాలకు తిరిగి వెళ్ళేవారు. ఈ కథ బుఖారాకు చెందిన

ఒక వ్యాపారితో ప్రారంభమవుతుంది. అతను అరబ్ దేశపు గుఱ్ఱాల వ్యాపారం చేసేవాడు. అతనితోబాటు ఒకసారి ఇజ్జత్ బేగ్ అనేపేరుగల యువకుడు ఈ దేశానికి వచ్చాడు. అతనికి గుఱ్ఱాలంటే అపరిమితమైన యిష్టం. వాటిని చూసి మైమరచి పోయేవాడు.

ఇజ్జత్ బేగ్ రకరకాలుగా గుఱ్ఱపు స్వారీ చేసేవాడు. ఒకప్పుడు కుమ్మెదీ నగరానికి హంస మయూర గమనంలో ప్రయాణం చేస్తే మరొకప్పుడు శర వేగంతో తన గుఱ్ఱంపై స్వారీ చేసేవాడు. అందమైన రంగు రంగుల జీనులను తన గుఱ్ఱాలకు అలంకరించేవాడు. ఇలా రకరకాల అశ్వ విన్యాసాలతో దర్శ కుల నేత్రాలకు మిరిమిట్లు గొలుపుతూ ఉండేవాడు. ఆ యువకవ్యాపారి గుఱ్ఱాలు అధిక ధరకు అమ్ముడు పోయేవి. అలా వారు తమ గుఱ్ఱాలను విక్రయించుకుంటూ గుజరాత్ చేరుకున్నారు. తమ దేశానికి తిరిగిపోయేసరికి వారివద్ద అవసరమైన గుఱ్ఱాలు మాత్రమే మిగిలేవి. లాహోర్, ఢిల్లీ, ఆగ్రా మొదలైన అనేక నగ రాలను వారు తిరిగి వచ్చారు. గుఱ్ఱాలతోబాటు మణుగుల తరబడి లవంగాలు, ఏలకులు, పిస్తా, బాదాం, కిస్మిస్ మొదలైన సరకులను కూడా విరివిగా అమ్మే వారు.

ఆ రోజులలో గుజరాతి ప్రాంతం మట్టి పాత్రలకు గొప్ప ప్రసిద్ధి చెందింది! తులాయను ఒక కుంభకారుడు ఈ శిల్పంలో ప్రసిద్ధి చెందాడు. అతను చేసిన పాత్రలు సుదూర దేశ విదేశాలలో బాగా అమ్ముడు పోయేవి. అతనుచేసే కూజాల మెడ భాగంనుంచి నీరు తొణికిసలాడుతున్నదా యన్నట్లు తయారు చేసేవాడు. అతను తయారుచేసే చిన్న గిన్నెలు, పూలపాత్రలు చిన్న పళ్ళాలు, చిలుంపీల్చే గొట్టాలను చూసి, కొనేవారి మనస్సు ఎంతకీ తనివితీరేదికాదు. అతను ఎక్కడ నుంచి మట్టి తెచ్చేవాడో, ఎవ్వరికి తెలీదు. కుమ్మరిచక్రంపై మట్టిముద్దలతో అపురూప వస్తువుల రూపు రేఖలను దిద్దేవాడు. తన ఈ శిల్ప రహస్యాన్ని అతను పైకి తెలియనిచ్చేవాడు కాదు. అతని పాత్రలపై వివిధ రంగులతో చిత్రించిన చిత్ర కళ అద్వితీయంగా ఉండేది. ఎన్నో తరాలుగా అతని వంశం యిదే వృత్తి చేస్తూంది. తులాకుమ్మరి మిగిలిన పనులన్నీ చేస్తే చేయవచ్చుకాని చిత్రకళకు సంబంధించిన పని అంతా అతని కుమార్తె సోహనీ చేసేదని ఈనాటి పంజాబు ప్రజలు చెప్పుకుంటారు. సోహని సన్నని చేతివ్రేళ్ళు సుకుమారంగా, సుకోమలంగా,

ఉండేవి. ఆమె సౌందర్యాన్ని గూర్చిన కథలు యింటింటా వేనోళ్ళ చెప్పుకునే వారు. ఆమెనుగూర్చి వ్రాసిన సాహిత్యం పంజాబు సాహిత్యంలో కోకొల్లలుగా ఉంది.

ఒకరోజున ఇజ్జత్‌బేగ్ తిరిగి తిరిగి తులా కుంభకారుని వాకిటికి చేరాడు. అది వాకిలికాదు. ఒక మహత్తరమైన మట్టిపాత్రల నిర్మాణ కర్మాగారం. అక్కడ వందలాది కూలీలు పనులు చేస్తున్నారు. ఎన్నో గదులు, వసారాలు, మట్టిపాత్ర లతో నిండి ఉన్నాయి. తులా మట్టిశిల్పసౌందర్యం చూసి ఇజ్జత్‌బేగ్‌కు ఆశ్చ ర్యం కలిగింది. శిల్పంలో ఒకదానిని మించిన మరోపాత్ర అచ్చట గోచ రించింది. ఒకదానిని మించిన మరోచిత్రం వెన్నెల జల్లులు చల్లుతున్నట్లున్నాయి. వివిధరంగుల చిత్రాలు చూసి అమీర్‌జాదా చూపులకెంతో చల్లదనం కలిగింది. బయట ప్రదేశంలో శరీరాన్ని మండించే తీవ్రమైన ఎండ కాస్తుంది.

తులా కుంభకారుడు స్వయంగా బుఖారాకు చెందిన అమీర్ జాదాహ శిల్ప సోయగంతో మురిసి మెరుస్తున్న మట్టి పాత్రలను చూపిస్తున్నాడు. ఒక వసారానుంచి మరొక వసారాకు, ఒక గదినుంచి మరొక గదికి తీసికొనిపోయి అన్నీ చూపించాడు. వారు పాత్రలను చూస్తూ ఇంటిలోపల గదిలోకి వెళ్ళారు. అక్కడ తులా అపురూపమైన తన అమూల్య మట్టిపాత్రలనుంచాడు. ఆ వివిధ మట్టిపాత్రలను ధన కుబేరులే కొనగలరు.

ఇజ్జత్‌బేగ్ శిల్ప సౌందర్యాన్ని ఊహిస్తూ ఒక గదిలోపల అడుగు పెట్టగానే ఎదుటవున్న తెరవెనుక అరుగుపై కూర్చునియున్న తులా కుమార్తె సోహని సౌందర్య కిరణం తళుక్కుమని కనపడింది. ఆమె ఒక పానపాత్రపై చక్కని చిత్రాలను రూపొందిస్తూ ఉంది. ఒక్క చూపులో అతను తన్మయత్వం చెందాడు. ఇజ్జత్ బేగ్ చేతిలోనున్న పూలగుత్తి మట్టిపాత్రపై పడిపోయింది. పాత్ర పగిలిన ధ్వనితో సోహని గుండె గుభేలుమంది. ఆమె తక్షణం తన చేతిలోవున్న రంగుకుంచె పట్టుకొని శిరస్సుపై మేలిముసుగు లేకుండానే గదిలోకి చక చక వచ్చింది.

సోహని తన ఎదుట ఇజ్జత్‌బేగ్ నిలబడి వుండడం చూసింది. అతను చక్కని శరీర సౌష్ఠవం గల పొడుగాటి మనిషి. వికసించిన గులాబీలా అతని ముఖం తేజోమయంగా ఉంది. మెడక్రిందివరకు నల్లని నిగనిగలాడే గిరజాల జుత్తు. మరోవైపు దివినుంచి దిగివచ్చిన అప్సరలాంటి మనోహరమైన సోహని

నిలబడి ఉంది పరాయి పురుషుని చూసిన కారణంగా ఆమె కొంత ఖంగారు పడింది ముఖం ఎర్రబడింది చంద్రబింబంలాంటి ఆమె ముఖంపై నల్లని ముంగురులు చిందర వందరగా పడి ఉన్నాయి. గుమ్మందగ్గిర నిలబడివున్న సోహని బంగారు బొమ్మలా గోచరిస్తోంది

కొద్ది నిమిషాలు గడిచాయి గొంతుక సవరించుకుంటూ ఆమె తండ్రి పగిలి నేలపై పడిన సుమనపాత్ర పెంకులను ఏరడం ఆరంభించాడు

ఆనాటినుంచి వరుసగా రెండు మూడు రోజులు ఇజ్జత్‌బేగ్ తులా యింటికి వచ్చాడు. అతను తనకు నచ్చిన రకరకాల పాత్రలను కొనేవాడు ఈ విధంగా అతను ఎన్నో మట్టిపాత్రలను కొన్నాడు

మరొకరోజు అమీల్‌జాదా (ఇజ్జత్‌బేగ్) తులా ఇంటికి వచ్చాడు కాని తులా ఎక్కడికో బయటకు వెళ్ళాడు అతని బంధువులలో ఎవరో స్వర్గస్థులయ్యారు. తండ్రిలేని కారణంగా వచ్చిన పెద్దమనిషికి సోహని మర్యాద చేయవలసి వచ్చింది. అంతేకాదు, వ్యాపారదృష్ట్యా స్వయంగా పాత్రలను చూపించసాగింది. ఉదయంనుంచి మధ్యాహ్నం వరకు ఇజ్జత్‌బేగ్ విభిన్న చిత్రకళతో నిండివున్న పాత్రలను కొంటూనే వున్నాడు. నెమ్మదిగా పొద్దు దిగజారింది; సూర్యుని ప్రచండతాపం విశ్రాంతినొందసాగింది. సంధ్యాసమయమైనది కాని కాలం ఎలా దొర్లింది, ఏమి జరిగింది మరేమి ఒరిగింది? అనే విషయమే సోహనికి తెలీదు పాత్రలను అమ్ముతూ ఆమె తనను తాను మరచిపోయింది పరదేశీయుని చేతి స్పర్శవల్ల ఆ మట్టిపాత్రల సౌందర్యం మరింతగా ఇనుమడించినట్లు అనిపించింది ఆమెకు. ఇజ్జత్‌బేగ్ రాకతో ఆ యింటిలో చల్లదనం వ్యాపించినట్లయింది. ఇంటిబయట మండుటెండ యింటిలోపల చల్లని చల్లదనానికి యెంతయో వ్యత్యాసం ఉంది. ఆ యువకుని చేతి స్పర్శతో సోహని అంగప్రత్యంగాలు వికసించినట్లయింది అక్కడి వాతావరణంలో మధుర సంగీత సప్తస్వరాలు ప్రతిధ్వనించాయి

మరోవైపు ఇజ్జత్‌బేగ్‌తో వచ్చిన యితర వ్యాపార మిత్రులు ఖంగారు పడుతున్నారు వ్యాపారంలో సంపాదించినదంతా బేగ్ మట్టిపాత్రలు కొనుటకై ఖర్చుపెట్టాడు వారి నివాసంలో కుప్పలు కుప్పలుగా పాత్రలు ప్రోగుపడివున్నాయి. ఏదో నాలుగైదు పాత్రలనైతే మనిషి మోయగలడు, కాని వందలాది మట్టిపాత్రలను

సుదూరంలోనున్న బుఖారాకు ఎలా తీసుకొని వెళ్ళగలడు! ఇజ్జత్‌బేగ్ ఈ పట్టణాన్ని విడిచి రావడానికి సుముఖంగాలేడు. ధర్మశాలలోనుంచిన పాత్రలపై రోజు రోజూ దుమ్ము పేరుకుంటూ ఉంది. దొంతరులుగా పేర్చిన మట్టిపాత్రలలో కొన్ని పగిలిపోతున్నాయి. ఇజ్జత్‌బేగ్ చేసే పనులలో ఆంతర్యం అతని మిత్రులకు అంతు పట్టడంలేదు.

చివరకు విసుగెత్తి ఒకనాటి ఉదయం వ్యాపారస్థుల దళం అచ్చటినుంచి బయలుదేరి తమ దేశం వెళ్ళిపోయింది. ఇజ్జత్‌బేగ్ మాత్రం వారివెంట వెళ్ళలేదు.

ప్రస్తుతం ఇజ్జత్‌బేగ్‌కు ఒకే ఒక పని మిగిలింది. పగలస్తమానం తులా కుంభకారుని కర్మాగారంలో నలువైపుల తిరగడం ఒకప్పుడు గిర్రున తిరిగే కుమ్మరి చక్రం దగ్గిర నిలబడి తదేకంగా చూడడం మరొకసారి కుండల ఆమం దగ్గరకు వెళ్ళి అవి ఎలా కాలుతున్నవో పరిశీలించడం మరోసారి మట్టిపాత్రల ధరలను నిర్ణయించడం, అంతేకాదు సోహని తన కంటికి కనబడితే చాలు అతనికి ఆరోజు అఖండ విజయం పొందినట్లు వుండేది.

సోహని పరిస్థితి కూడా మారింది. పరదేశీయుని శరీర స్పర్శతో ఆమెకు తనపని, తన యిల్లు అంతా పరాయిదిగానే కనపడుతోంది. భోజన పానీయాలు ఆమెకు రుచించుటలేదు. రాత్రివేళ నిదురపట్టడంలేదు; అహోరాత్రాలు అవిరామంగా కూర్చుని పాత్రలకు ఎన్నో వన్నెలు దిద్దుతూనే ఉంది. తన ప్రియునికి నచ్చిన నీలి రంగును మట్టిపాత్రలకు అంచువేస్తూ ఉండేది. అతనికి నచ్చే చిత్రాలను ఆ పాత్రలపై సప్త రంగులతో చిత్రిస్తూ ఉండేది.

సోహని తండ్రి అంతా గమనిస్తూనే ఉన్నాడు. చదువు లేకపోయినా ఇజ్జత్, సోహనీల మధ్య జరిగేదంతా అవగాహన చేసుకుంటున్నాడు. నోటితో ఎన్నడూ పల్లెత్తు మాటయైన అనలేదు. కాని లోలోపల కాలిన కుండవలె మండి పడుతున్నాడు. సోహని పెండ్లిచేయాలని అతను చేయరాని ప్రయత్నాలన్నీ చేశాడు. అమ్మాయి తన వశంలోకి రాలేదు. కాని తన ఏకైక పుత్రికను ఏదో పర దేశీయుని చేతులలో పెట్టడమంటే అతనికెంతో బాధగా ఉంది. బుఖారాకు వ్యకవదళం వెళ్ళి ఎన్నో వారాలు అయ్యింది. బేగ్‌వద్ద డబ్బు ఏమీ మిగులలేదు. మాసిన బట్టలు, ఆకలి దప్పులు, పైసా పైసాకు యిబ్బంది పడుతున్నాడు.

గుర్రాల పరిశీలనాశక్తి తప్ప, ఇజ్జత్‌బేగ్‌కు మరి ఏపనీ రాదు. ఆ పట్టణ వాసులు మాట్లాడే భాష అతనికి అర్థంకాదు. చివరకు ఎంతో ఆలోచించి అతను ఒకరివద్ద పశువుల కాపరిపని చేబట్టాడు. ఆ ఊరివారి ఆవులు, గేదెలు, దున్న పోతులు, గుర్రాలను ప్రోగుచేసేవాడు. వాటిని ఊరు బయటకు మేపుటకై తోలుకొని పోయేవాడు. పగలంతా పచ్చిక బయళ్ళలో పసువులను మేతకై విడచి తాను పిల్లనగ్రోవిని వాయిస్తూ కాలం గడిపేవాడు. అతని చంకలో నిరంతరం పిల్లన గ్రోవి ఉండేది. సోహని అతను పచ్చికబయళ్ళలోన అప్పుడప్పుడు కలుసుకునే వారు తులా కుంభకారుని పాత్రలకువిలువకట్టే అధికారం, యోగ్యత, కానేశక్తి అతనికిలేదు.

బుఖారా నివాసి అమీర్‌జాదా పంజాబు నివాసియైన సోహనికై పశువుల కాపరిగా మారాడు.

ఏడు పరదాల వెనుక ఘోషాలో వుండే కళా తపస్వినియైన యువతి సోహని ప్రస్తుతం అడవులు, పచ్చిక బయళ్ళలో పిచ్చిదానిలా తిరుగుతూ ఉంది. పశుల కాపరి ప్రేమలో పడిన సోహనికి పనిపాట్లన్ని విషతుల్యంగా కనబడుతున్నాయి. ఆంతరంగిక స్నేహితురాండ్ర మరుగున ఆమె ఉదయం సాయంకాలం నగరం నుంచి బయటకు పోయేది. ఆమె చెలికత్తెలు ఒకప్పుడు నాట్యంచేసి, మరొకప్పుడు పాటలు పాడి పశుల కాపరి హృదయాన్ని ప్రేమ తరంగాలలో వోలలాడించేవారు. ప్రేమ దాచినా దాగని వస్తువు కొద్ది రోజులలోనే సోహని. పశుల కాపరి ప్రేమ బజారున పడింది. పలువురూ పలువిధాలుగా వారినిగూర్చి చెప్పుకుంటున్నారు. ఈ నగుబాటునుంచి రక్షణ పొందుటకై తులా కుంభకారుడు దారిన దొరికిన కుర్ర వాడినే పట్టుకొని సోహనితో వివాహం చేసి నిశ్చింతగా వున్నాడు.

"బాబూ మహీవాల్‌తో నా ప్రేమ సంబంధం ఎన్నోజన్మల పుణ్యఫలం, నన్ను అతనితో వేరుచేయవద్దు" అని సోహని ఎంతగానో అర్థించింది. కాని ఎల్లప్పుడూ ప్రాణహీనమైన మట్టికుండలతో జీవితాన్ని గడిపే తులా కుంభకారుని బుద్ధికి ఆమె మాటలు అర్థంకాలేదు. ఆమె మాటలన్నిటిని పెడచెవిన పెట్టాడు.

జలజలా కన్నీరు కారుస్తున్న సోహనీని బలవంతంగా పల్లకీలో కూర్చుండ బెట్టి అత్తవారింటికి పంపించి వేశాడు తండ్రి.

ముడా నదీతీరపు అవతలి ఒడ్డున సోహనీ అత్తవారి గ్రామం ఉంది. ఇవ తలి ఒడ్డున ఆమె తండ్రి గ్రామం ఉంది. అక్కడే మహీవాల్ సోహనీ వియోగ విరహంలో అహోరాత్రాలు ఒడ్డునపడ్డ చేపపలె గిల గిల కొట్టుకుంటు న్నాడు. ఒంటరిగా పిచ్చివానిలా తిరుగుతూ "సోహనీ, సోహనీ" అని గట్టిగా పిలుస్తూ ఉండేవాడు. అతని రక్తమంతా కన్నీరుగా ప్రవహించింది. ఆకలి దప్పులనే అతను మరచిపోయాడు. పంచభక్ష్య పరమాన్నాలను ఆరగించే అమీర్ జాదా (మహీవాల్) గడ్డిపరకలా చిక్కిపోయాడు. అతను ఎంతో చక్కని పంజాబి భాష మాట్లాడగలడు. తన హృదయ వేదనను తన భాషలో గానం చేస్తున్నాడు. అతని ప్రతి మాటలో సోహనీ తప్ప మరో స్మరణే లేదు. అర ణ్యాలు పచ్చిక బైళ్ళలో ఎక్కడ చూసినా "సోహనీ, సోహనీ" స్వరం ప్రతి ధ్వనిస్తూ ఉంది.

అత్తవారింట సోహనీ పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉంది. నిరంతరం మహీవాల్‌ను హృదయంలో స్మరిస్తూ ఉండేది. తనను వివాహం చేసుకున్న భర్తకు, భార్యగా వ్యవహరించేందుకు సుతరామూ ఆమె అంగీకరించుటలేదు. అహోరాత్రాలు మహీవాల్ తప్ప మరో ధ్యానయే ఆమెకు లేదు. ఒకరోజు ఆరు బయట తిరుగుతుండగా సోహనీ అతణ్ణి పిలిచినట్లనిపించింది. అతను శ్రద్ధగా ఆ పిలుపు వినాలని ప్రయత్నించాడు. అయితే ఆ ధ్వని అతని హృదయంనుంచే వెలువడుతున్నదని తెలుసుకున్నాడు. అది గ్రహించి మహీవాల్ పకపకా నవ్వు కున్నాడు. ఇది ఒక మోసం అనుకున్నాడు. అతను పిచ్చివానిలా బిగ్గరగా పకపకా నవ్వుకునేవాడు. కాని ఎవరో అతనిని పిలుస్తున్నట్లుగా "మహీవాల్" "మహీవాల్" అంటూ వినబడేది. అతను పరుగు పరుగున వెళ్ళి ఎత్తైన దిబ్బఎక్కి నలు వైపుల తదేకంగా కలియచూశాడు. ఎక్కడా ఎవ్వరూ కనబడలేదు. అయినా పిలుపు స్వరం మాత్రం వినబడుతూనే ఉండేది. బహుశా ఎదుటవున్న చెట్ల సము దాయంలో ఎవరో ఉండి వుంటారు. అందుకనే "మహీవాల్"! "మహీవాల్!" "మహీవాల్"! అనే స్వరం వినబడుతోంది అనుకునేవాడు. అతని ప్రతి శ్వాస నుంచి సోహనీ పిలుపుతోపాటు కలసి "సోహనీ మహీవాల్" సోహనీ మహీవాల్! మహీవాల్ సోహనీ! మహివాల్ సోహని! అని వినబడేది ఇదంతా ఏమిటో మహీ వాల్‌కు అర్థంకాలేదు. ఎవరో అతనిని పరిహసిస్తున్నట్లు అనిపించింది. కాని అక్కడ

ఎవ్వరూ లేరు. మరుక్షణం అతనిని పిలిచినట్లు మరల దాగినట్లు అనిపించేది. ఒకప్పుడు ఎక్కడో దూరంనుంచి పిలుపు వస్తున్నట్టు భావించేవాడు. మరొకప్పుడు ఆధ్వనులన్ని హృదయంనుంచే వెలువడుతున్నట్లు తలచేవాడు. "సోహనీ మహీవాల్"! "మహీవాల్ సోహనీ!" అన్న ఆకస్మికంగా వినవచ్చిన స్వరం ఏదో దూరపు కందకంనుంచి వస్తున్నట్లు అనిపించింది. రివ్వున పరుగెత్తి కెళ్ళి ఆ కందకంలో గభాలున దిగాడు. దిగిన తర్వాత ఆ ధ్వని బయటనుంచి వస్తున్నట్లనిపించింది. మళ్ళీ వెంటనే పైకి ఎక్కాలని ప్రయత్నించాడుకాని అతని ఊపిరి ఆడడం లేదు. ఆకలి దప్పులతో కాళ్ళకు చెప్పులు లేకుండా పరుగెడుతూ అలసి సొలసి కందకం పైభాగానికి ఎల్లాగో ఎక్కగలిగాడు. కాని మళ్ళీ కందకంనుంచే "సోహనీ మహీవాల్"! "మహీవాల్ సోహనీ"! అన్న పిలుపు వినవచ్చింది. నిజమే, పిలుపు కందకం లోపలనుంచే వస్తున్నదని గబగబా మహీవాల్ కందకంలో ప్రవేశించాడు. క్రిందికి దిగుతున్నకొద్దీ ఆ పిలుపు అతనికి దూరం అవుతున్నట్లు అనిపించింది. కందకపు దిగువ భాగానికి చేరిన తర్వాత ఆపిలుపు నిజముగా బయటనుంచే వస్తున్నట్లు వినబడింది. పైభాగంనుంచి "సోహనీ మహీవాల్"! "మహీవాల్ సోహనీ"! అన్న పిలుపు వినబడింది. పిచ్చివానిలా మరల అతను కందకంపైకి ప్రాకడం ప్రారంభించాడు. పైకిచేరి కళ్ళు పెద్దవిచేసి నలుపైపుల దీక్షగా చూశాడు. ఆ ధ్వని ఎక్కడనుంచి వస్తుంది? ఎంతో దూరంగా ఉన్నట్లనిపించింది. మరొకసారి అతిసమీపంలో ఉన్నట్లు తోచింది. ఈ పిలుపులతో మహీవాల్ విసుగెత్తిపోయి కట్టుకున్న బట్టలను ముక్కముక్కలుగా చించివేశాడు శరీరమంతా చెమటతో స్నానంచేసినట్లయింది. ఎన్నో రోజులనుంచి శరీరం దుమ్ముపట్టి పోయింది అతను పిచ్చివానివలె వెనుక ముందులకు పరుగెత్తడం ప్రారంభించాడు. చివరకు పరుగెడుతూ, పరుగెడుతూ ఝునానదీతీరానికి చేరాడు. ఆ ధ్వని జల తరంగములనుంచి వస్తూ ఉండవచ్చుననిపించింది. నిజమే. ఆ పిలుపు ఝునానదీ జలమునుంచియే వెలువడుతోంది అనుకుని మహీవాల్ నదిలోకి దూకాడు.

మహీవాల్ ఈదుతూ ఈదుతూ ఉక్కిరి బిక్కిరి అయ్యాడు. ఆ నదీ కెరటాలతో ప్రాణరక్షణకై పోరాటం ప్రారంభించాడు. వెనుక ఒడ్డు ఎంతోదూరంలో ఉంది. ముందు ఒడు కనుచూపు మేరలోనైనా కనబడడంలేదు. అతను కాళ్ళూ చేతులు కొటుకుంటూ పెద్దపెద్ద కెరటాలను చీల్చుకుంటూ ముందుకు సాగుతూనే

ఉన్నాడు. మళ్ళీ అతనికి సోహనీ పిలుస్తున్న కేక వినబడింది. అవును యిది ఆమె స్వరమే "మహీవాల్"! "మహీవాల్"! అన్న ప్రతిధ్వని వస్తోంది. అతను ఒళ్ళు తెలియని స్థితిలో చేతులు గబగబా కొడుతూ కాళ్ళతో నీరు గబగబా వెనక్కి త్రోస్తూ ఈదుతున్నాడు. అతనికి నదీతీరంలో సోహనీ వెక్కి వెక్కి ఏడుస్తున్న ట్లనిపించింది. ఇంతలో ఒక పల్లెవాడు అతణ్ణి చూశాడు. గబగబా తన పడవను నడుపుకుంటూ పోయి అతణ్ణి పడవలోకి ఎక్కించుకుని కాపాడాడు.

నిజంగా సోహనీ అతని ఎదుట నిలబడి ఉంది. ఆమె కళ్ళనుంచి జల జలా కన్నీళ్ళు రాలుతున్నాయి. అదిచూసి మహీవాల్ మాటి మాటికి తన కళ్ళు నలుపుకుని తదేకంగా చూస్తున్నాడు. నిజం ఈమె సోహనీయే. ఇది కలకాదు, కల్లాకాదు. వారు ఒకరినొకరు చూసుకుని ఆత్రంతో గబగబా దగ్గరకు చేరుకుని చేతులు చాపి కౌగలించుకున్నారు. సాయంకాలపు క్రీనీడలు చల్లని అంధకారంగా మారిపోయాయి.

ప్రతిరోజూ సాయంకాలం పశువులను వాటి వాటి యిళ్ళకు త్రోలివేసి ఝునా నదీతీరపు పచ్చిక బైళ్ళలో వారు కలుసుకుంటూ ఉండేవారు

మహీవాల్ ఎల్లాగో ఒక పెద్ద తోలుసంచి కొన్నాడు. రాత్రికాగానే అతను ఆ సంచిని గాలిలో నింపి దాని సహాయంతో ఈదుకుంటూ సోహనీ గ్రామ తీరానికి చేరుకునేవాడు. అక్కడ కూర్చుని తన ప్రియురాలు రాకకై నిరీక్షించేవాడు. గేలం వేసి చేపలను పట్టడం పిల్లనగ్రోవి వాయించడం అతనిపని. "ఓ సోహనియే"! నీ రాకకై పిల్లనగ్రోవి ఎదురుతెన్నులు చూస్తోంది. దానినుంచి వెలువడే రాగాలను విని కుప్పలు కుప్పలుగా చేపలు నా వలలో వచ్చిపడుతున్నాయి" అని మహీవాల్ అనేవాడు "ఓ మిత్రుడా"! నీవు ఒకే చేపను పట్టుకున్నావు. కాని కుప్ప తెప్పలుగా కాదు. అని సమాధానంగా సోహనీ నవ్వుతూ అనేది.

ప్రతి సాయంకాలం మహీవాల్ ఒక చేపను పట్టుకుని తన ప్రియురాలికై వేచి కూర్చునేవాడు. సోహనీ వచ్చేది; వారిరువురు ఆ చేపను కాల్చుకుని ఎంతో ఆనందంగా తినేవారు.

మహీవాల్‌తోబాటు కూర్చుని ఆ చేపను తినటంలో సోహనీకి అపరిమిత ఆనందం కలిగేది. అది తింటూ గుక్క తిప్పుకోకుండా ఎన్నెన్నో మాటలు

ఆమె చెపుతూ ఉండేది. వారికి తెలియకుండానే రాత్రంతా ఆమె మాటలతో గడచిపోయేది భళ్ళున తెల్లవారకముందే నెమ్మదిగా యింటికి చేరి తన మంచంపై ఏమీ ఎరుగనిదానివలె మౌనంగా పడుకునేది.

ఒకరోజు యమునా నదిలో తీవ్రంగా వరదవచ్చింది. అది వర్షాకాలం. నది పైభాగంలో బాగా వర్షాలు పడివుంటాయి. నది గట్లను తెగకోసుకుంటూ, పరవళ్ళు త్రొక్కుతూ ప్రవహిస్తోంది; పంటలన్నీ కొట్టుకుపోయాయి; నూతులు నిండిపోయాయి; అలాటి స్థితిలో మహీవాల్ ఎల్లాగో ప్రాణాలకు తెగించి నది అవతలి గట్టుకు చేరాడు. కాని ఆరోజు చేపను పట్టుకొనడమెలా? మహీవాల్ చాలాసేపటి వరకు అటూ ఇటూ పిచ్చిగా తిరిగాడు. ఎక్కడా అతనికి చేప దొరకలేదు. నీరంతా బురద బురదగా ఉంది. నది వరదతోబాటు ముళ్ళపొదలు, చెత్తా చెదారం కొట్టుకొని తెచ్చింది. ఎక్కడా ఒక్కచేపా దొరకలేదు. మైళ్ళ తరబడి గట్లు గండ్లు పడ్డాయి. గేలంవేసి చేపలను పట్టడమెలా? వేయడంకూడా సాధ్యపడదు? సోహనీ వచ్చే సమయం అయింది. పాపం, ప్రేయసిని ఒట్టి చేతులతో కలుసుకోవడం ఎలా అని అతను యోచిస్తున్నాడు. ఏదో ఆలోచన తట్టింది. అతని పెదవులపై చిరునవ్వు బిందులు త్రొక్కింది ఆ రోజున మహీవాల్ తాను యోచించినట్లుగా ఏమీ చేయలేకపోయాడు. అతని కోర్కెను తీర్చే సాధనం లేదని అతనికేమీ తెలీదు? సోహనీ సరియైన సమయానికి అక్కడికి వచ్చింది. ఆమెకు మాటి మాటికి మహీవాల్నుపరిహసించడమంటే సరదా. నేను ప్రస్తుతం అత్తవారింట రాత్రివేళ తిండి తినడమే మానివేశాను. మహీవాల్తో కూర్చుని తినని భోజనం నాకు ఎంతమాత్రం సహించదు: నేను లేకుండా నా ప్రియుడు మరొకచోట ఎలా భోజనం చేయగలడు? అని అంటూఉంటే ఆమె మాటలు విని మహీవాల్ నిలువునా నీరైపోయాడు. భూమి బ్రద్దలై తన పొట్టలో అతణ్ణి యిముడ్చుకుంటే ఎంత బాగుండేది అనుకున్నాడు మనసులో

మరుసటి రోజు కూడా వాన ఆగలేదు. పెనుగాలి వీస్తూనే ఉంది. కుండ పోతగా వర్షం పడుతోంది. నది బుసలుకొడుతూ పొంగి పరవళ్ళు తొక్కుతోంది; సురగలు కక్కుతోంది మహీవాల్ ఎన్నో ప్రయత్నాలు చేశాడు కాని ఆవేళ కూడా ఒక్కచేపకూడా చేతికి దొరకలేదు. అయ్యో, ఈ రోజు రాత్రి సోహనీ వస్తుంది. ఆమె ముందు అతను సిగ్గుపడవలసి వస్తుంది అనుకుని తన ప్రియు

రాలికి కావలసిన ఏర్పాట్లు చేసి వుంచాడు.

సరియైన సమయానికి సోహని గబ గబా నడుస్తూ నిరునవ్వులు వెదజల్లుటూ మహీవాల్ సమీపానికి వచ్చింది. ఆమెలో ప్రతిరోజు ఒక నూతన సౌందర్యం! ప్రతిరోజు ఒక నూతన ఆకర్షణ!! ప్రేమానుభూతిలో స్త్రీ ఒక గాలిపటంలా ఉంటుంది. అది పైపైనే ఎగురుతూ గగన వీధుల్ని స్పృశిస్తూ ఉంటుంది.

కొద్దిసేపయిన తరువాత ఆమె చేప ముక్కలను ఒక పొడుగాటి ముల్లుకు గ్రుచ్చి కాల్చడం ప్రారంభించింది.

"ఈవేళ నీవు పట్టిన చేప కాల్చడానికి కుదరడంలేదే"?

"అల్లానా!"

"అబ్బ! దీనిని కాల్చడానికి ఎంత సమయం పడుతుంది! ఇదేమిచేప ఖాబూ?"

"అవును!"

చిలుము త్రాగుతూ మహీవాల్ తన స్వప్నలోకంలో తనను తాను మరచి పోయాడు.

ఇద్దరువురు కాల్చిన చేపను తినడానికి కూర్చున్నారు. ఈవేళ ఏదో విచిత్ర సంఘటన జరుగుతుందని సోహనీకి గట్టి నమ్మకం కలిగింది. చేప రుచి అదోలా ఉంది. ఆమె పైకూపిరి పైనే, లోకూపిరి లోనే ఉండిపోయింది. మహీవాల్ కట్టుకున్న లుంగీ అంచు రక్తంతో తడిసి వుండడం చూసింది.

"ఈ రక్తం ఎలావచ్చింది?" సోహనీ ముందుకు జరిగి అతని లుంగీ అంచును చేతితో పట్టుకొని చూసింది

ఇంకేముంది! మహీవాల్ నోటవెంట మాట రాలేదు. ఆమె చేతుల్లో అతను కుప్పగా ఒరిగిపోయాడు

తన ప్రియురాలికై తన తొడ మాంసపు ముక్కలను కోసి ఆ రాత్రి ఆమెకు చేపకు బదులుగా ఉంచాడు క్రితంరాత్రి చేప దొరకలేదు. ఇవాళ రాత్రికూడా సోహనీని ఆకలితో ఎలా తిరిగి పంపగలడు? ఎన్నో రోజులనుంచి రాత్రివేళ మహీవాల్‌తప్ప మరెవ్వరితోను కలసి తినటమే లేదు.

మహీవాల్ ప్రేమ జగత్తులో ఉన్నత శిఖరాలను చేరుకున్నాడు సోహనీ. అతని పెదిమలు, అతని బుగ్గలు, అతని రెప్పలు, అతని లలాటాని అనేక

సార్లు ముద్దాడి అతనిని స్పృహలోనికి తెచ్చింది. ఎన్నో పర్యాయములు అతని పెదవులతో తన పెదవులను కలిపింది. వారిరువురు ఒకరి అధరామృతాన్ని మరొకరు తనివితీరా ఆస్వాదించారు. ఆరోజు రాత్రి సోహనీ ఒక దీప శిఖవలె మహీవాలు అవయవంలో వ్యాపించింది. ఆమె అతని రోమ రోమాన్ని అనురాగంతో ముంచెత్తింది; ప్రేమతో ఉర్రూతలూగించింది; తెల్లవారుతోంది; ఆమె వెళ్ళే సమయమైంది. అయినా ఆమె హృదయం మహీవాలుని విడిచిపెట్టి వెళ్ళడానికి ఎంతమాత్రం యిష్టపడ్డంలేదు.

చివరకు గత్యంతరం లేక ఆమె అక్కడినుంచి బయలుదేరి వెళ్ళింది. మరుసటిరోజు సాయంకాలం, ఆ తరువాతకూడా అతను సోహనీ గ్రామ తీరానికి రాకూడదని, ఆమెయే అతను ఉండే తీరానికి వస్తూ ఉంటుందని, గాయము మానే వరకు నీటిలో దిగవని ఈ ఉదయం పడవలోనే అవతల ఒడ్డుకి తిరిగి వెళతానని ఆమె మహీవాల్‌చేత వాగ్దానం చేయించింది. వారు ఇకనుండి అవతల ఒడ్డున మసీదుదగ్గిర కలుసుకునేందుకు నిశ్చయించుకున్నారు.

ఈ నిర్ణయాలు చేసుకోవడం ఎన్నో విషయాలు మాట్లాడుకొనడంలో ఆ వేళ సోహనీకి చాల ఆలశ్యమైంది. నెమ్మదిగా ఆమె తన యింటి వాకిట్లోకి చేరింది. ఎన్నోకళ్ళు ఆమెవైపు కోపతాపాలతో చూస్తున్నట్లు గమనించింది. అత్త ఆడబడుచు తమ తమ మంచాలపై పడుకుని కళ్ళు మూసుకొని నిద్రపోతున్నటు నటిస్తూ అంతా గమనిస్తున్నారు

మర్నాడు ఉదయము సోహనీకి తన ఆడబడుచు అత్తగారితో కొంత గొడవ జరిగింది. ఆమె కోమల శరీరం దానితో వాడి మాడినట్లయింది. అత్త ఆడబడుచుల మధ్య ఈర్ష్య, అసూయలు. ప్రజ్వరిల్లుచున్న చితివలె భగ భగ మండుతున్నాయి. ఆరోజంతా తన యింటి వాకిట్లో జరిగే గొడవలు చూస్తే సోహనీకి ఊపిరాడ్డంలేదు. ఆమెకు తన పరిసర ప్రదేశమంతా ఏదో దుర్వాసనతో నిండినట్లు తోచింది. యింటి లోపల, యింటి మూలల్లో నిలబడ్డవారు ఏదో గుస గుసలు, కుట్రలు పన్నుతున్నట్లుగా అనుమానం కలిగింది.

ఎట్లాగో రాత్రి అయింది. పరివారంలోని వారికి కొంచెంగా నిద్ర పడుతోంది. వాకిట్లో యింటివారు నిద్రపోతున్నారు. ఆ సమయమున సోహనీ తన మహీవాల్‌ను కలుసుకోవడానికి బయలుదేరింది. ఝునానది దాటేందుకు ఆమె వంట గదినుంచి ఒక కుండతీసికొని చంకలో పెట్టుకుంది.

సోహనీ నదివైపుకు బయలుదేరింది. నిద్రపోతున్నట్లుగా నటిస్తున్న దుష్టురాలు ఆమె ఆడపడుచు లేచి నెమ్మదిగా సోహనీని వెన్నంటింది. అత్తగారు తన మంచంపైనుంచి లేవకుండానే మనస్సులో ఏవగింపుని పెంచుకుంటోంది.

తనయింటినుండి బయలుదేరి సోహనీ గబ గబా ఝునానదీ తీరానికి చేరుకుంది. ఆరోజు నది శాంతంగా ఉంది. వరద వచ్చినట్లే లేదు. సోహనీ ముందు వెనుకలు చూడకుండా తన ప్రియుణ్ణి కలుసుకొనే ఆతృతతో నదిలో దిగి ఈదడం ప్రారంభించింది. ఆమె ఆడబడుచు నిరాశతో నిలువునా నీరుకారుతూ ఒడ్డున నిలబడిపోయింది. ఆమె చూస్తూ ఉండగనే సోహనీ మటుమాయమైంది.

రాత్రంతా సోహనీ ఆడబడుచు నదీ తీరంలో కూర్చుని రకరకాల ఆలోచనలు చేస్తూ ఉంది. మధ్య మధ్య కోపంతో దంతాలను పట పటా కొరుక్కుంది. తెల్లవారుతుండగా నదిలో సోహనీ కుండ సహాయముతో ఈదుతూ వస్తూ ఉండడం ఆమె చూసింది

దొంగ దొంగతనం చేస్తూ ఉండగా పట్టుకోవాలని ఆడబడుచు ఎంతగానో వాంఛించింది. కాని అలా చేయలేకపోయింది. ఒక దట్టమైన మర్రిచెట్టుక్రింద నిలబడిమాత్రం చూస్తూఉండిపోయింది.

సోహనీ నదినుంచి ఒడ్డుకు చేరింది. బట్టలను పిండుకుంది. ఆహా! ఎంతటి సాహసవంతమైన యువతి! వెన్నెలలో ఆమె సౌందర్యం కళ్ళకు మిరిమిట్లు గొలుపుతూ ఉంది. ఆడబడుచు గుడ్లప్పగించి సోహనీవైపు చూస్తూ ఉంది. సోహనీ తన కుండను ఒక పొదలోదాచి యింటివైపు మరలింది. తెల్లవారకముందే యింటికి వెళ్ళి ఆమె తన మంచంపై వాలిపోయింది. ఎండాకాలపు రోజులవి. ఆమె బట్టలు దారిలోనే ఎండిపోయాయి.

ఆడబడుచు తల్లికి తాను చూసినదంతా పూసగ్రుచ్చినట్లు చెప్పింది. అసూయతో ఆడపడుచు మండిపోయింది. మనస్సులో ఆమె సోహనీకంటె చాల పెద్దది. అయినా. యింతవరకు ఆమెకు వరుడు లభించలేదు. కాని సోహనీ వివాహమైన తర్వాత కూడా తన భర్తను విడచి తన ప్రియునితో ప్రేమ సల్లాపాలు సలుపుతూ ఉండడం ఆమెను పూర్తిగా దహించివేసింది.

చివరికి తల్లీ కూతుళ్ళు తన కుమారుణ్ణి నిలువుగా మోసగిస్తున్న కోడల్ని నిండు ప్రాణాలతో అంతం చేయాలని నిర్ణయించుకున్నారు. ఆడపడుచు దగ్గరగా

వున్న ఒక పచ్చికుండను తీసుకొని వెళ్ళి ఝునానదీతీరపు పొదల్లో సోహనీ దాచిన గట్టికుండ తీసివేసి తాను తెచ్చిన కుండను అక్కడ పెట్టింది.

మరుసటిరోజు రాత్రి సోహనీ తన నిర్ణీత సమయానికి లేచి బయటకు బయలుదేరింది. ఆమె సరాసరి నదీతీరానికి చేరింది. పొదనుంచి కుండ తీసికొని నదిలో దిగింది.

అది నిండు పూర్ణిమనాటి రాత్రి. ఆరోజు మళ్ళీ నది పొంగుతూ ఉంది. మహీవాల్‌ను కలుసుకోవాలనే ఉత్సాహంతో సోహనీ ఆనదీ తరంగాలపై తేలి యాడుతూ ముందుకు ఈదుకు పోతోంది. ఆమె కొంచెం దూరం వెళ్ళింది. ఇంతలో చేతులక్రింద ఉన్న కుండ కరిగిపోతున్నట్లు గమనించింది. అది నిజానికి పచ్చికుండ. అంతా బురద బురద అయిపోయింది. సోహనీ నది మధ్యకు చేరుకుంది.

ఎదుట నది ఒడ్డున శివమందిరం ఉంది. అక్కడ కూర్చున్న మహీవాల్ సోహనీ రాకకై ఎదురు చూస్తున్నాడు. ఆమె "మహీవాల్, మహీవాల్" అని కేకలు వేయసాగింది. నది తుఫాను వేగంతో పరవళ్ళు త్రొక్కుతోంది. దాన్ని నిజమైన తుఫాను అనే అనాలి. నీటి కెరటాలు సోహనీని ముంచెత్తుతున్నాయి. ఆమె పదేపదే మహీవాలుని పిలుస్తూ ఉంది. కెరటాలలో ఆమె మునిగి తేలుతూ ఉంది. ఆమె మహీవాలుని పిలిచినప్పుడల్లా వెనుక ఒడ్డుపై నిలబడి ఉన్న ఆడబడుచు పకపక విరగబడి నవ్వుతోంది. తుఫాను రాత్రిలో ఆమె వికటాట్టహాసపు నవ్వులు భూతాల అరుపుల్లా ప్రతిధ్వనిస్తున్నాయి.

మహీవాల్ సోహనీ అరుపులు విన్నాడు. తన చేతిబెత్తం సహాయంతో మందిరం బయటకు వచ్చాడు ఆహా! ఎంతటి నిండు యౌవ్వనపు సౌందర్యం అతనిది. సోహనీ పిలుపు మళ్ళీ వినబడగానే అతను వెనుక ముందు ఆలోచించకుండానే ఉన్న పళంగా గాయపడిన కాలునికూడా లెక్క చేయక నదిలో ఉరికాడు.

మహీవాల్ నదిలో దూకగానే విసురుగా ఒక పెద్ద తుఫాను కెరటం వచ్చింది. జలప్రవాహంలో వారిరువురు ఒకరి కౌగిటిలో మరొకరు ఇమిడిపోయారు. రెండు మూడు క్షణాలు వారలా వుండడం ఆడబడుచు చూసింది. ఇక ఉత్తుంగ తరంగాలు వారిరువురిని తమలో దాచుకున్నాయి. ఆ తరువాత మళ్ళీ వారు ఎక్కడా కనబడ లేదు. ఇక ఈ ప్రపంచంలో సోహనీ లేదు. మహీవాల్ లేడు. వారు ఒకరి నొకరు గట్టిగా కరుచుకుని ఝునానదీ జలంలో లీనమై పోయారు. అవతలి ఒడ్డున నిలబడి వున్న ఆడబడుచు నిశ్చేష్టురాలై తదేకంగా చూస్తూ ఉండిపోయింది

# పూరనభగత్

—శివకుమార్

ఇది పంజాబులోని సియాల్‌కోటకు సంబంధించిన విషయం. ఒకానొకప్పుడు ఆక్కడ సలవాన్ అనే రాజు పరిపాలన చేస్తూ ఉండేవాడు. అతనిపట్టపు రాణి ఇచ్ఛారా. ఆమెకు ఒక పుత్రుడు జన్మించాడు. అంతటితో తన కోర్కెలన్నీ కడతేరినట్లుగా రాజు తలంచాడు. అతను తన కుమారుడికి పూరన్ అని నామకరణం చేశాడు.

అప్పట్లో సిద్ధయోగుల ప్రభావం పంజాబులో అత్యధికంగా యుండేది. సిద్ధులు స్త్రీజాతిని ఎంతో హీనంగా చూసేవారు. పురుషులను స్త్రీల ప్రభావంనుంచి దూరంగా వుంచేవారు. వారి దృష్టిలో వివాహమంటే అర్థం గుల్లకర్రకు పురుగు పట్టినట్లు తలచడమే కాక కుటుంబము, మాయా మమతల బంధనాలు పురుషుని వికాసానికి హానికరంగా భావించబడేవి. సలవాన్ రాజుకు సిద్ధులంటే అపరిమితమైన భక్తి కాబట్టి పూరన్ పుట్టిన వెంటనే అతణ్ణి పన్నెండేళ్ళ వయస్సు వరకు కుటుంబానికి దూరంగా ఉంచాలని నిశ్చయించాడు. అతన్ని కఠోరమైన నిగ్రహ నియమాలతో పెంచాలని తద్వారా బాల్యం నుంచి అతను చక్కగా మనోవికాసం చెందగలడని నిర్ణయించ బడింది. ఈ నిర్ణయం అత్యంత కఠినంగా అయినా తన కుమారుని మేలుకై రాజు తన హృదయాన్ని పాషాణంగా మార్చుకుని అందుకు అంగీకరించాడు.

"పూరన్ ఇక్ హనేరియా బాహర్ ఆయా,
దూజీ కోఠరీ దే విచ్చ పా దిత్తా
కాదర్ యార్ మోయాఁ పూరన్ భగత్ తాయిఁ,
బాప్ జమ్మదియాఁ కైద్ కరా దిత్తా!"

[పూరన్ ఒక అంధకార బంధురమైన మాతృగర్భం అనే కొఠారం నుంచి బయటకు వచ్చాడు. మళ్ళీ అతన్ని మరియొక కటిక చీకటితో భూగర్భపు జైలులో

పడవేశారు. అంటే అతని తండ్రి పూరన్ పుట్టిన వెంటనే కారాగార వాసుణ్ణి చేశాడు.]

సిద్ధయోగులు చెప్పిన దానిని బట్టి ఈ నిర్ణయం సరియైనదే కావచ్చు. కాని యోగుల సాధన ప్రకృతి నియమాలను ఉల్లంఘిస్తున్నది. తల్లీ కుమారుడు ఒకరికొకరు దూరమయారు. ఈ విధముగా స్త్రీ, పురుషులుగా తప్ప వారి మధ్య మరే సంబంధము మిగులలేదు. మనం మనస్సునుంచి ఏ విషయాన్ని తొలగించి దూరంగా ఉంచాలనుకుంటామో ఆ వైపు మన మనస్సు ఎక్కువగా ఆకర్షింప బడుతూ వుంటుంది. సలవాన్ రాజు తన కుమారుణ్ణి తల్లినుంచి వేరుచేయ గలిగాడు. కాని, అతను మాత్రం ఆవృద్ధాప్యంలో మరొక వివాహం చేసి కొన్నాడు. రెండవ భార్య నిండు యౌవ్వనవతి. రాజు సహజంగా తన నూతన భార్య ప్రభావంలో పడిపోయాడు. అతను ఆమె చేతిలో ఒక కీలు బొమ్మగా తయారయ్యాడు.

"జోమ్ జాయే రాజే సలవాన్ ఆండీ,
ఇక్ స్త్రీ హోర్ విఆహ కే జో,
ఓహదీ జాత్ చమియారో లేనా(లూణా(,
ఘర్ ఆయీ సో ఠఃన్ మనాకే జో,"

[రాజు సలవాస్ మరొక స్త్రీని వివాహమాడి అంతఃపురానికి తీసుకొని వచ్చాడు. కులానికి ఆమె మాదిగ స్త్రీ. ఆమెపేరు లూణా. పూర్తి అధికారాలు పొందిన పిమ్మటనే ఆమె రాజభవనంలో ప్రవేశించింది ]

పూరన్ భూగర్భ బందిఖానాలో పెరుగుతూ వున్నాడు. సలవాన్ రాజు నూతన వధువుతో భోగ విలాసాలలో రాత్రింబవళ్ళు మునిగి తేలుతున్నాడు. ఇక తండ్రీ కొడుకులమధ్య ప్రేమ సంబంధంగాని, గౌరవ భావంగాని లేదు. ఇరువురి మధ్య అగాధమైన అఖాదం ఏర్పడించి. ఇరువురు ఒకరికొకరు అపరిచితులు. వారిద్దరి అభిరుచులు విభిన్నమైనవి.

పన్నెండు సంవత్సరాల తరువాత పూరన్ భూగర్భ కారాగారంనుంచి బయటకు వచ్చాడు. ప్రథమంగా అతను తండ్రి దర్బారుకు వెళ్ళి తండ్రికి నమస్కరించాడు. దీర్ఘకాలం తర్వాత తండ్రీ కొడుకులు కలసికొన్నారు. ఇరువురూ

తమ తమ వ్యక్తిత్వాన్ని ఒకరికొకరు చక్కగా అవగాహన చేసుకొన గలిగారు. నూతన రాణీతో భోగ విలాసంలో మునిగి తేలుతున్న రాజు "నా కుమారునికి వివాహం తక్షణం ఇదేరోజున జరిగి తీరాలి" అని ఆదేశించాడు. కాని సత్యం, ధర్మంగా జీవితాదర్శంగాగల పూరన్ తండ్రితో "వివాహమనే సంకెళ్ళు వేసి నన్ను భగవంతునికి దూరం చేయవద్దు" అన్నాడు. భక్తులు, సాంసారిక మానవులు కలసి వుండడం కష్టం. రెండు జీవితాల విభిన్న భావాలు ఒకటి మరొక దానితో సంఘర్షణ పడ్డాయి.

"దాఖ్ దసదా పుచ్ఛదా లాగియాఁ నూఁ,
సలవాన్ రాజా ఉఠ్ఠే గజ్జ్ కే జో
పూరన్ భగత్ దా ఘూంఘణా ధాఁ ఓఁ కోయా
జిథ్థే చల్ దుకాఁ దిస్ అజ్జ్ దే జో,
జాల్ జరా నా సఁగదా బాప్ క్రోలోఁ,
కేహూదా బాబలా పుత్త్ విలహ నాహీఁ
జే హుదే శౌక్ లయీ తాఁక్ బ్యాహ కర్‌దే,
అజే ఓహ్ మేరేమన్ దా నాహీఁ,
మేరా ఛౌర్ సైలానీ హై నిత్త్ రైఁ హుదా,
బన్న బాబలా దేడియాఁ పా నాహీ,
కాదర్ యార్ ఆఖే పూరన్ బాప్ తాయీ
మైథ్థో రబ్బదా నాఁ భులా నాహీఁ"

[ఈరోజు పూరన్‌కి వివాహం జరిపే స్థలం త్వరగా సంసిద్ధం చేయండి అన్నాడు సలవాన్ రాజు గట్టిగా. పూరన్ జంకు విడిచి వివాహం నిరాకరించాడు. ఏ కోరికలు నెరవేరేందుకు వివాహం జరుగుతుందో అవి నాలో ఇంకా అంకురించ లేదు. నా మనసుకి సుస్థిరత లభించనందువల్ల. నా పాదాలకి సంకెళ్ళు వేయవద్దు. ఈశ్వరునికి నన్ను దూరం చేయవద్దు అన్నాడు పూరన్.]

రాజ దర్బారులో రాజైన సలవాన్‌కు భక్తుడైన పూరన్‌కు మధ్య ఎంత మాత్రం పొంతన కుదరలేదు. ఇరువురి మధ్య జటిల సమస్య ఎదురైంది. ఎప్పుడూ రాజు తన ఆజ్ఞను ఉల్లంఘించటమనేది వినేందుకు అలవాటు పడియుండ లేదు. ఒకసారి రాజు తన కుమారునికి విరుద్ధంగా ఆజ్ఞ జారీ చేస్తాడని మంత్రి

కంగారుపడి రాజకుమారుని అమాయకత్వాన్ని గూర్చి రాజుకి ఎన్నో విధాల నచ్చ జెప్పి శాంతింప చేశాడు. రాజు కొంతమంది నౌకర్లను పూరన్‌వెంట పంపుతూ అతను వెళ్ళి తన తల్లుల పాదాలకు ప్రణమిల్లాలని ఆదేశించాడు. యోగవిద్యలో ప్రవీణుడైన పూరన్‌కు రాజ దర్బారులో అమలుజరిగే శాసనాలు తెలియవు. అంతే కాదు; అతనికి అంతఃపుర భోగ విలాసాలంటే అసలే తెలియవు. అందరికంటె మొదటి భవనం సవతితల్లి లూణా నివసించేది. ఆమెకు జీవితంలో భోగ విలాసాలు తప్ప గృహస్థ జీవితముతో పరిచయం లేదు. ఇంతకాలంగా ఆమెకు సంతానం కలగలేదు. భర్త ప్రేమతప్ప ప్రపంచంలో ఆమె మరేమీ చవిచూడ లేదు. పతి తప్ప మరేపురుషుడూ ఎన్నడూ ఆమె భవనంలో అడుగుపెట్టి ఎరు గడు. ఆమె దృష్టిలో బహుశా పురుషులంతా ఒకటే. ఆమె పెద్దగా చదువు సంధ్యలున్న స్త్రీకూడా కాదు. ధార్మిక విద్యయంటే ఎంతమాత్రం ఆమెకు తెలియదు.

హఠాత్తుగా రాజకుమారుని రాక చూసి ఆమె నివ్వెరపోయింది. పూరన్ ఆమెను 'తల్లీ'యని సంబోధించి పిలిచాడు. ఆమెకు ఒక్కసారిగా ఒళ్ళు జల్లు మంది. ఆమె యింతవరకు మాతృమూర్తి కాలేదు. సవతి కుమారుణ్ణి తన కుమారునిగా ఎలా భావిస్తుంది! పూరన్ నోటినుంచి తనను తల్లి అన్న శబ్దం ఎంతో కటువుగా వినిపించింది. అతను తనను పరిహాసం చేస్తున్నట్లు భావించింది.

లూణా రాజుపై కూడా పెత్తనం చెలాయించేందుకు అలవాటు పడింది; ఆమె తన హృదయంలో యిలా భావించింది!

> "జోయే జాహరా ఆఖదో శర్మ కేహో,
> మాయీ మాయీ నా రాజియా ఆఖ్ మైనూం
> కువటోం రఖ్ నా జమియో జాయియోంవే,
> మాయీ ఆఖదా ఏ కేహదే సాక్ మైనూం."

పూరన్ నోటితో తనని 'అమ్మా' అన్న పిలుపు విని "నన్ను ఏ సంబం ధంగా తల్లినంటున్నావు నేను నీకు జన్మనివ్వలేదు" అన్నది లూణా.

పూరన్, లూణా ఇరువురూ భిన్న భిన్న భావాలను వ్యక్తపర్చారు. ఒకరికి జీవితపు ఆద్యంతాలు భోగవిలాసాలైతే మరొకరికి జీవన పర్యంతమూ యోగ సాధనయే జీవితపు ఏకైకలక్ష్యం యోగసాధన. ఇరువురు కూడా ఒకరు సత్యమని

నమ్మిన దానిని మరొకరు అర్థంచేసుకోవటంలో అసమర్థులు. నిజానికి ఇరువురూ రాజగృహపు నివాసులే అయినా పూరన్, లూణాల ఇరువురి జీవిత విధానాలు వేరై నవి. వారిరువురి జీవిత విధానాలూ సమానాంతరములగుటచే పరస్పరం అపరిచితుల వలె వ్యవహరించారు. అంతట పూరన్ ఇలా అన్నాడు!

'నీవు వివాహమాడిన వ్యక్తి నా తండ్రి కావటంవల్ల, నువ్వు నా తల్లి వయావు' అని సమాధానమిచ్చాడు పూరన్.

"జిస్‌దీ ప్రీతూ ఓహ హై బాప్ మేరా
తేరే శికమ్ హో జామియాం జాన్ మాయే "

లూణా పూరన్ మాటలు విని గగుర్పాటు చెందింది. ఒకవైపు పూరన్ విషప్రాయంగా తోస్తున్నా మరోవైపు ప్రాణ ప్రియునిగా, మనో నాయకునిగా కన బడుతున్నాడు. ఆమె అతణ్ణి ఏవిధంగానైనా తనవాణ్ణి చేసుకోవాలని చూస్తోంది. ఒకవేళ ఆ అవకాశం లభించకపోతే అతని జీవితాన్ని సమాప్తం చెయ్యాలని దృఢంగా నిశ్చయించుకుంది. లూణా ఒక సమయంలో తన ప్రేమను, తన ద్వేషాన్ని ప్రకటిస్తూనాయిలా అంది:

"కాఫ్ కత్ల కరా ఉంగే పూరణా వే,
ఆఖే లగ్ జాజే ఫలా చాహూంనావీం
రొూలీ అడ్డకే ఖకీ మైం పాస్‌తేరే
హైసి యాంరియా ఖైర్ నా పాఉ నా ఐం."

పూరన్ తన జీవితాన్ని కాపాడుకోవాలంటే ఆమె కోర్కె ననుసరించి నడ వాలి. లేదా జీవితంపై ఆశ వదలుకోవాలి అని లూణా పూరన్‌తో స్పష్టంగా చెప్పింది. కాని పూరన్‌కు ఐహిక సుఖాలకంటే ధర్మమంటే ఎక్కువ ప్రేమ. అతను ధర్మానుసారంగా జీవించాలనుకొంటున్నాడు. కాని పథభ్రష్ట జీవితం గడప దలచుకోలేదు:

"ఆంఖోం పరలకే నజర్ న పూర్ కర్ సాం,
ఐపర్ సూలో దేపథన్ క బూల్ టిల్ సాం
రిన్నీ భిప్పతే బందరాం బాహర్ ఆయూం
ఆఖే ధర్మ గవాయే కే నాహ మీంసాం."

జీవితాంతమూ ఎవరైతే ధర్మంకొరకు చావునకైనా వెనుకాడడో అతనే

దూర దృష్టిగల పురుషుడు. ధర్మ మార్గంలో ఒకవేళ మృత్యువు సంభవిస్తే అతణ్ణి డాంబికుడని ధార్మిక గర్విష్టియని తలచాలి. పేరన్ ఏ భవనంనుంచి ప్రతికూల సమాధానం లూణాకి యిచ్చి బయటకు వచ్చాడో అదే భవనంనుంచి అతనికి మరణ శిక్షకు ఆదేశం యివ్వబడింది. లూణాను అక్కడ విడచి పూరన్ ఐశ్వర్యములతో తులతూగే భవనంనుంచి తిరిగి వచ్చాడు. రాజుకు అత్యంత ప్రియురాలైన లూణా తన శృంగార పరికరములైన ఆభరణాదులను చిందర వందరగా తీసి పారవేసింది. మాసిన బట్టలు ధరించింది; రాత్రికాగానే విలాస ప్రియుడైన రాజు లూణా భవనానికి విచ్చేశాడు. రాజు అంతఃపురంలో విచిత్రమైన ఆ వాతావరణం చూసి ఆశ్చర్య చకితుడయ్యాడు. దీపాలకాంతి లేదు. లూణా చీకటి గదిలో పడుకొని వుంది. ఆమె ఆభరణాలు, విలువైన వస్త్రములు చిందర వందరగా పడివున్నాయి. రాజు రాణీని "ఏమయింది? ఈ విధంగా వున్నందుకు కారణమేమిటి?" యని అడిగాడు. దాంతో ఆమె వెక్కి వెక్కి ఏడుస్తూ రాజుకి తన పగిలిన గాజులు, చినిగిపోయిన రవికె చూపించింది. పూరన్ పేరుపెట్టి ఏదో చెప్పడం ప్రారంభించిందో లేదో రాజు మండిపడ్డాడు. రాజ దర్బారులో రాజునకు కూడ తన కుమారుని సంభాషణ నచ్చలేదు. రాజభవనంలోనే కాదు, రాజు మనసులో కూడా చీకటి అలముకొంది. ఇంటా బయటా ఎక్కడా అతనికి వెలుతురు కానరాలేదు తక్షణం అతను తలారులకు కబురంపించాడు. చీకటి భవనంలో కూర్చునే అతను కుమారునికి మరణదండన విధించమని ఆదేశించాడు. ఐశ్వర్యం కఠోర హృదయాలకు మధ్య ఏదో అవినాభావ సంబంధముంది. రాజు పుత్రుని వధించి తన ఐశ్వర్య సాధన సామగ్రిని కాపాడుకోదలిచాడు.

ప్రాతఃకాలం రక్త రంజితమైన సూర్యునకు అర్ఘ్యమిస్తున్న రాజు పురోహితుని చేయి కూడా వణకసాగింది బజారు మూసివేశారు. ప్రజలు తమ తలుపులను కిటికీలను మూసుకున్నారు. పూరన్ శూన్యంగా వున్న వీధులు, బజార్లగుండా మృత్యువునకు ఎదురుగా సాగిపోతున్నాడు. అతనికి ముందు నిశ్శబ్దంగా, సిర్జీవంగా పూరన్, అతని వెనుక భయకంపితులైన వధకులు వారి వెనుక పాదరక్షలు లేని కాళ్ళతో నెత్తిపై గుడ్డ లేకుండా విలపిస్తూ తల్లి ఇచ్ఛారా నడుస్తోంది. పట్టణమంతా నిశ్శబ్దంలో నిద్ర పోతోంది. ఏవిధమైన శబ్దం ఎక్కడా వినపడ్డంలేదు. రాజ శాసనం ఎవరిని పల్లెత్తుమాట అనకూడదని శాసించింది.

పూరన్‌ను గిల గిల కొట్టుకునేటట్లు చంపమని రాజాజ్ఞ. అతని చేతులు నరికివేయ బడాలి; అతణ్ణి ఒక నూతిలో వ్రేలాడవేయాలి; పూరన్‌కు విధించిన శిక్ష చూసి తక్కినవారికి గుణపాఠం కావాలి; అతనిని చూసి జాలిపడేవారు వెక్కి వెక్కి ఏడుస్తూ చావాలి. రాజు కేవలం శిక్ష విధించుటయే గాక తద్వారా మనో రంజనం కూడా పొందేవాడు. అపరాధికి ఎంత కఠినశిక్ష విధిస్తే రాజు అంతగా ప్రసన్నచిత్తుడయ్యేవాడు. వధకులు వచ్చి రాజుతో ఆయన ఆజ్ఞను అక్షరాలా పాటించామని, పూరన్ కాళ్ళు, చేతులు నరికి వేశామని, అతణ్ణి ఒక నిర్జన ప్రదేశ మందున్న పాడుపడిన నూతిలో వ్రేలాడదీశామని చెప్పారు. ఇది వినడమే తడ వుగా పట్టణ ప్రజలంతా ఆర్తనాదం చేశారు. కాని ఎవ్వరూ అతని జీవితాన్ని రక్షించలేరు. బహుశ అందుచేతనే ఎవ్వడూ కాళ్ళు, చేతులు నరుకబడిన రాకుమారుడు గిల గిల కొట్టుకొని విలపించడం చూడడానికై వెళ్ళలేదు. అంతా పూరన్ దురదృష్టం. మొదటి తల్లి గర్భం తరువాత తండ్రి విధించిన అంధకార బంధురమైన భూ సొరంగ కారాగారవాసం. ఇక యిప్పుడు సవతి తల్లి కృపా ఫలితం చీకటినుయ్యి. ఒక చీకటి తరువాత మరొక చీకటి; అనంతరం మళ్ళా మూడో చీకటి కొంతారం. మూడవ అంధకారం అతని హృదయ జ్యోతిని మరీ ప్రజ్వలితం చేసింది.

కొంతకాలం గడచింది కొంతమంది సిద్ధయోగులు తమ యాత్రా మజి లీగా ఆ పాడుపడిన నూతి దగ్గర బసచేశారు. సంవత్సరాల తరబడి వాడకుండా దుర్గంధ పూరితమైన నూతిలో నీళ్ళకొరకు ఆయోగులు చేదవేశారు. నూతినుంచి మనుష్యునివలె మాట్లాడినట్లు ధ్వనులు వినపడ్డాయి. ఇంతకాలం తర్వాత ఎవ్వరో నన్ను జ్ఞాపకం చేసుకోవడం ఒక విధంగా మంచిపనే జరిగినట్లయిందనుకున్నాడు పూరన్. మొదట ఆ యోగులు ఆ ధ్వనులకు భయభ్రాంతులయ్యారు. అది నుయ్యికాదు. భూతముల నివాసమని వారికి తోచింది. వారి గురువు గోరకనాథ్. ఆయనకు ఈ విషయం తెలిసి నూతి దగ్గరకు వెళ్ళి శ్రద్ధగా పరిశీలించి చూశాడు. నూతిలో ఏ దెయ్యమూ లేదు; భూతమూ లేదు. ఒక మనిషి వ్రేలాడుతున్నాడు. గురువుగారి ఆదేశానుసారము శిష్యులైన ఆ యోగులు నూతిలో వ్రేలాడుతున్న ఆ వ్యక్తిని బయటకు తీశారు. గోరక్‌నాథ్ దృష్టి అతనిపై పడగానే పూరన్‌కు కాళ్ళు చేతులు యథాతథంగా అతుక్కున్నాయి. ఎంతటి విచిత్రం! గురువు

యొక్క కృపచేత కాళ్ళూ, చేతులు తిరిగివచ్చాయా? లేక వధకులే రాజాజ్ఞను సరిగా పాలించలేదా? పూరన్‌కు చేతులే కాదు అతని సర్వాంగములు వికలమై యున్నట్లయింది. అతనికి నిలవవున్న దుర్గంధపూరిత జలంవలె తన శరీర శక్తి యంతా వుడిగినట్లనిపించింది. తన శరీరాన్ని అతను ఎన్నడూ ఏపనిలో నిమగ్నం చేయలేదు. నూతినుండి వెలువడి పూరన్ గురు గోరక్‌నాథ్ పాదాలపై పడి తన కుపదేశమిమ్మని అర్థించాడు.

గురు గోరక్‌నాథ్ ఎంతో కష్టంమీదగానీ ఉపదేశమిచ్చేవాడు కాదు. మొదటి శిష్యుణ్ణి కఠినంగా పరీక్షించేవాడు, కాని పూరన్ కఠిన పరీక్షలో ఉత్తీర్ణుడయ్యాడు. తల్లిదండ్రులు, ప్రపంచ మాయామమతలు అతని దృష్టిలో ఎన్నడో మరణించాయి. అది గమనించి గోరక్‌నాథ్ అతనికి ఉపదేశమిచ్చాడు. పూరన్ చెవులకు రంధ్రాలు పొడిపించి యోగి చిహ్నంగా రాగిపోగులు తగిలించారు. అయినా, ఇంకా ఒక అగ్నిపరీక్ష మిగిలివుంది. కాముకురాలైన స్త్రీ బారినుంచి పూరన్ రక్షింపబడ్డాడు. ఇక ప్రియురాలి ప్రేమ బంధనాలనుంచి బయట పడవలసి వుంది.

మరుసటిరోజున పూరన్ భుజానికి జోలి తగిలించుకొని భిక్షకై సమీప పట్ట ణానికి బయలుదేరాడు. అది అతని తండ్రి నివసించే పట్టణం. ఆ పట్టణము లోకి వెళ్ళడానికి అన్నిమార్గాలు పూరన్‌కై నిషేధింపబడి వున్నాయి. అతడు తండ్రి పట్టణమునకు వెళ్ళేబదులు మరో అపరిచిత పట్టణమునకు వెళ్ళటం మంచి దని భావించాడు. మరోవైపు రాణి సుందరాం యొక్క రాజధాని నగర ముంది. అక్కడ రాజ్య కార్యకలాపాలన్నీ స్త్రీలే నిర్వర్తిస్తారు. పూరన్ మొదటనే స్త్రీ ప్రభావానికి గురి అయ్యాడు. అయినా భిక్ష అడిగి తీసుకొని పోవాలి. స్త్రీ నిజానికి యోగికి అగ్నిపరీక్షవంటిది.

రాణి సుందరాం అనుపమ సౌందర్యవతి. నిండు జవ్వని. కాని ఆమెకు తన సౌందర్య యౌవ్వనాలకంటె తన సత్యమార్గంపై ఎక్కువ అభిమానం. పూరన్ రాణి సుందరా రాజద్వారంవద్దకు వెళ్ళి 'భిక్షాందేహి' అన్నాడు. సుందరాం పూరన్ యిరువురికి పరీక్షా సమయం ఆసన్నమైంది. దాసీలు భిక్షపెట్టేందుకు వచ్చి వారు పూరన్ సౌందర్యాన్ని చూసి విస్తుపోయారు. వారు ఆశ్చర్యంతో వెనుకకు మరలి రాణీతో "అటువంటి మన్మథ రూపసియైన యోగికి భిక్ష తమ చేతులతోనే ఇవ్వాలి" అని అన్నారు. బహుశా కఠిన నిగ్రహంతో ఉంటూ రాణీయొక్క

దాసీలు కూడా విసిగి-వేసారి వుంటారు. తన దాసీలుకూడా తన ధర్మాన్ని పరీక్షించ చూస్తున్నారని రాణీ తలచింది. ఆమె అంతఃపుర పైభాగంనుండి క్రింద నిలబడి వున్న యోగిని చూసింది. ఆమె కళ్ళు కాంతివంతమైనాయి. ఆమె వజ్ర, వైఢూర్యాలు నింపిన పళ్ళెం తీసుకొని స్వయంగా సింహద్వారం దగ్గిరకు వచ్చింది యోగి పూరన్ రాణీవైపు కన్నెత్తైనా చూడలేదు. అంతేకాదు, వజ్ర వైఢూర్యాలు నింపిన పళ్ళాన్నికూడా అతను చూడలేదు. రాణీ అతని జోలిలో వేసిన దానిని తీసికొని అతను గురువుగారి బసకు చేరాడు. గురువు ఆ రత్నాల భిక్ష చూసి యిలా అన్నాడు:

"నూన్ నహీ ఎహ దౌలతాఁ కమ్మ సాడే,
గురాఁ ఆఖియా మోడ్ కే అ పూతా,
ఎహ వైణ్ ఫకీరాఁ దా కమ్మ నాహీఁ,
పక్కా భోజన్ జా మంగ్లియా పూతా."

పూరన్ మొదటి పరీక్షలో నెగ్గాడు. గురువు అతణ్ణి మళ్ళీ రెండవ పర్యాయం అదే పరీక్షకి గురిచేశాడు. పూరన్ రెండవ పర్యాయం భిక్షకై రాణీ దగ్గిరకు వచ్చాడు. దాంతో సుందరాఁ బహుశా అతనిపై తన సౌందర్య, ఐశ్వర్యముల ప్రభావం పడివుండవచ్చునని తలచింది. ఇక అతనిపై పూర్తి విజయాన్ని సాధించాలనుకుంది పూరన్ వండిన భోజనము కావాలని కోరాడు, రాణి రకరకముల పిండివంటలు తయారు చేయించింది, తన దాసీలను వెంట పెట్టుకొని పూరన్‌తో బాటు అతని గురువుకి ప్రణమిల్లి రావచ్చునని బయలుదేరింది. మార్గంలో సుందరాఁ దృష్టి అంతా పూరన్ నిండు యౌవ్వనంపైనే కేంద్రీకృతమై వుంది పూరన్ నడుస్తున్నప్పటికి అచంచల సమాధి స్థితిలో తన్మయుడై వున్నాడు.

గురువు వున్న కొండపైకి చేరి సుందరాఁ సిద్ధులందరికి భోజనం పెట్టింది. కఠిన సంఘర్షమయ జీవితం గడిపే ఆ యోగులకు ఎన్నో సంవత్సరముల తర్వాత యింతటి రుచికరమైన భోజనం తనివితీరా లభించింది. మనసారా వారు భోజనం చేశారు. సుందరాఁ చూపిన ఆదరానికి, సేవాభావానికి ప్రసన్న చిత్తుడై గోరక్‌నాథ్ "రాణీ, నీవు చూపిన ఆదరానికి నేనెంతో ఆనందిస్తున్నాను. కావున నీవు ఏదైనా కోరదలచినచో కోరుకో" అన్నాడు. రాణి తన హృదయంలో రేకెత్తే తుఫానును అణచుకుంటూ "గురువర్యా, నాకు భగవంతునివల్ల ఏమీ లోపంలేదు,

సర్వ భోగ భాగ్యాలు ఉన్నాయి. ఇక ఏ వస్తువూ నాకు అవసరంలేదు." అన్నది. అంతట గోరక్‌నాథ్ సర్వ భోగభాగ్యాలు లభించినప్పటికీ ఏదో ఒక కోర్కె మిగిలి ఉంటుంది. కనుక ఏదైనా కోరుకోమని మళ్ళీ అన్నాడు. ఇక తన మనస్సులోనున్న వాంఛను అరికట్టడం రాణీకి కష్టమైంది. కాని రాణీ తన దాసీల సమక్షంలో తన నిగ్రహం అనే భ్రమను ఎట్లానో అణచుకొంది "గురువర్యా, తమరు సర్వజ్ఞులు అంతా తమ కృప" అంది. కొద్దిసేపట్లో దాసీలంతా అక్కడి నుంచి వెళ్ళిపోయారు. దాంతో గోరకనాథ్ "అవకాశం పోగొట్టుకొన్న తరువాత లభించేదేమీ వుండదు. నేను మూడవసారి మళ్ళీ మాట యిస్తున్నాను. నీవు ఏమైనా కోరదలిస్తే కోరుకో" అన్నాడు. సుందరాంకు ధైర్యం సడలింది. ఆమె నోటితో ఏమీ అనలేకపోయింది. ఆమె తన నయనాలతో తన మనోవాంఛను ప్రకటించింది:

"రాణీ సుందరాం ఉత్ కే నజర్ కోతో,
పూరన్ భగత్ హై అమృత ఫల్ మేరా."

గోరక్‌నాథ్ పూరన్‌కు ఆదేశమిచ్చి సుందరాం వెంట పంపించివేశాడు అగ్ని జ్వాలలాంటి సుందరాం నీడలాంటి పూరన్ ఇరువురూ ఒకరివెంట మరొకరు నడుస్తూ ముందుకు సాగిపోతున్నారు. అది అగ్నిజల సమ్మిళితం. ఇరువురికీ కఠిన పరీక్ష సమయం. గురువర్యులు మరొక పర్యాయం తనను అగ్నిజ్వాలల్లోనికి విసరి వేశారని యిది నాకు పరీక్ష సమయమని పూరన్ తలచాడు. అంతఃపురానికి చేరగానే రాణి పూరన్‌ను సింహాసనంపై కూర్చుండబెట్టింది. అతనికి ముళ్ళపాన్పుపై కూర్చున్నట్లు అనిపించింది. పూరన్ సింహాసనం నుంచి లేచి నిలబడ్డాడు. రాణి అతణ్ణి మళ్ళీ సుకోమల తల్పంపైన కూర్చుండబెట్టింది. కాని, అతను నిద్ర పోయేందుకు బదులు యోగ సమాధి అవలంబించి కూర్చున్నాడు. రాత్రంతా అతడు ఏకాగ్ర జ్యోతివలె ప్రకాశవంతంగా వున్నాడు. రాణీ అతని కాంతిమయ శరీర మహిమను చూస్తూ కూర్చుంది. ప్రాతఃకాలం పూరన్ కాలకృత్యములు తీర్చుకొనుటకై రాజ భవనం నుంచి బయటకు వెళ్ళాడు. రాణీ అతణ్ణి ఆపలేక పోయింది. అయినా, ఆమె కొంతమంది దాసీలను పూరన్‌వెంట పంపింది. కాలకృత్యాలు తీర్చుకొని రాణీ భవనానికి తిరిగి రావటానికి బదులు గురువర్యులున్న కొండవైపు బయలుదేరాడు. దాసిలు అతణ్ణి అడ్డగించి రాణీ మహలువైపు తిరిగి

విమ్మని కోరారు. అంతట "యోగులకు తిరిగి వెళ్ళటం అనేది నిషేధము. విడిచిపెట్టినదానిని వారు మరల గ్రహించరు" అన్నాడు పూరన్. దాంతో దాసీలు "మీ గురువర్యులు మిమ్మలను రాణీగారివెంట పంపారుగదా" అన్నారు. పూరన్ సమాధానంగా "గురువర్యులాదేశానుసారం నేను రాణివెంట వెళ్ళాను" అన్నాడు.

"అయితే మీరు ఎందుకు రాణితో నివసించరు?"

"గురువర్యులు రాణివెంట వెళ్ళమని ఆదేశించారు తప్ప ఆమెయింట వుండ మని నాకు చెప్పలేదు"

దాసీలు ఎంతో ప్రయత్నించారుకాని, ఉజ్జ్వల జ్యోతివలె పూరన్ ప్రకా శిస్తున్నాడు. ఆజ్యోతి చల్లారేటట్లులేదు. అతని శరీరంపై, చెయ్యి వెయ్యడానికి దాసీలకు సాహసం చాలలేదు. వారు భయభ్రాంతులయ్యారు. ఆయనను అడ్డ గించలేక వారు తిరిగి వెళ్ళిపోయారు. దాసీలు ఒంటరిగా రావడం చూసి రాణి నిరాశ చెందింది. అంతకు ముందునుంచి తన విలాస భవనం నుంచి పూరన్ రాకకు ఎదురుచూస్తూ వుంది. కాని. అతని మన్మధ ముఖారవిందము కనబడ లేదు. రాణి మృతప్రాయమైన తన భగ్న ప్రేమను తలంచుకుంటూ ఎంతగానో విలపించింది. ఉన్మాదినివలె ఆమె పూరన్‌ను ఇలా పిలువసాగింది.

> "రే రంగ్ మహల్ లే చఢ్ రానీ,
> రోరో ఆఖదో పూరనా లుట్ట గియాం
> బాగ్ శౌక్‌దే పక్కా తైయార్ హోయ,
> నేహాం లాయే కే పూరనా పుట్ట గియాం
> ఘడీ బైఠ్ నా కొత్తియాం రజ్జగల్లాం,
> ఝూఠీ ప్రోత్ లగాయే కే ఉడ్డ గియాం
> కాదర్ యార్ మియాం నస్సీ వాంగ్ మైనూం
> థలా విచ్చ కురలావుందీ సుట్ట గియాం

ఈ ఐశ్వర్యముతో కూడుకున్న వస్తువులు మా ఫకీర్లకి నిరుపయోగం. అందు కని తిరిగి ఇచ్చివెయ్యి. వీటికి బదులు నువ్వు వెళ్ళి వండిన భోజనం తీసుకురా.

పూరన్ ఆమె కండ్లనుంచి అదృశ్యమయ్యాడు. రాణి రంగమహలుపై నుంచి క్రిందికి దూకి ప్రాణత్యాగం చేసింది. నగరమంతా ఆర్తనాదంతో నిండిపోయింది.

పూరన్ తన గురువు ఎదుట నిలబడ్డాడు. గోరక్‌నాథ్ పూరన్ నిగ్రహం చూసి ఆశ్చర్య చకితుడయ్యాడు. పూరన్ ఎన్నడూ తన తల్లిదండ్రులను గాని తన జన్మ భూమినిగాని తలచలేదు. అతనికి లూణాపై ఎట్టి నేరారోపణా లేదు. సుందరాం యొక్క ప్రేమపైన కూడ అతను ఎట్టి అపరాధం మోపలేదు అతను నిజానికి బ్రహ్మజ్ఞుడై వున్నాడు. నిందాస్తుతులకు దూరుడై ప్రేమ ద్వేషాలకు అతీతుడై వున్నాడు. గురువు గోరక్‌నాథ్ ఇతను యితరులకు ఉపదేశించే యోగ్యుడైనాడని గమనించి ప్రపంచమునకు యోగవిద్య ఉపదేశించమని అతణ్ణి ఆదేశించాడు. కాని ఆ ఉపదేశ శుభారంభం నీ జన్మభూమి నుంచియే చేయమని ఆజ్ఞ యిచ్చాడు. పైగా ఈ విద్యయొక్క అవసరం నీ తండ్రికి నీ సవతి తల్లికి ఎంతగానో ఉంది. ఇది గురువు చెప్పిన మాట.

ఆజ్ఞకు బద్ధుడైన పూరన్ తన నగరానికి పయనమయ్యాడు. పన్నెండు సంవత్సరాలకు తిరిగి పూరన్ తన జన్మభూమికి వెళుతున్నాడు. రాజు సల వాన్ నిరంకుశ శాసనమంతా నేడు వెల వెల బోయింది. లూణాకి కూడా తన యౌవ్వనమంతా నలిగిపోయినట్లు కనపడింది. పాపం, ఆమెకు సంతతి కలుగ లేదు. ఆమెకు తన శరీరం తన సౌందర్యం శాపంగా కనబడుతున్నాయి. ఇచ్చారాం విలపించి విలపించి అంధురాలయిపోయింది. నగరవాసులు రాజాజ్ఞకై ఎదురు చూడలేదు. వారు రాజ శాసనాన్ని ఉల్లంఘించినట్లనిపించింది. ప్రతి పౌరునిపై ఏదో ఒక క్రీనీడ తిరుగుతున్నట్లనిపించింది. పూరన్ పుట్టినపుడే రాజు ఒక స్మృతి వాటికను నిర్మించాడు. కాని పూరన్ అంటే రాజు మనస్సు ఎంతో విరక్తి చెందింది. అందుచేత నాటినుంచి ఆ వాటికను శ్రద్ధగా చూడాలనే ఆసక్తి రాజుకి కలుగలేదు. ఆ వాటికే నేడు చిందర వందరగా పాడై వుంది. పూరన్ పాడైపోయి నిర్జనంగా వున్న ఆ వాటికకు వచ్చి ఆసీనుడయ్యాడు.

నిజానికి ప్రపంచంలో ఏవస్తువూ పూర్తిగా చెడిపోదు.

# రాజా - రసాలూ

—హరిభజనసింగ్

సలవన్ రాజు తన ఏకైక పుత్రుడికి మరణశిక్ష విధించాడు. రాజుగా తాను చేయ వలసిన న్యాయాన్ని చేశాడు. హక్కుదారుల హక్కును కాపాడాడు. అయినా అతనికి తృప్తి కలుగలేదు. ఆయనకు ఇద్దరు రాణులు; అయినా ఎవరికీ సంతానం కలుగలేదు. పెద్ద రాజ్యం, ఉన్నత భవంతులు, హర్మ్యాలూ ఉన్నాయి. అయినా రాజాంతఃపురాలలో ఆనందం లేదు; సుఖం లేదు; రాజు వయస్సు మళ్ళింది. రాజ్యా నికి వారసుడు లేడు. పూరన్ తల్లి పట్టపురాణి ఇచ్ఛారాం రోదించి రోదించి చివ రకు అంధురాలయిపోయింది. చిన్నరాణి లూణా యౌవ్వనం కూడ తిరుగుముఖం పట్టింది. ఆమెకు సంతానం లేదు. ఆమె హృదయానికి పెద్ద గాయం తగిలింది. అది రోజురోజూ రగిలి పుండుగా బాధపెడుతోంది. తెలియనితనంలో, స్వప్నంలో, అవమాన భారంతో కాని తాను చేసిన పాపగాథ తనంత తానుగా ఎక్కడ బయట పడుతుందేమోయని ఆమెకు భయం భయంగా ఉంది. కొన్ని సంవత్సరాలనుంచి ఆమె మంచి బట్టలు కట్టుకోలేదు; నగలు ధరించలేదు; శృంగారం అసలే లేదు; రాజుపై అలగలేదు; ఆయనచే ఏనాడూ బ్రతిమాలించుకోలేదు; అంతా నిరాశా నిస్పృహా! రాజభవనంలో ప్రతి వస్తువు వెలవెల బోతున్నట్లుంది. దాస దాసీలు నీడల్లా ఆమెచుట్టూ నిరంతరం తిరుగుతున్నారు.

ఒకరోజు ఒకయోగి పూరన్ తోట నూతిపద్ద బస చేశాడని వార్త తెలిసింది. కొన్ని సంవత్సరాలుగా ఆనూతినుంచి ఎవ్వరూ నీరు తోడడంలేదు. చుట్టుప్రక్కల తోట ఎండి మోడువారింది. నూతిలో నీటికి ఏదో పాకుడు పట్టింది. ఆనీరు త్రాగడానికి పనికిరానిదై పోయింది. ఈ అపశకున లక్షణాలుగల తోటలోకి ఎవ్వరూ పోయేవారు కాదు. అదేమి విచిత్రమో మరి! ఆ యోగి రాకతో ప్రజలు నూతి నుంచి నీరు తీసుకోసాగారు; ఎండి మోడువారిన తోటంతా మళ్ళీ కొత్త కొత్త చిగుళ్ళు తొడిగింది. భక్తి ప్రపత్తులుగల భక్త జనం తామర తంపరగా యోగి

సందర్శనార్థమై రాసాగింది. యోగి మహిమలను గూర్చి రాజుగారికి తెలిసింది. ఆ సమయంలో రాజ భవనపు పిట్టగోడపై ఒక తెల్లని కాకి వచ్చి కూర్చుంది. తమ కుమారుడు వచ్చి తల్లులైన ఇచ్ఛారాం, లూణాలను పిలుస్తున్నట్లనిపించిందని ప్రజలన్నారు. రాణులిరువురు ఉన్నఫళంగా యోగి దర్శనార్థమై వెళ్ళడానికి నిర్ణయించుకున్నారు.

రాణి ఇచ్ఛారాం పన్నెండేళ్ళనుంచి అంధకార బంధురమైన భూ సొరంగంలో అజ్ఞాతంగా పడివున్నట్లు చీకటి గదిలో పడిఉంది. మొదటిసారిగా నేడు తన విషాద మహల్‌నుంచి గులాబీరంగు బట్టలను ధరించి బయటకు వచ్చింది. ఈ వార్త సుమన సుగంధంవలె పట్టణమంతా క్షణంలో తెలిసింది. బండివాడు చక్కగా అలంకరించిన వాహనానికి మంచి గుఱ్ఱాలను కట్టి రాజ భవనపు సింహ ద్వారం దగ్గర నిలిపాడు. కాని ఆ పిచ్చితల్లి మమతామయ సూత్రాలతో ఆకర్షింప బడి కాలి నడకనే పాదరక్షలు కూడా లేకుండా, ఎదురు దెబ్బలు తింటూ, పడుతూ లేస్తూ ముందుకు సాగిపోయింది. ఆమె అంధనేత్రాలు కూడ తమ కుమారుడున్న తోట మార్గాన్ని గుర్తిస్తున్నాయి. ముందు పట్టపురాణి, ఆమె వెనుక గుఱ్ఱాలబండి, రాణి తన దగ్గరకు వస్తున్నట్లు పూరన్‌కు ఆమె చేరకముందే తెలిసింది.

తడబడుతూ. తూలుతూ తన దగ్గిరకు వస్తున్న తల్లిని యోగి చూశాడు. అతను తన యోగాసనమునుంచి లేచాడు. కొంతదూరం ఎదురువెళ్ళి తల్లి చేతు లను పట్టుకున్నాడు. తల్లీ, కొడుకు నడుస్తూ వెడుతున్నారు. అప్పుడు యిచ్ఛారాం యిలా అంది:

నాయనా!. నీ స్పర్శ నా కుమారుని స్పర్శలా ఉంది. నీవు యోగివైన నా కుమారుడవేనా?

ఒక్కసారిగా యోగి హృదయం ద్రవించింది. ఎన్నో సంవత్సరాల తరు వాత అతనికి కూడా తల్లిని స్పర్శించే అదృష్టం కలిగింది.

"అవునమ్మా! నేను నీ కుమారుడనైన యోగినే సుమా!" అన్నాడు సమాధానంగా.

పూరన్ యొక్క తోటవలె పూరన్ తల్లియొక్క శుష్క హృదయం కూడా ఆనందాతిశయంతో ఓలలాడింది. ఆమెకు కంటిచూపు తిరిగి వచ్చింది. పయో ధరాల నుంచి పాల ధారలు చిందాయి,

ఇచ్చారు. వెనుకనే సలవన్, లూజా యిరువురు బయలుదేరి వచ్చారు. యిది చూసి వారికంతా అగమ్య గోచరంగా ఉంది తుషారాపాతంవల్ల మోడువారిన చెట్లు నడచి వెళుతున్నట్లనిపించింది. నిజంగా తన కరస్పర్శతో వీరిని యోగి సస్యశ్యామలం చేస్తాడా? పూరన్ తన ముసలి తండ్రి దుఃఖంలో మునిగి తనవైపు రావడం చూసి ఆసనంనుంచి లేచి నిలబడ్డాడు. సలవన్ రాజు తన దగ్గిరకు చేర గానే యోగి వినయంగా ఆయనకు నమస్కరించాడు. అది చూసి రాజు ఆశ్చర్య చకితు డయ్యాడు.

"యోగి పుంగవా! నాపై యింతటి కృతజ్ఞతా భారాన్ని మోపవద్దు. నేను మీ ధూప పాత్రనుంచి ఒక చిటికెడు విభూతిని తీసికోవాలని వచ్చాను. నేను మీ కృపా భిక్షను యాచిస్తున్నాను అన్నాడు రాజు.

"మహారాజా, ఈ ధూపపాత్ర నాకు మీరు ప్రసాదించినదేకదా! మీకు కావలసినంత విభూతిని తీసుకుని వెళ్ళండి."

రాజు ఒక్కసారిగా కంపించాడు. అతని నోటవెంట మాట రాలేదు కాని పుత్రహీనురాలైన లూజా మౌనంగా ఉండలేకపోయింది.

"యోగి రాజా, తమరు దయామయులైతే నాకు ఒక్క కుమారుడు కలిగేలా వరాన్ని ప్రసాదించండి" అంది దీనంగా.

"రాజుగారికి యింతకు ముందే ఒక కుమారుడు ఉన్నాడు కదా!" అన్నాడు యోగి.

రాజు కళ్ళనుంచి కన్నీరు ప్రవహించింది. "యోగి పుంగవా, నా కుమారుడా! కాని యిప్పుడు అతను లేడు. ఉంటే ఈనాడే ఆ కుమార్గ గామిని తిరిగి తెచ్చు కుంటాను. సంతాన హీనులు చనిపోయినచో.........." యోగి ఆయన మాటకు అడ్డుతగిలి "కాదు. మహారాజా! మీ కుమారుడు ఇప్పుడూ సజీవుడే. అతను కుపథగామి కాదు. అయితే, మీరు అతణ్ణి యింటికి తీసుకుపోలేరు" అని అన్నాడు.

యోగులు అబద్ధమాడరని రాజుకు తెలుసు. అతను ఏదో కినుక భావంతో లూజావైపు చూశాడు. లూజా అంతకు ముందునుంచే పాషాణ ప్రతిమలా కూర్చుని ఉంది. ఆమె కండ్లనుంచి కన్నీళ్ళు ధారలు కడుతున్నాయి. యోగి ముఖంలోని తేజస్సును చూస్తూ ఆయనముందు అబద్ధమాడడానికి ఆమెకు సాహసం

ఎలా కలుగుతుంది? రాజు కళ్ళలో దుఃఖం వెల్లివిరిసింది. స్వయంగా రాణి కుమారుణ్ణి వరం అడగడానికి యోగి దగ్గరకు వచ్చింది. ఆమె ఏడుస్తూ తన పాపాన్ని ఒప్పుకుంది.

"ఇందులో పూరన్ దోషం ఏమీలేదు. నా బుద్ధియే వక్రమార్గం పట్టింది. అతని అపురూప సౌందర్యాన్ని చూసి సహించలేకపోయాను. నేను ధర్మానికి తిలోదకాలిచ్చి అధర్మ మార్గాన్ని చేపట్టదలిచాను" అంది గంభీరంగా.

రాజు తటాలున కత్తితీసి. లూణా శిరస్సును ఖండించదలిచాడు. పూరన్ ఆయన చేతిని పట్టుకున్నాడు. "మహారాజా! జరిగినదేదో జరిగింది. అది అంతా మంచికే జరిగింది. అందుకు కోపమెందుకు? మీ కుమారుడు బ్రతికే వున్నాడు. అతను మీ సమక్షంలోనే వున్నాడు" అన్నాడు సందేహాన్ని దూరంచేస్తూ.

అందరూ యోగిని ఏకాగ్రతగా, దీక్షగా చూశారు. గుర్తు పట్టడానికి ప్రయత్నించారు. యోగి ముఖంలో రాజకుమారుని రూపం వారికి గోచరించింది. వారంతా ఒక్కసారిగా యోగిని మనసారా ఆలింగనం చేసికొని కృతకృత్యులు కావాలనుకున్నారు. కాని యోగి తన హోమగుండంనుంచి కాలుచున్న కట్టెను తీసుకుని నిలబడ్డాడు. "మహారాజా! మేము మోహ, మాయా బంధనాల్ని ఏనాడో తృంచివేశాము. మనమిక రెండవ పర్యాయము తండ్రీ కొడుకులం కాలేము. మీరు నిరాశ చెందవద్దు. మీ కుమారుడు ఎక్కడకు వెళ్ళినా మీ వంశ గౌరవాన్ని కాపాడడమే గాక దాన్ని యినుమడింప జేస్తాడు. పూరన్ యోగిని తలిచిన చోటల్లా సలవనురాజు పేరుకూడా స్మరించబడుతుంది. ఈ రాజ్యాలు, సుఖ భోగభాగ్యాలు అదృశ్యమవుతున్న నీడల్లాంటివి. ధార్మిక గాథలు మాత్రమే యుగ యుగాల తరబడి అమరంగా నిలుస్తాయి" అన్నాడు యోగి ఉపదేశాత్మకంగా.

దాంతో లూణా "నాకారణంగా, రాజభవనం శూన్యంగా వెలవెల పోతూ ఉంది. రాజ కుమారుడు రాజ భవనానికి రానంతవరకు నేను కూడా ఆ భవనంలో అడుగు పెట్టలేను. యోగికుమారా, నీవు యింటికి రానంతవరకు నా శిరస్సుపై వున్న కళంకం తొలగిపోదు. నీవు నన్ను కాపాడదలిస్తే నా పాపాలన్నింటిని పరిహారం చెయ్యి. నీవు నీ యింటికి తిరిగిరా" అంది ప్రాధేయ పూర్వకంగా.

యోగి భిక్షా కపాలంనుంచి ఒక బియ్యపు గింజ తీసి లూణా అరచేతిలో ఉంచి "తల్లీ, వెళ్ళు నీ యింటికి తిరిగి వెళ్ళు. నీతోబాటు నీ కుమారుడు కూడా

యింటికి వస్తాడు. నీ గర్భంకూడా ఈ తోటవలె పరిపూర్ణ మవుతుంది" అన్నాడు.

"పూరనా! నీవుకూడ యింటికి తిరిగిరా నాయనా! నీవు రాకుంటే శ్మశానంగా వున్న యిల్లు మళ్ళీ కళకళలాడదు" అన్నాడు రాజు.

"మహారాజా! నేను యింటికి తిరిగి రాలేను. మీకై నేను చనిపోయినవానితో సమానం. నా నోటినుంచి వెలువడే మాటలు తిరుగులేనివి. మీయింట పుత్రుడు జన్మిస్తాడు. కాని అతణ్ణికూడా మీరు యింటిలో ఉంచుకోలేరు. నా తల్లి ఇచ్ఛారాంవలె ఈ తల్లి లూణాకూడా తన కుమారుని ఎడబాటుతో రోదిస్తూ ఆర్తనాదం చేస్తూ ఉంటుంది." పూరన్ సమాధానంగా అన్నాడు.

కొంతకాలానికి లూణాకు "రసాలూ" అనే కుమారుడు పుట్టాడు. జ్యోతిష్కులు ఇతని గ్రహ, నక్షత్రాలు చూసి ఇతణ్ణికూడా పన్నెండు సంవత్సరాల వరకు తల్లిదండ్రులనుంచి వేరుగా ఉంచాలి. ఇతని గ్రహ నక్షత్రాలు పూరన్ గ్రహ నక్షత్రాల లాంటివే అన్నారు పండితులు. "ఈ రాజపుత్రుడూ శక్తివంతుడు, మహావీరుడు అవుతాడు. అయినా అతను యోగివలె నిర్లిప్తంగా వుంటాడు" అని చెప్పారు.

రసాలును భూ సొరంగంలో పడవేశారు. అతని సేవకై దాసీలు, దాదులు నియమించబడ్డారు. పన్నెండేళ్ళవరకు అయ్యే ఖర్చుకూడా రాజు వారికి యిచ్చివేశాడు. రసాలు పుట్టినే రోజునే రాజులయొక్క అశ్వశాలలో ఒక గుఱ్ఱపు పిల్ల పుట్టింది. దానికి ఫౌలాది అని పేరు పెట్టారు. దాని పోషణకు ఏర్పాట్లన్నీ రసాలూతోబాటు చేశారు.

రసాలూ దినదిన ప్రవర్ధమానంగా పెరుగుతున్నాడు. పన్నెండేళ్ళ గడువు పూర్తయ్యింది. అతను చీకటి సొరంగంనుంచి బయటకు వచ్చాడు. అతనెంత సౌందర్యవంతుడో అంత ఆరోగ్యవంతుడు. గురువులు అతనికి రాజరికానికి సంబంధించిన అన్ని విద్యలూ నేర్పారు. గుఱ్ఱపుస్వారీ, విలువిద్య, కత్తిసాము, బళ్ళెం విసరటంలో అతను అసమాన నైపుణ్యం సంపాదించాడు. ఇంటినుంచి బయటకుపోతే అతను వేటకు వెళ్ళేవాడు. ఇంటిలో వుంటే చదరంగం ఆడేవాడు.

రసాలూ యౌవ్వనవంతు డయ్యాడు. అతని ఆటల్లో వంగల కర్రతో గుఱి చూసి కొట్టడం కూడా ఒకటి. గ్రామీణ స్త్రీలు నూతివద్దనుంచి కుండలతో నీళ్ళ

తీసుకొని తమ యిళ్ళకు వెళుతున్నప్పుడు రసాలూ పంగల కర్రలో చిన్న రాయి వుంచి గురిచూసి ఆ కుండలను కొట్టేవాడు. కుండలు బెజ్జాలుపడేవి. కను రెప్ప పాటులో ఒకే కుండకు పది పన్నెండు బెజ్జాలు పడేటట్లు కొట్టేవాడు. దాని పొడుగునా కుండలనుంచి కారే నీరు ధారలు కట్టేవి. అంతా స్వప్న దృశ్యంలా సాగిపోయేది. రసాలూకు మాత్రం ఈ పనివల్ల మనోరంజనం కలిగేది కాని పిల్లికి చెలగాటం ఎలుకకు ప్రాణసంకటం అన్నట్లు గ్రామీణ సామాన్య ప్రజా నీకానికి ఎంతో హానికరంగా వుండేది. విసిగి, వేసారి ఆ స్త్రీలు చిన్నరాణి లూణా మహలుకు వెళ్ళి యువరాజుపై ఫిర్యాదు చేశారు. తన ప్రియ పుత్రుణ్ణి ఆమె ఏమీ అనలేకపోయింది. ఆమె వారి కుండలకు బదులు బిందెలను దానం చేసింది. రసాలూ తల్లికంటె చాలా తెలివిగలవాడు. అతను పంగల కర్రకు స్వస్తిచెప్పి ధనుర్బాణాలు తీసుకున్నాడు. బాణాలతో బిందెలను కొట్టి వాటికి బెజ్జాలు పెట్టేవాడు. ప్రజలు యువరాజు ఆకతాయితనం చూసి ఎంతో దుఃఖం చెందారు. ఫిర్యాదు రాజువరకు వెళ్ళింది రాజు తన ఏకైక పుత్రుణ్ణి అదుపులో పెట్ట లేకపోయాడు. ప్రజల దుఃఖాన్నిఅతడు చూడలేకపోయాడు. అతని స్థితి ముందు గొయ్యి వెనుక నుయ్యిలా వుంది. అతను తన కుమారుని ఆకారంగల ఒక విగ్ర హాన్ని తయారు చేయించాడు. దాని ముఖానికి నలుపురంగు వేయించి రాజమందిరం ముందు పెట్టించాడు. రసాలూ వేటనుంచి యింటికి తిరిగి వస్తున్నప్పుడు రాజు భవనం సింహద్వారందగ్గిర తన విగ్రహాన్ని చూశాడు. నల్లనిముఖం నీలిరంగు కళ్ళు. తండ్రి కోపాన్ని అతను అర్థం చేసుకున్నాడు. రాజభవనంలో యిక నాకు అన్న పానీయాలు దొరకనట్లే అనిభావించి అతను తన దేశాన్ని వదలిపెట్టిపోవడానికి నిశ్చయించు కున్నాడు.

రాజకుమారుడు దేశాన్ని విడిచి వెళ్ళాడనే వార్త పట్టణమంతా పొక్కింది. సాహసవంతులైన యువకులు రసాలూ వెంట వెళ్ళారు. తమదేశంనుంచి బయ టకు పోయి కేవలం తమ సాహస బలంతో తమ గొప్పతనాన్ని చూపించాలని గట్టి నిర్ణయం చేసుకున్నారు. యువకుల తల్లులు మళ్ళీ లూణా భవనానికి వెళ్ళారు. రాజకుమారుణ్ణి దేశంనుంచి వెళ్ళకుండా ఆపమని కోరారు. కాని, ధనస్సునుంచి బాణం విడిచిన తర్వాత "అయ్యో పాపం" అంటే లాభమేముంది? యువరాజు, అతని మిత్రులు పట్టణంనుంచి ఎంతో దూరం వెళ్ళిపోయారు. లూణా తన భవనపు పై అంతస్తునుండి వెళ్ళిపోతున్న కుమారుణ్ణి చూసింది. కాని, అతను కనబడలేదు. పైకెగసిన దుమ్ము, ధూళి మబ్బులుగా కనబడ్డాయి.

లూణా విలపిస్తూ యిలా అరచింది:

వేతూఁ చరి ఊఁ దేస్ బగానే పుత్త రసాలూఆ.
వేతూఁ ముడ్ ఆ కిసే బహానే పుత్త రసాలూఆ,
గీలక తేరీ మిట్టీ చ రూల్ గయీ,
తేరే నఖనా జాణ- పఛాణే, లే పుత్త రసాలూఆ।
తిఖ్ఖీ ఛురి కలేజే ధాణీ
జా బైదీ దిల్‌దే ఖానే, వే పుత్త రసాలూఆ।
పిచ్ఛే తాఁ ఛేడ్డే గి ఓఁ, బలదియాఁ లాటాఁ,
వేతూఁ బన్నగియోఁ అగ్గదే గానే వే పుత్త రసాలూఆ।

[అబ్బాయీ రసాలూ, నీవు పరదేశం వెళ్ళిపోయావు: బాబూ రసాలూ! ఏదో నెపంతో నీవు తిరిగి రా నాయనా! నీ శిరస్సుపై వున్న టోపీనిండా దుమ్ము పట్టి పాడైపోయింది. ముఖంనిండా దుమ్ముపట్టి గుర్తు తెలియకుండా ఉన్నావు. పదునైన బాకు సూటిగా నా గుండెల్లో దిగినట్లయింది నీవు నీవెనుక భగ భగ మండే అగ్ని జ్వాలల్ని విడచి వెళ్ళావు. ఇక నా జీవితంలో విషాదాగ్ని రగులు తోంది. హృదయం దహించుకు పోతోంది.]

రసాలూ రాజభవనాన్ని విడచి వెళ్ళాక మళ్ళీ ఇంటివైపు తిరిగియైనా చూడ లేదు. సియాల్ కోటనుంచి తిన్నగా అతడు గుజరాతు ప్రాంతం చేరుకున్నాడు అక్కడ గూజర్‌రాజు పరిపాలిస్తున్నాడు. రాజు రాజధానినుంచి బయటకు వెళ్ళి రసాలూకు స్వాగతం చెప్పి ఇలా అడిగాడు:

కిస్ రాజే దా పుత్తర్ హైఁ,
తే కీ హై తేరా నామ్।
కే హడా తేరా దేస్ సోణియాఁ
కే హడా నగర్ గ్రామ్?

[నీవు ఏ దేశపు రాజకుమారుడవు? నీ పేరేమిటి? ఓ సుందరాకారుడా! నీ దేశం పేరేమి? నీవు ఏ నగరంనుంచి వచ్చావు?]

రసాలూ సమాధానం ఇచ్చాడు;

మై రాజే సలవన్ దా పుత్తర్

మేరా నామ్ రసాల్
మేరా తా౯ హూణదేశ్ నా కోయీ
పియోదా దేస్ సియాల్।

[నేను సలవన్ రాజు కుమారుణ్ణి. ఇప్పుడు నాదేశమేదియు కాదు. నా తండ్రి రాజ్యం పేరు సియాల్.]

రసాలూ స్వతంత్ర ప్రవృత్తికల యువకుడని గూజర్‌రాజు గమనించాడు. "నీకు శక్తి సామర్థ్యాలు ఉంటే జీలము నదీ ప్రాంతానికి వెళ్ళు. ఆ ప్రాంతం లోని నాలుగవవంతు భూ భాగంపై మీవంశం వారికి అధికారం ఉంది. మీ తండ్రి చాలాకాలం సంతాన హీనుడుగా ఉన్నాడు. అతను ఎన్నడూ ఈ భూ భాగంపై తనకున్న హక్కునైన చెప్పుకొవలేదు" అని అతను అన్నాడు.

ఫౌలాది గుఱ్ఱంపై స్వారీ చేస్తూ రసాలూ ముందుకు సాగాడు. అతను రెండు మణుగుల బరువుగల ధనుస్సును చేత ధరించాడు. ఒకేసారి ఆ ధనుస్సు నుంచి మూడు బాణాలు విడవవచ్చు అవి తమ లక్ష్యాన్ని ఛేదించి తమ యజమాని వద్దకు తిరిగి చేరుకుంటాయి. రసాలూ జీలం కోటను కొద్ది ఘడియల్లో జయిం చాడు. తన మిత్రులలో నొకడిని ఆ జయించిన కోటకు రాజును చేసి తాను ముందుకు బయలుదేరాడు. మిగిలిన మిత్రులు అతనిని అనుసరించగా అతను వారితో "మీరు యిక్కడనే ఉండండి, మీరు లేకుండా ఒంటరిగా యితను రాజ్యాన్ని ఎలా పాలించగలడు? ముందు యాత్ర నేను ఒంటరిగానే చేయగలను. నాతో పాటు కేవలం యిద్దరు మిత్రులు ఉంటారు. ఒకటి నా గుఱ్ఱమైన ఫౌలాదీ మరొకటి నా చిలుక శానీ" అన్నాడు.

రసాలూ తాను వెళ్ళిన భూ భాగాలను జయిస్తూ ముందుకు సాగిపోయాడు. అటు సలవను మహారాజు వృద్ధాప్యంవల్ల నానాటికి క్షీణిస్తున్నాడు. ఎప్పుడతని శరీరంనుంచి ప్రాణపక్షి ఎగిరి పోతుందో తెలీదు. అంతటితో ఆ సింహాసనానికి వారసులు లేరు. అది శూన్యంగా ఉంటుంది. రాజు వెంటనే కుమారునికి తన సందేశాన్ని పంపించాడు. సందేశ వాహకులు రసాలును వెతుకుతూ బయలుదేరారు. ఈ రోజు రసాలూ ఫలానా ప్రదేశంలో ఉన్నాడు అని తెలిస్తే వారు హుటాహుటిగా అక్కడికి గుఱ్ఱాలను పరుగెత్తించేవారు. తీరా అక్కడికి చేరగానే అక్కడనుంచి రసాలూ యింకా ముందుకు వెళ్ళాడని తెలిసేది. వారు యిలా ఎన్నోసార్లు రసాలూని

చేరలేక నిట్టూరుస్తూ నిలచిపోయారు. తండ్రి పంపిన వార్త కుమారునికి చేరలేదు. వెళ్ళిన దూతలు తిరిగి వచ్చేశారు. మరొకసారి లూణా కుమారునికి ఏదో తన సందేశం పంపించింది. అదికూడా రసాలూకి చేరలేదు. చివరకు తల్లి ఇచ్ఛారాఁ తన కుమారుడైన పూరన్‌పేరు ధ్యానిస్తూ రసాలూకు సందేశం పంపింది. భగవంతుని దయవల్ల ఆ సందేశం రసాలూకు అందింది. అతను తన ఇంటిముఖం పట్టాడు. సలవన్‌రాజా తన కుమారుని చిన్నవయస్సులోనే తన మంత్రి మోతీరామ్ కుమార్తెతో పెండ్లి చేయాలని నిర్ణయించాడు. రసాలూ తన యింటికి తిరిగి వస్తున్నాడు. నగరం బయట నూతిదగ్గిర నీళ్ళు నింపుచున్న నవ యువతులు పరస్పరం నవ్వుతూ కేరింతలు కొడుతూ హాస పరిహాసాలాడుతున్నారు. వారు రసాలూ గర్వంగా వెళ్ళడం చూశారు. వారిలో ఒక యువతి యిలా అంది

వే ఘోడీదే అసవారా
ఫందే తాఁ తేరే ఉడన్ హవా విచ్
సాంభ్ లై కుడీ దే వాంగ్
హాయ్ వే ఘోడీ దే అసవారా
జే ఫండియాఁ తోతైనూఁ ఫడియా కిసేనే
పుటన్న దహీఁ దేనీ లాంఘ్.

[ఓ అశ్వారోహీ! నీ శిరోజాలు గాలిలో ఎగురుతూ ఉన్నాయి. వాటిని నీవు అమ్మాయిలవలె చక్కగా దువ్వుకో. ఓ గుఱ్ఱపు రౌతా! ఏ యువతియైనా నీ జుట్టును పట్టుకొన్నచో ఒక్క అడుగైనా నిన్ను ముందుకు వేయనివ్వేదు సుమా!]

రసాలూ తక్షణం ఇలా సమాధానం ఇచ్చాడు:

జాఁ తాఁ అపనీ మోడ్ లై బోలీ
నహీఁ తాఁ హోణ నాదేవాఁ తేరాకాజ్
టుట్ట జాయ్ తేరా చూడా భిడా
ధరియా రహ జాయ్ దాజ్

[ఓ పిల్లా! నీవు ఇప్పుడన్నమాటలు ఉపసంహరించుకున్నావా సరే. లేనిచో నేను నీ పెళ్ళి జరగనివ్వను. నీ పెళ్ళిప్రయత్నాలన్నీ మట్టిపాలు కావలసిందే. వరుడుకు నీవిచ్చే కట్న కానుకలన్నీ ఎందుకూ పనికిరాకుండా పోతాయి.]

ఆ అమ్మాయికి ఆత్మాభిమానం అధికం; యౌవ్వనంపై గర్వం మెండు.

అంతేకాదు. ఆమెకు తన తండ్రి మంత్రియనే అభిమానం. తన అంతస్తును బట్టి ఆమె తన మాటలను ఎలా ఉపసంహరించుకొంటుంది? ఆమె ఎంతో సందేహ దృష్టితో యువరాజును తదేకంగా చూసింది. ఆ తర్వాత ఆమె ముఖం వెనుకకు త్రిప్పుకొంది.

రాజ మందిరానికి చేరగానే రసాలూ తన తల్లిదండ్రులతో "ఎందుకై నన్ను పిలిచినారో, ఆ పని త్వరగా పూర్తి చేయండి. నేను మీ నాలుగు గోడలమధ్య ఎక్కువకాలం ఉండలేను." అన్నాడు. తల్లిదండ్రులు కుమారునికి పాణిగ్రహణం జరిపిస్తే ఇంటికి కోడలు వస్తుంది. అబ్బాయి మనస్సు భార్యపై లగ్నమవుతుంది అని ఆలోచించారు. మరుసటి రోజునే రాజు పెండ్లివారిని వెంటబెట్టుకొని కుమారునితో సహా మోతీరామ్ ఇంటికి చేరారు. పెండ్లి కుమార్తె షోడశ శృంగారాలు చేసుకొని పెండ్లి పీటలమీద వచ్చి కూర్చుంది. బ్రాహ్మణులు వధూవరుల మధుపర్కాలకు బ్రహ్మముడులు వేశారు. వారిని అగ్నిచుట్టూ నాలుగుసార్లు ప్రదక్షిణం చేయించారు. సప్తపదిలో ఇంకా మూడుసార్లు ప్రదక్షిణం చేయాల్సివుంది. ఇక పెండ్లికూతురు వెనుకకు పెండ్లికొడుకు ముందుకు రావాలి. వధువు ముందుకు పోయేముందు రసాలూ మెడత్రిప్పి పెండ్లికూతుర్ని చూశాడు. ఇరువురి కళ్ళు కలశాయి. ఒకరినొకరు గుర్తుపట్టారు. కనురెప్పపాటులో రసాలూ ఒరనుంచి కత్తితీసి బ్రహ్మముడులను నరికి దూరంగా పారవేశాడు. మెరుపులా వేగంగా పెండ్లి పందిరినుంచి పరుగెత్తుకుపోయి బయట నిలబడివున్న తన ఫౌలదీ గుర్రాన్ని ఎక్కాడు. పెండ్లివారంతా నివ్వెరపోయి చూస్తూ ఉండిపోయారు. రసాలు కొద్ది క్షణాల్లో నగరంనుంచి దూరంగా వెళ్ళిపోయాడు. తండ్రి సలవాన్ రాజు కుమారుణ్ణి ఎంతగానో పిలిచాడు. "రా నాయనా! లలాటంపై తిలకం పెట్టించుకో. ఈ రాజ్యానికి ఈనాటినుంచి రాజు నీవే" అని.

రసాలూ రాజు వెళ్ళగా వెళ్ళగా ఒక దట్టమైన అరణ్యానికి చేరాడు. అక్కడ విపరీతమైన ఎండగా వుంది. అయినా ఏదో సువాసన గుప్పు గుప్పుమని గుబాళిస్తుంది. కొంత ముందుకు వెళ్ళాడు. అక్కడ ఒక గంధపుచెట్టు తగలబడుతూ ఉండడం చూశాడు. కొద్దిసేపట్లో చెట్టునుంచి కాలుచున్న రెక్కలతో ఒక హంస బయటకు రాజు పాదాలపై పడింది. దానిని చూసి అతని హృదయం కరిగిపోయింది. అతనెంతో దుఃఖించాడు. "చెట్టుకు నిప్పు అంటుకొనగానే నీవు

చెట్టుపైనుంచి ఎందుకు ఎగిరిపోలేదు? అని అతను హంసను ప్రశ్నించాడు. దాంతో హంస "జీవితమంతా ఈ చెట్టుపై నివసించి దాని పండ్లు తిన్నాను. చల్లని దాని నీడలో ఆనందాన్ని పొందాను. కాని ఆ చెట్టుకు విపత్తు సంభవించి నప్పుడు నేను దానిని విడచి ఎలా ఎగిరిపోగలను?" అంది సమాధానంగా. రసాలూ స్వయంగా భగీరధ ప్రయత్నం చేసి నదీ ప్రవాహాన్ని చెట్టువైపుకు మరలించాడు. ఈ చెట్టు దుఃఖాన్ని దూరం చేయమని ఎంతగానో ప్రార్థించాడు. అగ్నిచల్లారింది; హంస మళ్ళీ చెట్టుపైకి ఎగిరి కూర్చుంది. హంసా చందనపు చెట్టుయొక్క ప్రేమ చూసి రాజు హృదయం శోకంతో నిండిపోయింది. కాని అతను అన్ని మమతా మమకారాలను ప్రేమను త్రుంచుకొని వచ్చాడు. రసాలూ ముందుకు సాగాడు. దాంతో హంస ఇలా అంది:

కలము కల్లా భోరే పాలియోఀ కల్లే తేరే రాహ్
కలము కల్లే జంగల్ ధానీ కల్లా కల్లా జా।

[నీవు భూగర్భ సొరంగంలో ఒంటరిగా పెరిగావు. నీ మార్గాలన్నీ ఒంటరి మార్గాలు. ఈ ఒంటరి అడవిలో నీవు ఒంటరిగానే వెళ్ళు.]

రసాలూ రాజు అవిరామంగా పయనించాడు. అడవి ఎంతకు అంతం కాలేదు. మరుసటిరోజు ఉదయం రసాలూకు మార్గంలో ఒక సర్పం కనబడింది. తుఫాను వీచడంవల్ల రేగిన ఇసుకవల్ల దాని కళ్ళకు అంధత్వం దాపురించింది. పాము గుఱ్ఱపుకాళ్ళ చప్పుడు విని ఎవరో మనిషి ఈ మార్గంగుండా వెళుతున్నాడని గ్రహించింది. అది అతణ్ణి ఇలా ప్రార్థించింది:

ఐ సీ రాహీఀ లంఘూర్దయా, గల్లా సాడీ సున్ జా
జేతూఀ మెహరాఀ వాలదా సాడీ అఖ్కకంకర్ కఢజా
ధరమి యాఀ ధరమ్ కమా।

ఈ మార్గంగుండా వెళ్ళే ఓ బాటసారీ! కాస్త నా మాటవిని వెళ్ళు! నీవు దయామయుడవైతే నా కంటిలో పడ్డ యిసుక రేణువులను తీసివెయ్యి. ఓ ధర్మ పరుడా పుణ్యం సంపాదించుకో.

పాము మానవ జాతికి శత్రువు. ఇంటినుంచి యింతదూరం వచ్చి రాజు విరోధాలని మర్చిపోయాడు. రాజు తన చేతులతో ఆ నాగుపాము కండ్లనుంచి యిసుక రేణువులను తీసి వేశాడు. పాము కళ్ళు బాగుపడ్డాయి. ఇక రాజు

ముందుకు పోసాగాడు. కానీ నాగుపాము పడగవిప్పి అతని దారికి అడ్డుగా నిలిచింది. రాజా "ఇది ఏమిటి? ఉపకారానికి ప్రతీకారమా!" అని అడిగాడు. నాగుపాము శిరసు వంచింది. "ఈ రాత్రి నాయింట నీవు బసచేసి వెళ్ళు. ఇది నా ప్రార్థన" అంది వినయంగా. రసాలూ సర్పం విన్నపాన్ని మన్నించాడు. దాని గుహలోకి వెళ్ళి ఆ వీరుడు రాత్రంతా ఆ నాగుపాముతో ఒకే మంచంపై నిదురించాడు. మరుసటి ఉదయం నాగుపాము మళ్ళీ ఏదో మనిషిని కాటువేయడానికై గడ్డిలో మాయమైంది. రసాలూ. తన దారిన వెళ్ళిపోయాడు. అడవిని దాటి రసాలూ నీల నగరానికి చేరాడు. నగరం బయట ఒక ముసలిది కూర్చుని ఉంది. ఆమె ఒకసారి నవ్వుతోంది. మరోసారి ఏడుస్తోంది. అతను ఆమె దుఃఖానికి కారణం అడిగాడు. కాని ముసలిది సమాధానం చెప్పడానికి బదులు పూర్వంవలె నవ్వుతూ, విలపిస్తూ వుండిపోయింది. ఆమె ఏమాటా చెప్పలేదు. రసాలూ కూడా ఆమెను అంతటితో విడిచిపెట్టలేదు. చివరకు ఆ మామ్మ యిలా అంది. ఈ నగరము ఒక రాక్షసుని ఆధీనములో ఉంది. ప్రతిరోజు అతను ఒక మనిషిని ఆహారంగా తీసుకొంటాడు. కొంతమంది నగరాన్ని విడిచి పారిపోయారు. కొంతమందిని రాక్షసుడు పొట్టన పెట్టుకున్నాడు. మిగిలినవారు తమ మరణానికి ఎదురు చూస్తున్నారు. నాకు ఏడుగురు కొడుకులు. ఆరుగురిని రాక్షసుడు భక్షించాడు. ఈ వేళ నా ఏడవ కొడుకు వంతు వచ్చింది. నేను మిగిలానని అనుకుంటూ నవ్వుతున్నాను. నా ఏడుగురి కొడుకులను నా ఎదుటనే బలియిచ్చి నిమ్మకునీరెత్తినట్లు యింకా కూర్చున్నానే అని అనుకుంటూ విలపిస్తున్నాను " రాజు, చెట్లు, పక్షులు నాగసర్పాలకి ఉపకారం చేశాడు. ఇక ఈరోజు మానవునికి ఉపకారం చేసే అవకాశం చిక్కింది. ఇప్పుడు ఈ పని మృత్యువుతో పోరాటం లాంటిది. తల్లికి కుమారుణ్ణి కాపడానికి బదులు నేను రాక్షసునికి భోజనం అవుతానని నిశ్చయించుకున్నాడు.

రసాలూ తన గుఱ్ఱం ఎక్కి మళ్ళీ అరణ్యంపైపు వెళ్ళాడు. నగరవాసులు రాక్షసుని ఆహారం కొఱకు ఒక బండి రొట్టెలు, ఒక ఆబోతును కూడా పంపుతున్నారు. వారు రాజుననుసరించారు. రాక్షసుడు ఒక గుఱ్ఱపు రౌతు తనవైపు రావడం చూసి పరమానందం చెందాడు. ఆహార పదార్థాలతోబాటు ఒక గుఱ్ఱం కూడా తినటానికి లభిస్తుందని అతని సంతోషం. అతను ముందుగా గుఱ్ఱముపై

చెయ్యి వేశాడు. కాని రసాలూ రెప్పపాటులో తన కత్తితో అతని చెయ్యిని నరికి వేశాడు. రాక్షసుడు ఛీత్కారం చేస్తూ లేచి తన యింటివైపు పరుగెత్తాడు. రక్షణకు అతనికేమార్గం కనబడుటలేదు. అతను చెట్లచాటున దాక్కున్నాడు. కాని రసాలుని బాణం చెట్టుని బేధించి ఆ రాక్షసునివద్దకు చేరేది. అతను తన కుమారులను రాజుని ఎదుర్కొనేందుకు ముందుకు పంపాడు. వారిలో కొంతమందిని రాజుకత్తి నరికివేసింది. కొంతమందిని అతని త్రాళ్ళు బంధించాయి. ఇక రాక్షసుడు తన యింటిలో ఏడు ఇనుప డేగిసేల వెనుకకు పోయి దాక్కొన్నాడు. పరాక్రమవంతుడైన రసాలూ ఒక్క బాణంతో ఏడు డేగిసీలను తునా తునకలు చేశాడు. రాక్షసుణ్ణి అంతం చేశాడు. ఆ రాక్షస కుటుంబాన్నంతా చంపుటవల్ల రసాలూ పేరు నలువైపులా వ్యాపించింది. నగరవాసులంతా తమ రాజుతోపాటు రసాలు దర్శనార్థమై వచ్చారు. నగరవాసులు రసాలూను అక్కడే ఆపదలిచారు. కాని, అతని పాదాలలో చక్రాలున్నాయి. అవి అతణ్ణి నిలకడగా ఎక్కడా కూర్చోనివ్వవు. ఆ నగరపు రాజు కుమార్తె కుమారి శౌంకనీ అతనీ సౌందర్యాన్ని చూసి మోహితురాలైనది. కాని, రాజుదృష్టి ఆమెవైపుకు మరలనేలేదు. రసాలూ తన దారిన తాను పోసాగాడు. శౌంకనీ ఎంతో దుఃఖితురాలై యిలా అంది:

> చన్నన్ చీరా, చిఖ్ బహాఁ పూర్ లగావాఁ అగ్గ
> వే సోహనే పరదేసియాఁ, మై మరాఁతేరే గల్లలగ్గ!

[గంధపు కట్టెలు పేర్పించి నేను ఆ చితిపై కూర్చుంటాను. దానికి నిప్పు అంటిస్తాను. ఓ సుందరమైన పరదేశీయుడా, నేను నిన్ను ఒక్కసారి కౌగలించుకొని చనిపోతాను.]

ఇంతటి ప్రేమ కూడా రాజును నిలువలేకపోయింది. అతను ఒక రకంగా యోగసిద్ధిని సాధిస్తున్నాడు. అతని నోటినుంచి "మీరు సుఖంగా నివసించండి; యోగి విరాగిగా వ్యవహరిస్తాడు" అని వెలువడింది.

అక్కడినుంచి రాజు వెళ్ళగా వెళ్ళగా అటక్‌వద్ద నదీతీరం దగ్గిరున్న సిరీకోట చేరాడు. దాని రాజుపేరు సిరకప్. ఈ రాజుకు ఒక విచిత్రమైన సరదా ఉంది. అతను దారినపోయే బాటసారులు, పరదేశీయుల శిరస్సులను పందెంగా ఒడ్డి వారితో చదరంగమాడేవాడు. వారిని కపటపు ఎత్తులతో ఓడించి వారి శిరస్సులను నరికివేసేవాడు. రాత్రివేళ రాజు రసాలూ ఈ నగరానికి చేరాడు. అతని గుఱ్ఱం గిట్ట

ఒక అస్థిపంజరానికి తగిలింది. ఈ నగరపు మార్గంలో శవాలు పడి ఉన్నాయి. ఇది క్షేమకరం కాదు అని అతను తలంచాడు. రాజు ఇది జూదగాడైన సిరకప్ నగరమని కూడ తెలుసుకున్నాడు. అరచేత ప్రాణాల్ని ఉంచుకొని అతను ప్రయాణం సాగిస్తున్నాడు. సిరకప్‌తో చదరంగపు పోటీ ఆడడానికి మనస్సులో గట్టి నిర్ణయం చేసికొన్నాడు. తెల్లవారగానే రాజు రసాలూ రాజ భవనంవైపు వెళ్ళాడు. ఇంత అందమైన గుఱ్ఱపు రౌతు ఆ నగర రాజునకు బలిపశువుగా ఉప యోగ పడవలసి వస్తుంది, అని గ్రహించి పట్టణవాసులు ఎంతో మధనపడ్డారు. ఒక అందమైన యువతి సాహసంతో గుఱ్ఱం కళ్ళాన్ని పుచ్చుకొని యిలా అంది.

నీవే ఘోడే వాలియా రాజా, నీవే( నేజే( ఆ,
అగ్గే రాజా సిరకప్పహై, సిర్ లైసో ఓహ లాహ
భలా చాహే( జే ఆపనా, తా( పిచ్ఛే ముడ్‌జా।

[నీలిరంగు గుఱ్ఱపురౌతా, కొంచెం దగ్గరకురా. ముందుకు సాగితివా సిర కప్ప రాజు ఉన్నాడు. అతను నీ తలను నరుకుతాడు. నీవు నీ క్షేమాన్ని కోరి నచో వెనుకకు మరలి వెళ్ళిపో.]

కాని, రాజు గుఱ్ఱాన్ని గట్టిగా మడమతో తన్నాడు; అది ముందుకు పరిగెత్తింది. నగరవాసులు రాజా రసాలూయొక్క సౌందర్యాన్ని చూసి ఎంతో జాలి చెందారు. ప్రతివారు తమ తమ బుద్ధిబలం ననుసరించి రాజును చదరంగంలో ఓడించే మటుగులను చెప్పారు. అతని క్షేమాన్ని కోరుతూ కొంతమంది మంత్రా లను చదివారు; మరికొందరు దేవుణ్ణి ప్రార్థించారు; ఒకడు ఎంతో ప్రేమతో పెంచిన తన పిల్లిని రసాలూ జేబులో ఉంచి యిలా అన్నాడు:

[ఓ అమాయకపు రాజా, ఆగు, నా ఈమాటను విని వెళ్ళు. నీకు ఎక్కువ కష్టాలు ఎదురయినప్పుడు నీ కుడిచేతిని పైకెత్తి దాన్ని నీ జేబులో వుంచితే ఎటువంటి కష్టాలైనా తొలగి పోతాయి.]

రాజా రసాలూ సిరీకొట రాజ భవనం దగ్గిరకు వెళ్ళి ఎలుగెత్తి పిలిచాడు. ఈరోజు నీతో ఒకాయన పాచికల ఆట ఆడడానికి వచ్చాడు వెంటనే రాజ భవ నపు సింహద్వారం వద్ద పధ్నాలుగు భేరీలు మ్రోగాయి. రాజును సవాలుచేసి మనిషి భేరీలు వాయించి పాచికల ఆటలో పోటీ చేస్తానని రాజుకు తెలియజేయాలి. ఒక్కసారి వాటిని వాయించినచో అవిరామంగా అవి తమంత తామే ప్రతిధ్వ

నిస్తాయి. అదేపనిగా గట్టిగా మ్రోగే ఆభేరీల ధ్వని వినేవారి బుద్ధిని చికాకు పెట్టేటట్లు ఆ భేరీలు తయారు చేయబడ్డాయి. బుద్ధి చాపల్యం చెందిన మనిషి పాచికల ఆట పోటీలో ఎలా గెలుస్తాడు? ద్వారపాలకుడు రసాలును భేరీపై దెబ్బ కొట్టమని చెప్పాడు. అతను ఒక భేరీమీద దెబ్బకొట్టి రెండవ భేరీమీద అంత గట్టిగా కొట్టాడు. ఇలా భేరీలన్నీ బ్రద్దలై పోయాయి. ఇక వాటినుండి ప్రతిధ్వని రావడం ఆగిపోయింది.

సింహద్వారం ముందు సిరకప్ప దెబ్బదిమంది కుమార్తెలు కూర్చుని ఊగే ఉయ్యాల ఉంది. ఆ ఉయ్యాల లోనికి వచ్చేవారి మనస్సును చలింప జేస్తుంది. అందమైన రాచకన్యలను చూసేసరికి ఏకాగ్రత నశిస్తుంది. యువరాణులు రసాలుతో "మా ఊయలను ఒక్కసారి ఊపివెళ్ళు" అన్నారు. రాజు "మిమ్మలను ఒక్కొక్కరిగా ఊపే సమయం నాకు లేదు. అందుచేత అందరినీ ఒక్కసారిగా ఊపగలను!!" అన్నాడు. దెబ్బదిమంది రాచకన్యలు ఒక్కసారిగా ఉయ్యాలపై ఎక్కారు. అతను ఉయ్యాల త్రాడును పుచ్చుకొని గగన వీధుల్లోకి పోయేటట్లుగా గట్టిగా ఊపివేశాడు. పైకివెళ్ళి క్రింది భాగమునకు వస్తున్న ఉయ్యాల త్రాడును తన కత్తితో నరికాడు. ఉయ్యాల మధ్యలోనే తెగిపోయింది. ఆ అమ్మాయిలు దబ దబా నేలపై పడిపోయారు. అంతా గాయపడ్డారు. రసాలూ దర్బారు భవనంవైపు వెళ్ళాడు. అతను అక్కడకు చేరేముందే భేరీలు బ్రద్దలు కావడం, రాజ కుమార్తెలు గాయపడడం రాజుకు తెలిసింది. ఇక రాజా రసాలూ ఖంగారుపడలేదు. సిరకప్ప గంగవెర్రులెత్తాడు అతని ఏకాగ్రత అంతా తల క్రిందులైంది. ఇరువురూ పాచికల ఆటకి కూర్చున్నారు. సిరకప్ప యిలా ఉద్ధరించాడు:

ఓ వేదే నిమ్యే చారణ చౌపడ
రాజే ఖేడన దో
ఆ నీ మాతా హోణియే! తూ మేరే వల్లహో
హుకమ్ జో సచ్చే సాహబ్‌దా నరదా! మన్ననసో.

[దీపాల మసక వెలుతురులో ఇరువురు రాజులు చదరంగం ఆడుతున్నారు. ఓ నర్దీ హోణీ, నీవు నాతో సహకరించు: సిరకప్పరాజు ఆజ్ఞను పాచికలు కూడ అంగీకరిస్తాయి.

సిరకప్ప పాచికలు వేయడానికి సిద్ధంగా వున్నాడు. రాజా రసాలూ అన్నాడు. "రాజా, నీ ఆట ప్రారంభమే అపశకునాలతో జరిగింది. అన్ని పనులూ భగవంతుని పేరిట ప్రారంభం కావాలి" అని.

పాచికలు ఆడేటప్పుడు రాజు సిరకప్ప తన కుడివైపు ఎడమవైపులందు తన రాణిని, ఒక కుమార్తెను కూర్చోపెట్టుకున్నాడు. వాళ్ళిద్దరు తమ సౌందర్యపు వారచూపులు హావ భావాలతో పాచికలు ఆడేవారి దృష్టి తమవైపు ఆకర్షిస్తారు ఆటగాడు రాణివైపు చూస్తూవుంటే రాజకుమార్తె పాచికలను తలక్రిందులను చేస్తుంది. రాకుమారి వ్యామోహంలో పడి అదేపనిగా ఆమెవైపు చూస్తూ ఆటగాడు ఉండిపోతే రాణి పాచికల్ని మార్చివేస్తుంది. కాని రాజా రసాలూ ముందు వారి ఆటలు సాగలేదు. అతనిలో యోగికి ఉండే దీక్ష, నిగ్రహం, ఏకాగ్రత వుంది. సౌందర్యంలో అతను రాణి, రాజకుమార్తెలను తలదన్నాడు. పాచికల పందెం ప్రారంభమైంది. ఎవరి ఎత్తుగడలు సాగలేదు. రాజా రసాలూ అచంచలంగా ఆటకి కూర్చున్నాడు. రాజు సిరకప్ప మొదటి ఆట ఓడిపోయాడు.

రెండో ఆట ప్రారంభమయింది. రాణి, రాజకుమార్తె తమ ఆట సాగక ఓడిపోయినందుకు విచారిస్తూ అక్కడినుంచి లేచి వెళ్ళిపోయారు. వారికి బదులు ఆటలో రకరకాల చిక్కుల సమస్యలను ప్రవేశపెట్టే ఆటగాళ్ళు వచ్చి కూర్చున్నారు. రసాలూ ఆటలో ఏదో వ్యూహం యోచిస్తే వారు ఆటలో ఏదో చిక్కును తెచ్చి పెట్టేవారు. మొదటివారు ఒక సమస్య ప్రవేశపెట్టి దానికి సమాధానం అడిగారు సమస్య ఇది:

అఠ్ పత్తన్ నౌ బేడియాఁ, చౌదహ్ ఘుమ్మన్ ఘేర్
జేతూఁ రాజా జతీ సతీ తాఁ పానీ కితనే సేర్।

[ఎనిమిది రేవులు, తొమ్మిది నదులను దాటించే పడవలు, నదిలా పధ్నాలుగు సుడిగుండాలు ఉన్నాయి. రాజా రసాలూ! ఆ నదిలో ఎన్నిసేర్ల నీళ్ళున్నాయో చెప్పు ]

రాజా రసాలూ ఆటలో చిక్కును ఒక్కసారిగా పరిష్కరించి సమస్యా పూరణం కూడా ఇలా చేశాడు:

అఠ్ పత్తన్ నౌ బేడియాఁ, చౌదహ్ ఘుమ్మన్ ఘేర్

అంబర్ తారేగిన్ దస్సీ, మైఁ దస్సాఁ పానీ ఉతనేసేర్
జిస్నీ జంగల్ లకడీ, పానీ ఉతనేసేర్।

[ఎనిమిది రేవులు, తొమ్మిది పడవలు, పన్నెండు సుడిగుండాలు ఉన్నాయి. నిజమే ఆ నదిలో నీరు ఆకసంలోని నక్షత్రాలు లెక్కిస్తే ఎన్ని వుంటాయో నదిలో అన్నిసేర్ల నీళ్ళుఉంటాయి. అరణ్యంలో ఎన్ని కట్టెలు ఉంటాయో అన్ని సేర్ల జలం నదిలో ఉంటుంది.]

ఒకదాని తర్వాత మరో సమస్యా పూరణం రాజా రసాలూను చేయమనే వారు. రసాలూ వారి సమస్యకంటె అతి చిక్కుతో కూడిన సమాధానం చెప్పే వాడు. వారు ప్రవేశపెట్టే సమస్యలన్నీ నిరర్థకం కావడం చూసి వారికి తమ శిరస్సులు ఉంటాయా, ఉండవా? అన్న చింత కలిగింది. ఆట స్థలంనుంచి నెమ్మదిగా జారి అవతలకు పోవడం అన్ని విధాలా క్షేమమని తలంచారు. సిరికప్ప రెండో ఆట కూడ ఓడిపోయాడు.

ఇక చివరి ఆట మిగిలింది. సిరికప్పవద్ద ఇక ఒకేఒక ఎత్తుగడ మిగిలి వుంది. ఆట ప్రారంభమైంది. సిరకప్ప తాను శిక్షణ యిచ్చిన రెండు చిట్టెలుకలను బయటకు తీశాడు. అవి పాచికలపైనుండి పరుగులు తీస్తూ ఆటను తల క్రిందులు చేస్తాయి. రసాలూ ఆటలో వేసే ఎత్తులు ప్రతికూలంగా మారుతున్నాయి. సంయోగవశాత్తు ఎవరో తనకు ప్రియమైనవారు చెప్పిన మాటలు జ్ఞాపకం వచ్చాయి:

రహూర్ వే రాజా భోలియా, సాడీ ఐసీ గల్ల సున్ జా,
జదోఁ వాడీ భీడా ఆబనే, తేరీపేశ్ నా జావేకా
దాహినా దస్త ఉతాయీకే అసనీ జేబ్ చపా।

రాజా రసాలూ తన కుడిచేతిని జేబులో ఉంచాడు. జేబునుండి ఒకపిల్లి బయటకు వచ్చింది దానిని చూసి సిరకప్ప చిట్టెలుకలు పరుగు పరుగున పోయి తమ బిలాలలో దాక్కున్నాయి. పాచికల ఆట రసాలూకు అనుకూలంగా మారింది. సిరికప్ప ఖంగారు పడిపోయి ఇలా అన్నాడు

ఢర్ వే పాసే ఢాల్ వేఁ, ఇద్దేబ సంతాలోక్
సిరాఁ ధడాఁ దీయాఁ బాజీ అఁ, జేహడీ సిరకప్ప
కరే సోహోగ్।

[ఓ పాచికల్లారా- దొర్లిపొండి! మనుష్యులున్నారు. మొండెములనుంచి శిరస్సులను తొలగించే పందాలు జరుగుతున్నాయి. ఇక అంతా భగవంతునిదే భారం. ఆయనకేది ఇష్టమో అదే జరుగుతుంది ]

సిరకప్ప రాజు తన శిరచ్ఛేదన పందెంలో కూడ ఓడిపోయాడు. సరిగా అదే సమయంలో ఒక మనిషి వచ్చి సిరకప్ప రాజుగారింట్లో ఒక అమ్మాయి పుట్టిం దని శుభవార్త వినిపించాడు. సిరకప్ప రాజు ఈ వంశ నాశనం చేసే పిల్లలను తక్షణం చంపివేయమని ఆజ్ఞ జారీ చేశాడు. కాని రాజా రసాలూ ఆటలో శిరస్సును పందెంగా ఒడ్డి ఓడిపోయినవాడు మరొకరి శిరస్సును ఛేదించమని ఏ విధంగా ఆజ్ఞను జారీ చేయగలడు? ఈ రాకుమారిని నేను నావెంట తీసికొని పోతాను" అన్నాడు.

రాజా రసాలూ ఇప్పటికి వివాహ బంధనంలో బందీ కాదలచుకోలేదు. ఈ నాడు పుట్టిన బాలిక యౌవ్వనవతి అయ్యేవరకు అతను హాయిగా స్వతంత్ర జీవితం గడపవచ్చు. రాజా రసాలూ సిరకప్ప శిరచ్ఛేదం చేయకుండా ప్రాణా లతో విడిచి పుచ్చాడు. కాని ఒక షరతు పెట్టాడు. ఇక ముందెన్నడూ అతను పాచికలతో జూదం ఆడకూడదని. రాజ భవనంలో ఎంతోసేపు కూర్చొని వుండడం వల్ల అతనికి ఊపిరి సలపడంలేనంత బాధ కలిగింది. అతను ఆరుబయటకు వచ్చి నిలబడ్డాడు. అతను బందీ గృహంవైపు నెమ్మదిగా సాగి వెళ్ళాడు. అతణ్ణి చూసి ఖైదీలంతా ఒక్కసారిగా ఇలా గోల చేశారు.

హోర్ రాజే ముర్గాబియాఁ. తూ రాజా శాహబాజ్
బందీ వానాఁదే బంద్ ఖలాస్ కర్ తేరోఉమ్రదరాజ్.

[యితర రాజులంతా నీటికోళ్ళలాంటివారు. నీవు మహారాజువే కాదు. నీటికోళ్ళను వేటాడే శక్తివంతమైన డేగలాంటి వాడవు. నీవు ఖైదీలకు బంధ నాలనుంచి ముక్తిని కలిగించు. నీవు దీర్ఘాయుష్మంతుడ వవుదువుగాక.]

రాజా రసాలూ తన చేతులతో బందీగృహం తలుపులను తెరిచాడు. ఖైదీలు పరమానందంతో రాజా రసాలూను మనసారా ఆశీర్వదిస్తూ బయటకు వెళ్ళి పోయారు. అక్కడనుంచి రసాలూ భేడీ మూరతీ పర్వతాలవైపు వెళ్ళాడు. అక్కడ అతను ఒక మహలును కట్టించాడు. మహలు ఎదుట ఒక మామిడి మొక్కను నాటాడు. "ఈ మామిడిమొక్క పెద్దదై పూత పూసేసరికి రాజకుమారి కోకలాఁ నిండు యౌవ్వనవతి అవుతుంది. అప్పుడు నేను ఆమెను వివాహం

చేసికొంటాను" అన్నాడు రాజా రసాలూ.

రాజా రసాలూ నిలకడగా గృహంలో ఎన్నడూ కూర్చోలేదు. అతనికి వేటనుంచి తీరికయే లేదు. ఎప్పుడయినా కాస్తసమయం దొరికితే ఏదో ఒక ప్రమాదకరమైన పని తలపెట్టేవాడు.

మామిడిచెట్టు పెద్దదయింది; వసంతంలో తొలిపూత పూసింది; కోకలాం యౌవ్వనవతి అయింది. అయినా అతనికి ఆ ధ్యాసేలేదు. రాజా రసాలూ సత్య నిష్ఠాపరుడైన రాజయోగి. అతని మహలులో కోకలాం తప్ప మరొక రాణి ఎవ్వరూ ప్రవేశించలేదు. పాపం! కోకలాం తన వయస్సులో వున్న యువకునితో కాని, యువతితో కాని మాట్లాడి ఎరుగదు! రాజా రసాలూ నరనరంలో మహత్తర శక్తి నిరాటంకంగా ప్రవహించి వరదవలె పరవళ్ళు త్రొక్కుతోంది తన శక్తిముందు అతనికి కోకలాం యౌవ్వనంకూడా బాల్యంలా గోచరిస్తుంది. దాని ప్రతిఫలం రాజా రసాలూ రాణి మధ్య ప్రేమ కలుగలేదు. వారిరువురూ. కలసి ఎన్నడూ కూర్చోలేదు; ఒకరు మరొకరితో మాటలాడుకొనలేదు. ఇరువురు ఒకరికి మరొకరు పరాయివారుగా ఉండిపోయారు.

ఒకరోజు రాజా రసాలూ వేటకై వెళ్ళాడు. అతడు వెళ్ళిన తరువాత మరొక రాజు వేటాడుతూ అతని మహలువైపు వచ్చారు. కోకలాం మేడపైనుంచి ఒంటరిగా చుట్టుప్రక్కలనున్న ఉద్యానవనాల సౌందర్యం చూస్తూ నిలబడి ఉంది. మేడక్రింద ఒక అపరిచితుణ్ణి చూసి ఇలా అంది:

మహలాం హేఠ్ ఫిరందియా, సాధ్ ఫిర్ కే చోర్

[మహలు క్రింద సంచరించే ఓ మనిషీ, నీవు సన్యాసివా లేక దొంగవా?]

క్రిందినుంచి రాజు ఇలా అన్నాడు:

చోరాం మైలే కపడే, సాధాం నవేం నకోర్।

[దొంగల బట్టలు మురికిగా ఉంటాయి, సన్యాసుల బట్టలు ఎల్లప్పుడూ నూతనంగా ఉంటాయి.]

క్రింద నిలబడి వున్న రాజు హోడీ. అతను కోకలాం నిండు యౌవ్వనాన్ని ఒక్కసారిగా కళ్ళారా చూసి ఆమెపై సమ్మోహితుడయ్యాడు. అతని నోటినుంచి అప్రయత్నంగా ఈ శబ్దాలు వెలువడ్డాయి.

అల్లేయాం దాఖాం పక్కియాం చో చోస్సైన్ అనార్,

[పచ్చి ద్రాక్షపండ్లు చక్కగా పండాయి; దానిమ్మపండ్లు రసంతో నిండి పోయాయి ]

కోకలాఁ అప్పటికీ తన నిత్యనిష్ఠలో దృఢంగా నిలిచింది ఆమె ఇలా అంది.

ఐసా కోయీ న జమ్మియా జో ఆవే రాజేదే దరబార్

[రాజా రసాలూ దర్బారులో ప్రవేశించగలవాడెవ్వడూ ఇంతవరకు పుట్టలేదు.]

హోడీ మహలులోకి వెళ్ళదలిచాడు. సింహద్వారం దగ్గిర పర్వతమంత పెద్ద రాయి అడ్డంగా పడివుంది. దానిని జరిపి రసాలూ మహలులోకి ప్రవేశించ దలచాడు. హోడి తన బలాన్నంతా ప్రయోగించాడు, కాని ఆ రాతిబండ కొంచెమైనా కదలలేదు. హోడీ పక్షినై కోకలాఁ చెంతకు చేరాలనుకున్నాడు కాని ఇది అతని శక్తికి మించిన పని. అతను ఆమెతో పైనుంచి క్రిందికి ఒక మోకును వ్రేలాడవేయమని చెప్పాడు. చివరకు ఆమె కరిగిపోయింది. ఆమె ఎంతోకాలంనుంచి ఒంటరిగా ఉంటూ ఎవరితోనైన మాట్లాడాలని ఆతురత పడు తూంది. ఆమె క్రిందికి మోకును వేసింది. హోడీరాజు పైకి ఎక్కి వచ్చాడు. ఇక పాపం. కోకలాఁ తన సత్య నిష్ఠను కాపాడుకొనలేకపోయింది. రసాలూ అడవుల్లో వేటాడుతూ, కాలం గడుపుతున్నాడు, ఇటు కోకలాఁ రంగ మహలులో భోగ విలాసాలతో గడుపుతూ ఉంది.

మరుసటి రోజున హోడీరాజు బయలుదేరగా ఆమె విలపించసాగింది హోడీ ఆమె కన్నీళ్ళను తుడిచాడు. ఆమె కళ్ళకు పెట్టుకున్న కాటుక అతని చేతికి అంటుకొంది. "నేను త్వరలోనే తిరిగి వస్తాను. నేను నీకు దూరంగా వున్నంత వరకు నా చేతికి అంటిన నీ కళ్ళ కాటుకను చెరగనివ్వను, ఈ చేతితో తినను. ఈ చేతితో త్రాగను. ఈ చేతిని కడుగను; ఈ చేతితో ఏపనీ చేయను" అని రాజు ప్రమాణం చేశాడు.

రాజా రసాలూ తిరిగి వచ్చాడు. రాణి నడపడిక అంతా అదో తరహాగా ఉండటం చూశాడు. జుత్తు విడిపోయివుంది. మెడలో హారం తెగి ఉంది; పాన్పు అంతా చిందరవందరగా ఉంది. అంతట అతను ఇలా అన్నాడు:

కిన్న మేరా ఖూహా గేడియా, రానీ కిసనే భన్నీ సపార్

ఘడియోఁ పానీ కిస్ ల్యా కిస్ సుట్టే ఖందార్
కౌన్ మహలాఁ విచ్ దౌడియా మహలీ ఏయియా ధపకార్
సేజ్ మేలీ కౌన్ లేటియా ఢిల్లీ పయీ నివార్

[నా బావిని ఎవరు నడిపారు? ఎవరు పాడు చేశారు? కుండలో ఎవరు నీళ్ళు నింపారు? ఎవరు దానిని మలినం చేశారు? మహలులో ఎవరు పరుగెత్తారు? పాదాల అలికిడి గట్టిగా వినపడింది. నా మంచంమీద ఎవరు పడుకున్నారు? మంచం నవారు వదులయింది.]

రాణి ఒకటి రెండురోజులలోనే గొప్ప మేధావిగా మారింది. ఆమె తన చాతుర్యంతో సమాధానం యిలా యిచ్చింది.

"మైఁ నేహీ వాఁ చలాయా, మై నేహీ నిసార్ తోడీ
ఘదే మేఁసే పానీ మైఁ నేహీ లియా, మైఁ నేహీ దూల్ డాలే
మైనా నే ముడియాఁ ఖోరీ హై తోతేనేహార్ తోడా హై
మై బావలీ హోకర్ భాగీథీ జిససే మహల్ కాపర్షే

[ఇవన్నీ నేనే చేశాను. ఇలా జరగటానికి కారణం నేనే.]

రాజా రసాలూ ఆ సమయంలో మౌనం వహించాడు. కాని అతని మనసులో సందేహం అంకురించింది. అతనికీరోజు అతని రాణియే కట్టిన బట్టలను విడచి నగ్నంగా తనవైపు వస్తూ ఉన్నట్లనిపించింది. ఆమె యౌవ్వనంలో ఏదో దివ్యాగ్ని రగులుతూ ఉంది. మరుసటిరోజు ఉదయం పెందరాళే అతను వేటకై బయలుదేరాడు, కాని యిప్పుడు అతని ఏకాగ్రత భంగమైపోయింది. బాణాలు గురి తప్పుతున్నాయి. అతని చెప్పులలో ఏదో రాయి మరుగున పడివున్నట్లని పించింది. ఏదో అజ్ఞాత శత్రువు అతనిలో ప్రవేశించినట్లయింది అతను ఆ రోజు మధ్యాహ్నానికే తిరిగి వచ్చాడు. మూడవ ఝూమున తన మహల్ దగ్గిరకు వచ్చాడు. ఒక వ్యక్తి తాడు సహాయంతో మహల్‌పైనుండి క్రిందికి దిగుతున్నాడు. కోకలాఁ మేడపై నిలబడి అతనికి వీడ్కోలు చెబుతూ వుంది. అది చూసి రాజా రసాలూ తోక త్రొక్కిన త్రాచులా మండిపడ్డాడు. అయినా, అతను మనస్సుని రాయి చేసుకుని అతణ్ణి కవ్వించి పిలిచాడు. హోడీరాజు, రాజా రసాలూ ఒకరి ఎదుట మరొకరు నిలబడి వున్నారు. ఈవేళ వంతు నీదిగాన ముందు బాణం వేసే అవకాశం తీసుకో అన్నాడు రసాలూ. హోడీరాజు బాణం విడిచాడు. కాని

ఇప్పుడిప్పుడే రతి సల్పి పాన్పునుంచి లేచివచ్చిన కారణంగా అతని బాణంలో ఏమీ బలంలేకపోయింది. రసాలూ ఆ బాణాన్ని విదిలించి దూరంగా విసరివేశాడు. "కాస్త విశ్రాంతి తీసుకో, మరొక అవకాశం ఇస్తున్నాను. మరొక బాణం వెయ్యి" అన్నాడు. హోడీ మరొక బాణం వేశాడు. దాన్నికూడా రసాలూ తన డాలుతో నెట్టివేశాడు. రసాలూ ఏకాగ్రత పూర్తిగా పుంజుకుంది. అతనిది చెక్కుచెదరని నిగ్రహం. అతను ఒకేదెబ్బ గట్టిగా కొట్టాడు. హోడీ రెండు ముక్కలై క్రింద పడ్డాడు.

కోకలాం మేడమీద నిలబడి చూస్తూ ఉంది ఇక నాకు ఆఖరి ఘడియ సమీపించిందని ఆమె గ్రహించింది. రంగమహల్ బురుజునుంచి క్రిందికి దూకింది. రసాలూ తన చేతులతో హోడీ కోకలా శవాలను తన గుఱ్ఱముపై గట్టిగా కట్టి గుఱ్ఱాన్ని అరణ్యంవైపు తరిమివేశాడు. తన గుఱ్ఱానికి వీడ్కోలు చెబుతూ అతను "మిత్రమా ఫౌలాదీ నీకు, నాకు యింతటితో స్నేహం ముగిసింది. నేటినుంచి నేను నా జీవితాన్ని మార్చుకోవాలసి ఉంది" అన్నాడు బరువెక్కిన హృదయంతో

రాజా రసాలూకు తల్లిదండ్రులు జ్ఞాపకం వచ్చారు. అంతేకాదు, పెండ్లిమధ్య విడిచివచ్చిన యువతికూడా గుర్తుకు వచ్చింది. సియాల్‌కోట అతణ్ణి బిగ్గరగా ఎలుగెత్తి పిలుస్తూ ఉన్నట్లనిపించింది. అతను నిర్మానుష్యంగా వున్న తన మహల్ సింహద్వారం ఎదుట పర్వతంలా పడివున్న పెద్ద రాతిబండను జరిపి దూరంగా త్రోసివేశాడు. ద్వారం తలుపులు తెరిచాడు. తర్వాత ఒక్క క్షణం కూడ ఆగకుండా తన నగరం వైపు మరలిపోయాడు.

# దుల్లా భట్టీ

—బంపంత్ గార్గీ

అది అక్బరు చక్రవర్తి పరిపాలించు కాలం. లాహోరు నగర సమీపంలో సాందలబార్. రాజ్యంలోని ముస్లిం భట్టీ రాజ పుత్రులు చక్రవర్తికి కప్పము చెల్లించడం మానివేశారు. చివరకు విసిగెత్తి మొగలాయి సైన్యాలు వారిపై దాడి చేశాయి. సర్దారు ఫరీదు అతని తండ్రిని మొగలు సైనికులు బంధించి తీసికొని పోయారు. చేతులు వెనుకకు కట్టి అక్బరు ఎదుట వారిని హాజరు పరిచారు.

అక్బరు చక్రవర్తి వారిని కొన్ని ప్రశ్నలు వేయగా ఫరీదు ఆత్మాభిమానంతో ప్రశ్నలకు సమాధానం చెప్పడమే గాక మొగలాయీలను నానా దుర్భాషలాడాడు. చక్రవర్తి మండిపడ్డాడు. "వధకుల్లారా! ఈ దేశద్రోహుల శిరస్సులను నగరికోటగుమ్మానికి వ్రేలాడదీయండి, వీరి చర్మం ఒలిచి కళేబరాల్లో ఊకను నింపండి" అని ఆజ్ఞ జారీ చేశాడు.

వధకులు తండ్రీ కొడుకులిద్దర్నీ వధించారు. ఆ సమయంలో ఫరీదు భార్య అయిదు నెలల గర్భవతి ఆమె పేరు లద్ధీ. నాలుగు నెలలు గడిచాయి ఒక నాడు ఆదివారం రోజున ఆమెకొక కుమారుడు కలిగాడు. అతనికి దుల్లాయని పేరు పెట్టారు.

దుల్లాముఖం కాంతివంతమైంది; వెడల్పయిన ఛాతీ, ఆకర్షణీయమైన కళ్ళు. దాది ఆ బాలుని అందం చూసి నివ్వెరపోయింది. అతని శిరస్సు చూసి "పరాక్రమశాలి, వీరుడుయైన ఈ బాలుడు తన తండ్రికి జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకుంటాడు" అంది.

తల్లి సంతోషించి తన కుమారుని శిరస్సుపై బంగారు నాణాలను దిష్టితీసి పారవేసింది, అయినా ఆమె హృదయం అజ్ఞాత భయంతో కంపించింది.

అదే రోజున అక్బరు చక్రవర్తి అంతఃపురములో కూడ యువరాజు జన్మించాడు. అతనికి చక్రవర్తి షేఖూ అని నామకరణం చేశాడు. అతనే తర్వాత

జహంగీరు పేరిట చరిత్ర ప్రసిద్ధినందాడు. అతని కుమారుడు న్యాయప్రియుడు, శూరుడు, వీరుడు కావాలని చక్రవర్తి కోరేవాడు. జ్యోతిష్కులు గ్రహ నక్షత్రాలను లెక్కించి మహాప్రభూ! తమరు మొదట దానాలు, పుణ్యకార్యాలు చేయండి. ప్రజలపట్ల దయను చూపండి. తరువాత తమ రాజ్యంలో ఒక రాజపుత్రుని తల్లిని అన్వేషించండి. షేఖూ పుట్టిన రోజునే ఆమెకు కుమారుడు కలిగి వుండాలి. యువరాజు అలాటి తల్లి పాలు త్రాగి పెద్దవాడయినచో పరాక్రమశాలిగను, విజేతగను రూపొందుతాడు అని విన్నవించారు.

చక్రవర్తి అన్వేషణ జరిపించాడు. ఒక సాధుబాబా దర్బారులోకి వచ్చి అన్నాడు. "చక్రవర్తీ! ఫరీద్ భట్టీని చంపించావు. అతని భార్య లద్ధీ నిండు యౌవ్వనవతి; సబల; పురుషులవలె మంచి సాహసవంతురాలు కుడా. మీ యింటిలో ఆదివారంనాడు షేఖూ జన్మించాడు అదే రోజున ఆ మెయింట ఆమెకు ఒక కొడుకు పుట్టాడు". ఈ మాట విని చక్రవర్తి ఎంతో సంతోషించాడు. అతను ఆ వీరమాతను తన యింటికి పిలిపించడానికి బదులు షేఖూను సైనికుల సహాయంతో ఆమె దగ్గరకు పంపించాడు. లద్ధీకి యువరాజును పోషించే బాధ్యత అప్పగించారు. ఆమె నివాసానికి ఒక అందమైన భవనం కట్టించారు. షేఖూ దుల్లా యిరువురు బాలురు లద్ధీ పాలుత్రాగి అన్నదమ్ములవలె పెరిగి పెద్దవారయ్యారు, వారిరువురు కలసి కుస్తీ పట్టేవారు. బాణాలు వేసేవారు. గుఱ్ఱపు స్వారీ చేసేవారు; కాని ఈ ఆటలన్నింటిలో దుల్లా ఎప్పుడూ షేఖూకంటె మిన్నగానే వుండేవాడు. ఇరువురు బాలురకు పన్నెండేళ్ళ ప్రాయం వచ్చింది. అక్బర్ షేఖూ దుల్లాలను దర్బారుకు పిలిపించాడు. పెద్ద మైదానంలో డేరా వేయించమని ఆ మైదానంలో యిరువురి విలువిద్య పరీక్షజరగాలని ఆజ్ఞ యిచ్చాడు. నగర ప్రజలంతా ఈ పోటీని చూసేందుకు మైదానానికి చేరారు. గురువులు ఏవిధమైన భ్రమ, సందేహం కలుగకుండా రెండు రంగుల బాణాలను ఇద్దరకు యిచ్చారు. షేఖూ బాణాలు గురితప్పి పడుతున్నాయి. కాని దుల్లా బాణాలు లక్ష్యాన్ని ఛేదిస్తున్నాయి. గుఱ్ఱపుస్వారీ, కత్తిసాము పోటీలు ఇరువురిమధ్య జరిగాయి. ప్రతి పర్యాయం దుల్లానే విజయలక్ష్మి వరించింది.

చక్రవర్తి ముఖంలో ఉదాసీనత తాండవించింది; అతను నిరాశచెందాడు. అతను లద్ధీని పిలిపించి అడిగాడు. "నిజంచెప్పు, అసలు ఏమి జరిగింది? మా అబ్బాయి అన్ని సమర విద్యల్లో ఎందుకు ఓడిపోతున్నాడు? నీవు అతనికి నీ పాలు

పట్టావా లేదా? నిజం చెప్పితే సరి, లేకపోతే నీ ప్రాణాలు నిలువునా తీయిస్తాను. లద్ధీ చేతులు జోడించి విన్నవించింది "నేను షేఖూను నా సొంత కొడుకువలె పెంచాను. నా పాలు పట్టాను; కుడి స్తన్యం దుల్లాకు ఇచ్చేదాన్ని! ఎడమ స్తన్యం యువరాజుకు ఇచ్చేదాన్ని ఇదే నేను చేసిన అపరాధం."

చక్రవర్తి కొంచెంసేపు ఆలోచించి అన్నాడు. "నీ అపరాధాన్ని క్షమించాను. ఎందుకనగా నీవు యువరాజును పోషించావు. నేను నీకు బంగారు నాణాలను బహుమతిగా ఇస్తున్నాను. వెళ్ళు; నీవు నీ కుమారుణ్ణి పోషించుకో. అతణ్ణి బాగాచదివించు. పెద్దవాడయిన తరువాత ఇతన్నిదర్బారుకి పిలిపించి జాగీరు యిస్తాను." లద్ధీ గ్రామానికి వచ్చి దుల్లాను ఖాజీవద్దకు తీసుకువెళ్ళింది. ఖాజీగారికి శీరినీ (పాయసం) కానుకగా యిచ్చింది. ఆమె తన కుమారుడైన దుల్లాకు ఇస్లామ్ ధర్మాను సారం విద్య చెప్పుమని. మంచి మార్గంవైపు నడిచేటట్లు చూడమని ఆయన్ని కోరింది.

ఖాజీ పూర్వాచార పరాయన పద్ధతిలో నేర్పుతున్న చదువును చూసి విసిగెత్తి ఒకరోజు దుల్లా ఖాజీని కొట్టాడు. ఆ తరువాత అతను వడ్రంగి దగ్గిరకు వెళ్ళి అతణ్ణి ఒక వంగలకర్ర తయారుచేసి యిమ్మని అడిగాడు. దుల్లాలో నుంచి చురుకుతనం, స్వాభిమానం, బలం ఉన్నాయి. అతను ఊళ్ళో కుర్రవాళ్ళను ప్రోగుచేసి వారికి సర్దారు అయ్యాడు. స్త్రీలు నూతివద్దకు నీటికై వెళుతున్నప్పుడు కుర్రవాళ్ళంతా కలసి వారి కుండలను వంగలకర్రతో బద్దలు కొట్టేవారు. గ్రామంలో దుల్లా, అతని మిత్రులు స్వైర విహారం చేయడం చూసి అక్కడి స్త్రీలంతా విసుగెత్తిపోయారు. వారి ప్రవర్తనకు అపరిమితంగా బాధపడసాగారు.

ఒకరోజు నంవీ మిరాసిన్ అంది. "ఓ అబ్బాయీ! నీవు నిరుపేదల కుండలను పగులగొడుతూ తిరిగితే లాభమేమిటి? నీవు విజంగా శూరుడవు, వీరుడవు అయితే నీ తాత తండ్రులకు జరిగిన అత్యాచారానికి ప్రతీకారం ఎందుకు చేయవు? వెళ్ళు. వెళ్ళి అక్బరు చక్రవర్తిని కవ్వించి పిలువు. అతను నీ తండ్రి శిరసు నరికి ఆ శిరస్సును తన సింహద్వారానికి వ్రేలాడదీయించాడు."

ఈ మాట వినగానే దుల్లా గుండెల్లో ప్రతీకారాగ్ని ప్రజ్వరిల్లింది. స్త్రీలతో చెలగాటం మాని కత్తిని చేతబట్టాడు. రాతౌరుల వీర రక్తం అతని నరాల్లో కళ కెళలాడింది. అతను తిన్నగా తల్లివద్దకు వెళ్ళాడు. కత్తిదూసి "అమ్మా! నిజం

చెప్పు నాతండ్రి ఎలా చనిపోయాడు? నన్ను ఒక స్త్రీ దెప్పిపొడిచింది" అడిగాడు కోపంతో.

తల్లిగుండె జల్లుమంది. ఆమె తన కుమారుని నిప్పురవ్వలు చిందే కళ్ళలో ప్రతీకార జ్వాలల్ని చూసింది. "అమ్మా! నీవు నిజం చెప్పకపోతే నీ శిరస్సును నరికి వేస్తాను. చెప్పు నా తండ్రి ఎలా మరణించాడు? అని మళ్ళీ రెట్టించి అడిగాడు.

వితంతువైన తల్లి విలపిస్తూ జరిగినదంతా చెప్పి అతణ్ణి గట్టిగా ఆలింగనం చేసికొంది. "నాయనా! నిన్ను నేను ఎన్నో కష్టాలకుగురై పెంచి పెద్దవాణ్ణి చేశాను. నాయనా! నీవు చక్రవర్తితో పోరాటానికి తలపడవద్దు." కుమారుని శిరస్సును ముద్దుపెట్టుకుంటూ అంది.

దుల్లా ముక్కు రంధ్రాలు అదిరిపడ్డాయి. అతను కోపంతో "నేను పిరికి వాడిని కాదు. నేను నా తండ్రికి జరిగిన హత్యకు పగ తీర్చుకుంటాను. నాకు నా తండ్రి గుర్తుకు ఏదైనా ఇమ్మని" అడిగాడు.

తల్లి ఇంటి వెనుక భాగంలోని గది తాళం తీసింది. ఆ గదిలో ఆమె దుల్లాను ఒకానొకనాడు దాచి ఉంచింది. దుల్లా లోపలికి వెళ్ళాడు. ఆ గది మూలలో వున్న బరిసెను తీసికొన్నాడు. అది అతని తండ్రిది. అది అగ్నిలా ధగ ధగా మెరుస్తూ వుంది. దుల్లా పగ తీర్చుకుంటాడని తల్లి గమనించింది. ఆమె ఒకవంక భీతి చెందింది. మరోవంక తన వీరపుత్రుణ్ణి చూసి గర్వించింది. గదిలో కత్తులు, బాకులు, పెద్ద పెద్ద బల్లాలు ఉన్నాయి. ఒకవైపు పెద్ద భేరీ వుంది. తల్లి ఆవుపాలు తెప్పించి భేరీపై ఆ పాల చుక్కలను చల్లింది. అంతటితో, ఇల్లంతా ప్రతిధ్వనించింది. ఆ భేరీధ్వని వీధుల్లో, ఇళ్ళ వాకిట్లలో మారు మ్రోగింది. ఆ భీకరధ్వని పన్నెండు క్రోసులదూరం వరకు వినబడింది.

భేరీధ్వని దుల్లా విద్రోహంతో కూడిన వీరోచితపు ధ్వనిగా వుంది. ఒక హంతకుని కవ్వింపు స్వరం అక్బరు మహలు కుడ్యాలకు వెళ్ళి తాకింది. సందల బార్‌లో పదహారేళ్ళ తర్వాత ఈ భేరీ మ్రోగిందని చక్రవర్తికి సమాచారం అందింది. మొగలు సామ్రాజ్యం లోపల ఈ విధంగా ఉద్దండతాపూర్ణ చర్యకు పాల్పడే సాహసం ఎవరికుంది?

దుల్లా అయిదువందల కత్తులు, బరిసెలు, బల్లాలు తన సహచరులకు ఇచ్చాడు. అతను తన తాతగారిపై మొదటి దాడి సాగించాడు. తనతండ్రి శిరస్సు నరక బడినప్పుడు తన మామలు తన తల్లికి సహకరించడానికైనా రాలేదని అతనికి కోపం. దోపిడీవల్ల దొరికే ఏఆస్తిని తనవద్ద ఉంచుకొనని వాగ్దానం చేశాడు. తన తాత మామల పశువులను దోపిడీచేసి తీసికొనివచ్చి తన గ్రామంలోని బ్రాహ్మణులకు, మంగలివారికి పంచి పెట్టాడు. తరువాత దుల్లా సింహంలా సాహసించాడు. చుట్టు ప్రక్కల ఎక్కడైనా దుండగులు బయలుదేరితే దుల్లా వారి ఆస్తుల్ని ఆయుధాలను స్వాధీనం చేసికొనేవాడు. అతని పరాక్రమం దానశీలత ఉదారతా యశః కిరణాలు సుదూర ప్రాంతాలకు వ్యాపించాయి. ఆప్రాంతంలోని యువతులంతా అతనిపై సమ్మోహితులయ్యారు.

దుల్లా హృదయంలో విచిత్రమైన వ్యాకులత, క్రోధాగ్ని మండుతోంది. అతని విద్రోహచర్యల లక్ష్యం దొంగిలించిన ఆస్తులను హస్తగతం చేసికొనడం కాదు. అతను తన ప్రతీకార భావాన్ని ప్రకటించడానికి అది ఒక సాకు మాత్రమే. విద్రోహ పతాకాన్ని గగనవీధుల్లో ఎగురవేసే ఉద్దేశ్యం మొగలాయీలు గత్యంతరం లేక అతనితో పోరుసల్పాలని మాత్రమే.

అతనికి కానుకలు ఇవ్వకుండా అతని మార్గంగుండా ఎవ్వరూ ముందుకు పోలేరు. అతను అలీ అనే వ్యాపారస్థుని అయిదువందల గుఱ్ఱాలను దోపిడీ చేశాడు. మైదా షావుకారుని సంపదలను మోసి తీసికొనిపోయే కంచర గాడిదలను వశపర్చుకున్నాడు. అక్బరు దర్బారుకు ప్రతిరోజు క్రొత్త క్రొత్త ఫిర్యాదులు చేరుతున్నాయి. చివరికి విసిగెత్తి అక్బరు ఒక ప్రత్యేకమైన గూఢచారిని అసలు సమాచారాన్ని తెలిసికొనడానికి పంపాడు.

గూఢచారి జ్యోతిష్కుని వేషంలో దుల్లాగ్రామం చేరాడు. దుల్లా అతణ్ణి ఆదరించాడు. కాని అతను ఒక గూఢచారియని తెలియగానే అతని మీసాలు గడ్డాలు గొరిగి అక్కడనుంచి తరిమి కొట్టాడు. గూఢచారి పూర్తి వివరాలను చక్రవర్తికి వివరించాడు. అక్బరు మండిపడ్డాడు. దుల్లాకు ఇంతటి సాహసమా! ఎవడైతే దుల్లాను బ్రతికియుండగా కాని, అతని శవాన్ని కాని బంధించి తన ఎదుటకు తీసికొని వస్తాడో అతనికి రత్నాలు వజ్ర వైఢూర్యాలు బహుమతిగా నివ్వ బడతాయని రాజు ప్రకటించాడు.

మీర్జా నిజాముద్దీన్ సైన్యాన్ని తీసికొని దుల్లా గ్రామం బయలుదేరాడు. అతని సైనికులు సాందలబార్ గ్రామపు పొలిమేరలో తమ గుడారాలు వేశారు. గ్రామంలో వున్న గూజరజాతి సుందరికూడా యితర నవయువతులవలె దుల్లాను ఎంతో ప్రేమిస్తూంది. ఆమె చాలా తెలివిగలది; చాలా అందగత్తె; చాతురికూడా. పాలు అమ్మే సాకుతో ఆమె సైనిక గుడారాలలోకి వెళ్ళింది. మీర్జా నిజాముద్దీన్ దుల్లాను పట్టుకోవడానికై వచ్చినాడనే రహస్యాన్ని తెలుసుకొని వచ్చింది.

ఈవార్త దుల్లాకు తెలిసినప్పుడు అతడు తన మిత్రుల నందరిని ప్రోగు చేశాడు. అక్బరు సైనికులతో పోరాటానికి అతను తలపడ్డాడు. అతని తల్లి మొగలాయి సైన్యాన్ని ఎదుర్కొనవద్దని ఎంతగానో కోరింది. కాని స్వాభిమాని దుల్లా సాందలబార్‌కు చెందిన భట్టీ రాజపుత్రులు ఎవరిముందు తలవంచడానికి సిద్ధపడరు అనే విషయాన్ని అక్బరు చక్రవర్తికి ఋజువు చేయాలనుకున్నాడు.

యుద్ధం చాలా రోజులు సాగింది. నిజాముద్దీన్ సైన్యం వెన్నుచూపింది.

అక్బర్ తన సైన్యం పరాజయం పొందిందని వినగానే అతను షేఖూకు పెద్ద సైన్యమునిచ్చి దుల్లా శిరస్సును నరికి తీసికొని రమ్మని పంపించాడు.

షేఖూ సైన్యాలు దాడి జరిపాయి. సాందలబార్‌లో మొగలాయిల దుందుభీ భేరీలు మ్రోగాయి. లద్ధీ హృదయం కంపించిపోయింది. ఆమె షేఖూని కూడా పెంచి పెద్దవాణ్ణి చేసింది. ఒకవైపు తన కడుపున పుట్టిన కుమారుడు దుల్లా, మరొకవైపు తన పాలనిచ్చి పెంచిన షేఖూ.

ఇరువురిలో స్వాభిమానంతో కూడిన ఆమె రాజపుత్ర స్తన్యం ఉంది. అందుచే షేఖూ, దుల్లా ఒకరికి మరొకరు లొంగడానికి ఎంతమాత్రం ఒప్పుకోరు.

లద్ధీ నల్లని బట్టలు కట్టుకొని ఒక జోలి వేసికొని షేఖూ వద్దకు వెళ్ళింది. ఆమెను చూసి అతని హృదయం కరిగింది. అతను దుల్లా యిప్పటికైనా తిరుగుబాటు చర్యను విరమిస్తే తన తండ్రియైన చక్రవర్తికి చెప్పి అతని ప్రాణాల్ని రక్షిస్తానని తల్లికి వాగ్దానం చేశాడు.

తల్లి దుల్లాను శాంతిభిక్ష కోరింది. అయినా యిప్పుడు దుల్లా షేఖుల మధ్య రక్తం కాలువలు కట్టింది. అది వారి తాత, ముత్తాత, తండ్రుల రక్తం. అతను తల్లిమాటను అంగీకరించలేదు. షేఖూను కవ్వించి పిలిచి అన్నాడు. "నీవు అక్బరు కుమారునివైతే నేను ఫరీద్ కుమారుడుగా నిన్ను పోరాడటానికి

పిలుస్తున్నాను. నీవు ఒంటరిగా వచ్చి నాతో ద్వంద్వ యుద్ధం చెయ్యి".

యుద్ధం ప్రారంభమైంది. దుల్లా కరవాలం మెరుపులా మెరుస్తూంది. షేఖాలో మొగలాయిల రక్తం ఉరకలు వేస్తోంది. ఒక్కసారిగా అతనిలో వున్న ఆక్రోశం అంతా పైకుబికింది. మొదట పందలాదిసార్లు ఆటల్లో దుల్లాతో పోటీ పడ్డాడు. అప్పుడు దుల్లాయే అతనికంటె మిన్నగా ఉండేవాడు. షేఖా అతనిలో వున్న అతిశయాన్ని తొలగించటానికి గబగబా ముందుకుసాగి ఆక్రమణ జరిపాడు. ఇరువురి కత్తులు మెరుస్తున్నాయి; రక్తం చిందుతూ ఉంది. కాని షేఖా పరాజితం కావడం చూసి మిర్జా నిజాముద్దీన్ అతని సైనికులు దుల్లాపై విరుచుకు పడ్డారు. చివరిదెబ్బ షేఖా కొట్టాడు. అతని బాకు దుల్లా వక్షస్థలంలో దిగింది. రక్తం ఒక్కసారిగా ధారగా ప్రవహించింది.

సాందలబార్ తిరుగుబాటు దారుడు, స్వాభిమాని దుల్లా శాశ్వతంగా కన్ను మూశాడు.

దుల్లా సమరంలో ఓడిపోయాడు. అతను ప్రజాహృదయంలో శాశ్వతంగా అమరుడే. అతని ఆత్మాభిమానపు గేయాలు ప్రారంభమయ్యాయి. అతని వీర గాధలు వ్యాప్తిలోకి వచ్చాయి. అతని గ్రామం పేరు కూడా ఆరోజునుంచి దుల్లేవాల్‌గా మారింది.

# జీ ఊణా మౌడ్

—దిలీప్‌కౌర్ టివాణా

"ఘర్-ఘర్ పుత్త జమ్మదే జీ ఊణా మౌడ్ నా కిసే బన్ జాణా" ఇంటింటా కుమారులు జన్మిస్తారు కాని జీ ఊణా మౌడ్‌లా ఎవ్వరూ కాలేరు.

ఇది పురాతనకాలంనాటి విషయం ఇది కేవలం కాల్పనిక కథ కానేకాదు. ఇరవయ్యో శతాబ్దపు ప్రారంభంనాటి ఒకరోజది. అది ఎండాకాలం. మధ్యాహ్నం తన ప్రచండ ఆ తప తాపాన్ని పతాక స్థాయిలా ప్రదర్శిస్తోంది.

సంగరూర్ జిల్లాలోని మౌడ్ గ్రామంలో ఒక అపరిచిత వ్యక్తి జమీందారు ఖడ్గసింగ్ యిల్లు ఏది అని అడుగుతూ వచ్చాడు

ఆ ఈ యిల్లు ఖడ్గసింహుని యిల్లే, ఇందులో సందేహంలేదు. అయినా ఆ సమయంలో అతను ఇంట్లోలేడు కాని అతని కుమారుడు జీ ఊణాసింగ్ ఉన్నాడు.

అపరిచితవ్యక్తి 'సంత్‌సిరీ అకాల్' అంటూ మంచంపై కూర్చున్నాడు.

నేను అండమాను దీవులనుంచి వచ్చాను........అపరిచిత వ్యక్తి అన్నాడు.

జీ ఊణా పాలు తెచ్చాడు దానిలో విపరీతంగా తీపి కలిపాడు. కిషన్ నీకు కబురు పంపాడు, తమ్ముడూ నీవు నా తల్లికడుపున పుట్టినట్లయితే దోగర్‌ను ప్రాణాలతో విడవవద్దు. వాడిపై పగ తీర్చుకో. అతను నన్ను మోసగించి పోలీసు వాళ్ళకు అప్పగించాడు. అండమాను ద్వీపాంతరవాస శిక్ష వేయించి పంపాడు.

జీ ఊణా ఆ మాట విని గడ్డిపరకతో నేలను గీస్తూ మెదలకుండా వుండిపోయాడు.

నీ సోదరుడు అన్నివిధాలా ప్రపంచానికి వేరైపోయాడు. ఈ వెధవ దోగర్ సుఖ, భోగాలు అనుభవిస్తూ కులుకుతున్నాడు! యావజ్జీవితం కళంకం ఎందుకు చెందాలి అనుకొని సోదరుని కక్ష తీర్చుకొనలేదు. మనిషిలో పౌరుషం లేకపోతే జీవితం వ్యర్థం. అతడు కేవలం పశువుతో సమానం. ప్రపంచంలో పుట్టి ఏం కట్టుకుపోవాలి? కక్ష సాధించాలి! కాని ఇంటిలో స్త్రీలకి ఈ విషయం రవ్వంత

అయినా తెలియకూడదు. స్త్రీలు తమ ఏడ్పు మొరలతో పురుషుణ్ణి శక్తి హీనుణ్ణి చేస్తారు. కిషన్ ఎంతో ఉదాసీనంగా కూర్చుండిపోయాడు. అంతట నేను నీ విషయం మీ యింటిలో చెప్పి నేను నా యింటికి వెడతాను అని అన్నాడు. అతను నా సొంత పినతండ్రి. ఒకనాడు నా తండ్రిని కచేరి చావడిలో నానా మాటలన్నాడు. పన్నెండు గంటల లోపల అదే కచేరీ చావడికి వాడి శిరస్సును నరికి తెచ్చి వ్రేలాడ దీశాను. ఇరవై సంవత్సరాలు ద్వీపాంతరవాస శిక్ష అనుభవించి వచ్చాను. ఈ శిక్ష వల్ల నాకు కలిగే నష్టమేముంది? ఇక ఎప్పుడు ఏ వెధవ తండ్రిని తిట్లు తినిపించి మీరు చేతకాని ఆడవాళ్ళలా గాజులు తొడిగించుకొని యింటిలో కూర్చున్నాడు అని మమ్మల్ని అనలేదు అంటూ అపరిచిత వ్యక్తి చెప్పుకుంటూ పోయాడు ఆవేశంతో.

అదే రాత్రి జీ ఊణా యింటినుంచి బయలుదేరాడు. అతను బందిపోటు దొంగలతో కలిశాడు.

ఆతని తల్లి అహోరాత్రాలు అతనికై దుఃఖించింది. తండ్రి తన నెత్తి పుచ్చుకొని దుఃఖంతో కూర్చుండిపోయాడు. ఇంకా అతను కిషన్ దుఃఖంనుంచి తేరుకోలేదు. సింహంలాంటి యువకుడైన కొడుకును అండమాన్ దీవులకు బండిలో కూర్చోబెట్టి వచ్చాడు. ఇక మరోసారి అతని ముఖంకూడా బ్రతికి వుండగా చూడగలడో లేదో పాపం. పోనీ! ఇక సుఖంగా బ్రతుకుతాను అని అతను యోచించి ఒక్కసారిగా నిట్టూర్చాడు.

కిషన్ కారణంగా అతణ్ణి పోలీసులు రోజూ బాధిస్తున్నారు. ఎన్నో పర్యాయాలు పోలీసులు అతన్ని జీ ఊణాను పోలీసు స్టేషనుకు తీసుకొనివెళ్ళి చితక కొట్టారు. కిషన్ ఎక్కడ దాక్కున్నాడో చెప్పమన్నారు. కిషన్ జాడ తెలియందే అతణ్ణి గురించి తండ్రి ఎక్కడున్నాడని చెప్పగలడు?

తండ్రి అప్పటినుంచి కిషన్‌తో దెబ్బలాడుతూ ఉన్నాడు. నూతివద్ద వున్న ఇంటిలో కిషన్ నివాసం; అతని దగ్గిరకు అయినవాళ్ళు, కానివాళ్ళు వస్తూ ఉండేవారు. అతను అక్కడే భూమిలో కుండలు పాతి సారాయి తయారుచేస్తూ ఉండేవాడు. కిషన్ గొప్పయింటి పిల్లల లక్షణాలను విడచి వీధుల్లో అల్లరిచిల్లరగా తిరిగే వారివలె షోగ్గా తయారయి దేశ దిమ్మరిలా తిరగడం తండ్రికి ఎంతమాత్రం నచ్చేది కాదు. బహుశా తండ్రివల్ల కలిగే సతాయింపు కారణంగానే అతను యిల్లూ వాకిలి విడచి ఖడియాల్‌లో వున్న జైమాల్‌తో కలసి అత్యాచారాలను జరపడం

ప్రారంభించాడు. గ్రామంలో ఉన్న కోమటి పెండ్లివారిని కిషన్, అతని మిత్రులు దోపిడీ చేసినప్పుడు కిషన్ తండ్రి ఎంతో దుఃఖపడ్డాడు. ఊళ్ళో తలఎత్తి తిరగ లేక పోయాడు. కచేరీ చావడికి పిలిపించి నీ కొడుకు చేసే ఈ దురంతాలు వహించ రానివని గ్రామ పెద్దలు అన్నారు. బాస్‌దేశ్ అనే సర్దారుతో ఈ విషయాన్ని పోలీసు స్టేషనుకి వెళ్ళి ఫిర్యాదు చేయమని గ్రామస్థులు చెప్పారు. దానికి అతను తన అంగీకారాన్ని తెలిపాడు. పోలీసువాళ్ళు అప్పటినుంచి మౌడా గ్రామంలో ఒక పోలీస్ స్టేషనును ఏర్పాటు చేశారు.

ఈ విషయం తెలియగానే కిషన్ తన సహచరులను వెంటతీసికొని గ్రామానికి వచ్చాడు. అతను కచేరీ చావడిలో నిలబడి బాస దేవుణ్ణి నానా తిట్లు తిట్టాడు. తుపాకులు కాల్చాడు. పోలీసు స్టేషనులో పోలీసులు భయపడి పారిపోయారు. కిషన్ అతని సహచరులు బాస్‌దేవ్‌ను హత్యచేశారు.

ప్రభుత్వం కఠినంగా వ్యవహరించింది. పోలీసువారు అతని తండ్రిని సోదరుడైన జీ ఊణాను పట్టుకొని తీసుకొనిపోయి వారిని బావమోదారు. కిషన్ శిర స్సును నరికి తెచ్చిన వారికి పెద్ద బహుమతి ఇస్తామని ప్రభుత్వం ప్రకటించింది. అధికారులు అతని యింటికి తాళాలు వేశారు.

కిషన్ జైమల్‌తో అన్నాడు "నీవు నా సోదరుడవు. నాకు సహాయం చెయ్యి. పోలీసువారికి లంచాలు యిచ్చియైనా వారిని నా వెనుక పడనీయకుండా చెయ్యి". కాని జైమల్ "పరిస్థితి నా అదుపులో లేదు" అన్నాడు. అంతట కిషన్ "మేము ఎన్నో బందిపోటు దొంగతనాలు చేశాం; ఎంతమందో పెండ్లివారిని దోచాం; నిలువునా ఆడవారి నగలను ఒలిచాం పేరు ప్రఖ్యాతులు పొందిన జైనుల యిళ్ళనుంచి ఎంతో ఆస్తిని దొంగిలించి తెచ్చాము. ధడామ్ అనే షావుకారి యింటినుంచి ఎంతో రొక్కం లాగుకున్నాం. అయినా నేను యింతవరకు అందులో ఆ దోపిడి ఆస్తినుంచి నా వాటా అంటూ దేనినీ తీసుకోలేదు" అన్నాడు ధీమగా.

జైమల్ "నాదగ్గిర వున్నదంతా అయిపోయింది" అన్నాడు. నీరసంగా. కిషన్ మౌనంగా అక్కడినుంచి వెళ్ళిపోయాడు. అతని మనస్సులో ఏదో గాయం తగిలినట్లయ్యింది.

జైమల్‌కు అతని భార్యకూడా ఎంతో నచ్చజెప్పింది. "ఇతరుల సంపత్తిని

లూటీ చేయడం వాడిని బాధించడం ఎంతమాత్రమూ మంచిపని కాదు. కష్ట కాలంలో మిత్రునికై తమ ప్రాణాల్నికూడ బలిపెడతారు. కాని, నీవు దురాశలో పడ్డావు. మిత్రునిపట్ల విశ్వాస ఘాతుకం చేసినవారికి ఇహ, పరలోకాల్లో నిలువ నీడ దొరకదు. నేను చేతులు జోడించి నీకు చెబుతున్నాను. కిషన్ మనస్సులో నీపట్ల వ్యతిరేకభావం కలిగితే నీ జీవితానికే ప్రమాదం" అని.

కాని జైమల్ భార్య మాటల్ని పెడచెవిని పెట్టాడు. అంతేకాదు "అనవస రంగా నీవు వాగవద్దు, నేను ఇటువంటివారిని ఎందరినో చూశాను" అని గద్దించాడు భార్యను.

కొన్ని రోజులు పోయాక కిషన్ జైమల్ దగ్గిరకు వచ్చి "ఈవేళ ఒక పెండ్లి వారిని దోపిడీ చేయాలి. నీవు నాతో రా" అన్నాడు. జైమల్ దురాశలో పడ్డాడు. ఊరిబయటకు వచ్చాక "నీవు నాపట్ల నమ్మకద్రోహం చేశావు. అయినా నిన్ను నేను మోసంతో చంపను ప్రత్యక్షంగా వచ్చి పోరాడు. నిన్ను నేను చంపివేస్తాను" అన్నాడు, కిషన్ అతనిపై తుపాకి గురిపెట్టి సూటిగా తుపాకి పేల్చాడు. తుపాకి గుండ్లు జైమల్ వక్షాన్ని దూసుకుపోయాయి.

జైమల్‌ను చంపి కిషన్ అతని యింటికివెళ్ళి అతని భార్యతో నేను జైమల్‌ను చంపానని ధైర్యంగా చెప్పాడు,

డోగర్‌కు ఈ విషయం తెలిసింది. "జైమల్‌ను చంపడం ఎంతో చెడ్డపని అన్నాడు. ఒకణ్ణి స్నేహితుడు అని అన్న తర్వాత మళ్ళీ అతణ్ణిగూర్చి వెనుకకు తిరిగి చూడడం మహాపాపం ఇక కిషన్‌పై నమ్మకం ఏముంటుంది అని అన్నాడు న్యాయ ధోరణిలో డోగర్.

డోగర్ కిషన్‌కు కబురుపంపి దస్కాకు పిలిపించాడు "కిషన్! నీ రక్ష ణకై ఏదైనా ఉపాయం కనిపెట్టాలి" అన్నాడు. అతణ్ణి ఎంతగానో గౌరవిం చాడు డోగర్. మేకను చంపించి బాగా మాంసం వండించి పెట్టాడు. సారాయిని బాగా తాగించాడు. తనివితీరా సారాయిని త్రాగి కిషన్ మత్తుగా నిశ్చింతగా నిద్ర పోయాడు. నిద్రపోతున్నవాణ్ణి గదిలోనుంచి బయట తాళంపెట్టి బలాఢా పోలీసు స్టేషనుకు వెళ్ళాడు డోగర్. ఇంకేముంది! లెక్కకు మించిన పోలీసులు తుపాకీలు లాఠీలతో వచ్చి పడ్డారు, ఇంటిని నలుపైపులా ముట్టడించారు. ఈ విధంగా కిషన్ పట్టుబడ్డాడు.

ఇంగ్లాండు మహారాణికి కేబుల్ పంపారు, బందిపోటు దొంగ కిషన్ పట్టు బడ్డాడని. అతనికి యావజ్జీవ కారాగారవాస శిక్ష విధించి అండమాను దీవులకు పంపివేయమని ఆజ్ఞ వచ్చింది.

ఆ కిషన్ తమ్ముడయిన జీ ఊణా మౌచ్‌కు నేడు కిషన్ పంపినవార్త అందింది. జీ ఊణా మనస్సులో డోగర్ మిత్రద్రోహం చేసి కిషన్‌ను స్వయంగా పట్టి అప్ప జెప్పాడనే సందేహం జీ ఊణాకు ఎప్పటినుంచో వుంది. అది ఈనాడు ధృవ పడింది.

ఆ రాత్రి నిద్రపోతున్న తండ్రిని విడచి పశువుల నరికే పెద్ద కత్తిని భుజం పైన వేసికొని తన జన్మస్థానమైన ఆ గ్రామానికి ప్రణామం చేసి అతను అక్కడ నుంచి బయలుదేరాడు.

తెల్లవారేసరికి జీ ఊణా ఒక అడవికి చేరాడు. అక్కడ ఒక తెల్లదొర వేటాడడం చూశాడు. తుపాకీ ఒక ప్రక్కన పెట్టి అతను నీళ్ళు త్రాగుతున్నాడు. జీ ఊణా ఒక్కసారిగా ఉరికి ఆ తుపాకిని తీసికొన్నాడు. తెల్లదొరపైకి తుపాకీ గురిపెట్టాడు. ఆ ఇంగ్లీషు దొర చేతులు జోడించాడు; తనను విడిచిపెట్టమని ప్రాధేయపడ్డాడు. అతను గడ గడా వణుకుతున్నాడు. జీ ఊణాకు దయ కలి గింది. "పో ఓ కోతీ తక్షణం ఇక్కడనుంచి పారిపో!" అన్నాడు జీ ఊణా కళ్ళెర్రజేసి. తెల్లదొర తన గుఱ్ఱంమీద బ్రతుకు జీవుడా అంటూ పలాయనం చిత్తగించాడు.

జీ ఊణా మౌచ్ ముందుకు సాగాడు. అక్కడి ప్రజలు మనస్ఫూర్తిగా అతనికి స్వాగతం చెప్పారు; అతన్ని అందలమెక్కించారు. ఒకవంక అతను కిషన్ సోదరుడు; రెండవది అతనిదగ్గిర మంచి తుపాకీ వుంది; మూడవది అతను అతి శక్తిసంపన్నమైన యువకుడు.

జీ ఊణా నా గ్రామంవైపు ఎప్పుడూ దురుద్దేశ్యంతో చూడకూడదు. నా గ్రామపు కుమార్తెలు, సోదరీమణులు అందరికీ కుమార్తెలు, సోదరీమణులు అని ఒక షరతు పెట్టాడు. బందిపోటు దొంగలతో కలసి అతను నాలుగు జిల్లాల్లోను భూకంపంలా ప్రవేశించాడు. ఎక్కడికక్కడ బందిపోటు దొంగతనం చేశాడు. ధనికులను దోపిడీ చేశాడు; వివాహ దళాలను నిలువరించాడు; విశ్వబ్రాహ్మణులను ధ్వంసం చేశాడు. కొన్నిచోట్ల పోలీసువారికి జీ ఊణా మౌచ్ అత్యాచారాలను

గూర్చి రిపోర్టులు వెళ్ళాయి. పోలీసులు అతణ్ణి వెంటాడుతున్నారు. కాని జీ ఊణా మౌడ్ చేతికి చిక్కడంలేదు. చివరకు అతనిని పట్టుకొన్నవారికి పెద్ద బహుమతులు ఇవ్వబడతాయని ప్రకటనలు వెలువడ్డాయి. అందరకూ అతనంటే సింహస్వప్నంగా వుంది. జీ ఊణా గ్రామస్థులు అతనితో "బాబూ! నీవు మా కుమారుడితో సమానం. నీవు తలచినపుడల్లా సంతోషంగా మన ఊరికి వచ్చి వెళుతూవుండు. కాని పోలీసులు గాలి తగిలితే మాత్రం ఏదోవైపునుంచి తప్పించుకొని బయటకు వెళ్ళిపో" అన్నారు ఆదర భావంతో.

దోపిడీ ధనాన్ని అతను కడియాల్‌లోనున్న కోమటి కాశీరామ్‌కు ఇచ్చేవాడు. కొన్నిరోజుల తర్వాత కాశీరామ్ మనస్సులో ద్రోహభావం మేలుకుంది. అతను స్వయంగా పోలీసులకు ఫలానా రోజున జీ ఊణా మౌడ్ మా యింటికి వస్తాడని కబురు అందించాడు. పోలీసులు వచ్చి నిఘా వేశారు. అనుకున్న సమయానికి జీ ఊణా వస్తున్నాడు. ఇంతలో ఒక ముసలిది పరుగెత్తుకుంటూ ఊరి బయటనే అతణ్ణి కలసికొని " ఓ నా బిడ్డా జీణా జోగేయా! నీవు ఎవర్ని నమ్మావు బాబూ? కోమటిజాతి దమ్మిడీకై ప్రాణం ఇస్తుంది. ముందుకు వెళ్ళకు, పోలీసులు నిన్ను పట్టుకునేందుకు సిద్ధంగా వున్నారు" అని హెచ్చరించింది.

ఆ సమయంలో జీ ఊణా వెనుకకు తిరిగి వెళ్ళిపోయాడు. కాని పోలీసులు వెళ్ళిపోయిన తర్వాత అతను కాశీరామ్‌ను పట్టుకొని చిన్ననాటి ఉగ్గుపాలు కక్కేటట్లు చితక కొట్టాడు. కాశీరామ్ కాళ్ళుపట్టుకొని క్షమించమని ప్రాధేయపడగా దయ దలచి అతణ్ణి ప్రాణాలతో వదలిపెట్టాడు.

ఒకరోజు జీ ఊణా తోంగోవాల్ సమీపంనుండి వెళుతుండగా గ్రామీణ స్త్రీలు చాంద్రమానపు ఉత్సవం జరుపుకొంటున్నారు. గబగబా వారి మధ్యకు వెళ్ళి నేలపై దుప్పటిపరచి "మీరంతా మీ నగలన్నీ తీసి ఈ దుప్పటిపైన పెట్టండి" అని అజ్ఞాపించాడు. ఇస్తారా లేదాయని బలవంతం చేస్తే స్త్రీలు ఏం చేస్తారు పాపం, వాళ్ళు గుండె రాయిచేసికొని గత్యంతరంలేక నగలు తీసి దుప్పటిపై పడవేయ సాగారు. నిజమే బలవంతునిదే రాజ్యం. వారిలో ఒక నవ వధువు "అన్నయ్యా నా అత్త యింటివారు ఎంతో గయ్యాళివారు. పోయి, నీ కన్నవారింటికివెళ్ళి నగలు చేయించుకొనిరా, లేకపోతే ఇంటిలోకి రానివ్వం అంటారు. నా తండ్రి నా వివాహ సమయంలో ఉన్న కాస్త పొలం తనఖాపెట్టి అతి కష్టంమీద పెళ్ళి చేశాడు.

అన్నయ్యా! నేను నీ చెల్లెలిలాంటిదాన్ని కాపాడు" అంది ప్రాధేయ పూర్వకంగా.

జీ ఊణా మనస్సు కరిగిపోయింది. అతడు "మీరంతా మీమీ నగలు తీసికొని పొండి" అన్నాడు గ్రామ వధువులతో. అతడు ఖాళీ దుప్పటి దుమ్ము దులుపుకొని అక్కడనుండి వెళ్ళిపోయాడు.

తరువాత గ్రామంనుంచి ముందుకు సాగిపోతుండగా చాల ఆకలివేసింది. నలువైపులా పరికించి చూశాడు. ఒక అమ్మాయి రొట్టెలను తీసికొని పొలం వైపు వెళుతోంది. ఆ అమ్మాయి దగ్గరగా వెళ్ళి "చెల్లీ! ఆకలివేస్తుంది రొట్టె పెడతావా? అని అడిగాడు జీ ఊణా.

"తప్పక పెడతాను అన్నయ్యా" అంటూ ఆ అమ్మాయి నెత్తిపైనుంచి మజ్జిగపాత్ర దించింది; ఆకులో చుట్టివుంచిన గోధుమ రొట్టెలను తీసింది; ఉల్లిపాయలు ఒలిచింది; ఆకులో పచ్చడి ఉంచింది. చెట్టుక్రింద చల్లని నీడలో కూర్చోబెట్టి జీ ఊణామౌడ్‌కు కడుపునిండా ఉన్న రొట్టెలన్నీ పెట్టింది.

"చెల్లీ నీవు కలకాలం వర్ధిల్లు." అంటూ జీ ఊణా ఆ అమ్మాయికి ఇరువదిఅయిదు రూపాయలు ఇచ్చాడు. ఆప్యాయంగా ఆమె శిరస్సును సవరించి వెళ్ళిపోయాడు.

కొద్ది రోజుల తరువాత అతను దౌలేఅల్ గ్రామంలో ఎవరిదో ఒక మంచి గుర్రాన్ని జీ ఊణా మౌడ్ ఊడదీశాడు. గుర్రం వెనుకకు లాగడంవల్ల తట్టుకొయ్య ఊడిపోయి అతని ముక్కుకు తగిలి గాయం పడింది. ముక్కుమీద మచ్చ పడింది.

గుర్రంపై ఎక్కి అతను డోగరు గ్రామానికి చేరి "నీవు నిజంగా నీ తండ్రికి కుమారుడవై పుట్టినట్లయితే నా ఎదుటకు వచ్చి నిలబడు. మోసంతో నా అన్నను ప్రభుత్వానికి పట్టి అప్పజెప్పావు. ఇక ఈ కొత్త అల్లుడి చేతినుంచి తప్పించుకు ఎక్కడకు పోతావు? అని డోగరుకు కబురు పంపాడు.

ఈ కబురు విని డోగర్ రక్తం ఉడికిపోయింది. అతను తుపాకీలో తూటాలు నింపాడు. తూటాల పేటిక భుజంపై వ్రేలాడవేసికొన్నాడు; గుర్రాన్ని జీను బిగించి కట్టాడు. "ఈ రోజు జీఊణా మౌడ్‌కు చావు దాపురించింది. వాడి చావు నన్ను ఇంతవరకు తీసికొని వచ్చింద"ని గర్వంగా పలికాడు.

వెళ్ళేటప్పుడు డోగర్ భార్య "నీవు వెళ్ళవద్దు, రాత్రి నాకు మనవూరికి నిప్పు

అంటుకొన్నట్లు ఆ అగ్నిజ్వాలల మధ్య నీవు తగలబడి పోయినట్లు ఎవరో నా జాకెట్టు మరుగున వున్న మంగళసూత్రాన్ని లాగివేసినట్లు, ఇలా ఎన్నో పాడు కలలు వచ్చాయి అని భర్తను ఆపాలని ప్రయత్నించింది.

కాని డోగర్ "నీవు చింతించవద్దు. ఆ వెధవ జీ ఊజా నాముందు ఎంత? వాడి అన్న కిషన్‌ను అండమాను ద్వీపాంతర కారాగార వాసానికి పంపాను. వీణ్ణి నరకానికిపంపనిచో నాపేరు డోగర్‌కాదు" అన్నాడు సగర్వంగా.

డోగర్ ఇంటినుంచి బయలుదేరేటప్పుడు కుక్క తన చెవుల్ని టపటపా విద లించింది. కొద్దిదూరం ముందుకుపోగా శవం కనబడింది. అతని గుండె జల్లుమంది! అయినా అతను అదేమీ లెక్కచేయలేదు. ఇంకా కొద్ది దూరం వెళ్ళాడో లేదో ఒంటి బ్రాహ్మణుడు ఎదురయ్యాడు. ఎడమవైపు పొలాల్లో తీతువు అరి చింది. ఇంకా కాస్త ముందుకు సాగగా ఒక వితంతువు అదేపనిగా తుమ్మింది. అన్నీ అపశకునాలే ఎదురయ్యాయి.

డోగర్ నడుమున కట్టుకొన్న సారాయి సీసాను తీసి అందులో మిగిలి వున్న సగం సారాయిని గొంతుకలో పోసుకొని గట గటా త్రాగాడు. ఖాళీసీసా దూరంగా విసరికొట్టాడు. మీసాలు మెలిపెడుతూ మైదానంలోకి వచ్చాడు.

"డోగరా! నిజమైన పౌరుషంగల వీరుడు ఎవ్వడూ ఎవ్వడినీ మోసంతో చంపడు సరే, ముందు నీవే నాపై ఆయుధప్రయోగం చెయ్యి" అన్నాడు గంభీ రంగా జీ ఊజా.

డోగర్ తుపాకీని పేల్చాడు. జీ ఊజా గుఱ్ఱం ఒక్కసారిగా మోకాళ్ళ నానించి కూర్చుంది. తుపాకీగుండు జీ ఊజా నెత్తిపైనుంచి దూసుకుపోయింది. డోగర్ రెండవసారి తుపాకి పేల్చాడు. జీ ఊజా ఆ దెబ్బను చాకచక్యంతో తప్పించుకున్నాడు. మరుక్షణం సూటిగా గురిపెట్టి డోగర్‌ను గుఱ్ఱంనుంచి పడ గొట్టాడు.

డోగర్ ఇంట్లో ఏడ్పుమొరలు ప్రారంభమయ్యాయి. మరోవంక ఎవ్వరో జీ-ఊజా గ్రామానికి వెళ్ళి జీ ఊజా డోగర్‌ను చంపి కిషన్‌కు చేసిన అన్యాయానికి కసి తీర్చుకున్నాడని చెప్పాడు. "అటువంటి వీరుడైన సోదరునికి బలిదానం చేసినా ఋణం తీరదు. సోదరుడంటే అలా వుండాలి" అని అందరూ పొగడసాగేరు.

బలాధానుంచి జీ ఊణాను పట్టుకునేందుకు పోలీసులు ఉరకలు తీశారు. కాని జీ ఊణా అంతు చిక్కేవాడు కాదుగదా.

దోగర్‌ను చంపిన తరువాత జీ ఊణా ఒకనాటిరాత్రి తన ఇంటికి వచ్చి తండ్రి పాదాలకు ప్రణమిల్లాడు.

గ్రామంలోని గౌరవ కుటుంబాల గౌరవాన్ని నీవెందుకు యిలా మంటగలుపుతున్నావు? మీరు నాకు పుట్టకుండా వుంటేనే ఎంతో బాగుండేది. మాటి మాటికి పోలీసులు ఊళ్ళోనికి వచ్చి నానా బీభత్సం చేస్తున్నారు. తల్లులూ కుమార్తెల్లాంటి వారు ఇళ్ళలోనుంచి బయటకు రావడం బ్రహ్మప్రళయమౌతుంది. అన్నాడు తండ్రి హృదయ విదారకంగా.

"బాబూ! నన్ను ఎందుకు కోపగిస్తారు? నేను నా పనిని పూర్తి చేశాను. మీరు అనుమతిస్తే రేపు ఉదయమే వెళ్ళి పోలీసు స్టేషనులో హాజరవుతాను" అన్నాడు జీ ఊణా.

పోలీసు స్టేషనుకా....వద్దు....వద్దు. వాళ్ళు నీరక్తం త్రాగి దాహం చల్లార్చుకోవాలని చూస్తున్నారు. నిన్ను ఒక తుపాకీ దెబ్బతో కాల్చివేస్తారు. ప్రభుత్వం నిన్ను పట్టినవారికి అయిదువందల రూపాయలు బహుమతి ప్రకటించింది. మన ఊరివాళ్ళు మంచివాళ్ళు. లేకపోతే ఏనాడో ఎవడో ఒకడు పోలీసువారికి నీవార్త అందించి వుండేవాడు. నీవు తెల్లవారకముందే ఇక్కడనుంచి వెళ్ళిపో, నేనిప్పుడే నీకు రొట్టె తెస్తాను. ఇక నాయింటి గౌరవం నీచేతుల్లో వుంది. నేను నది ఒడ్డున చెట్టులాంటివాణ్ణి రేపో మాపో, నాచావు తప్పదు" అన్నాడు తండ్రి.

కొన్ని రోజులు గడిచాయి. ఒకరోజు జీ ఊణా అతని సహచరులు పెళ్ళికి తరలి వెళ్ళే జన సముదాయాన్ని ముట్టడించారు. వధువు ఒంటిపై వున్న నగలు తీయించారు. పెండ్లివారివద్ద వున్న నగదు అంతా లాక్కున్నారు. ముక్కుపై వున్న మచ్చను చూసి ఇతడు జీఊణా మౌడ్ అని ఒక జాటుజాతి మనిషి గుర్తించాడు. అంతట చేతులు కట్టుకొని ఆ జాటుజాతివాడు "భూమి తాకట్టుపెట్టి నేను నా కుమారునికి పెళ్ళిచేశాను. నా కోడలికి ఎరువునగలు తెచ్చి తగిలించాను. నేను ఈశ్వర సాక్షిగా చెబుతున్నాను. నీవు మా జాటుజాతి సోదరుడవు. సంఘాన్ని దోపిడిచేసే షావుకార్లను నీవు దోచుకో" అని ప్రార్థించాడు వినయంగా.

ఇది విని జీఊణా మౌడ్ దోచిన నగలు, నగదు తిరిగి యిచ్చివేశాడు. తన

వద్ద వున్న వెయ్యి రూపాయలు కూడా వాళ్ళకు యిచ్చి సతసిరి అకాల్ అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు. ఆ జాట్ పెళ్ళివారంతా "ఓ మా సోదరుడా, జీ ఊణా మౌడ్, నీవు సుఖంగా వర్ధిల్లుదువుగాక" అని ఆశీర్వదించారు.

ఒకరోజు జీ ఊణా అకస్మాత్తుగా నాభా హీరాసింగ్ రాజు మహలులోనికి వెళ్ళి అతని గుఱ్ఱాన్ని కట్టునుంచి ఊడదీశాడు. అక్కడి కాపలాదారుణ్ణి తుపాకీ చూపించి బెదిరించాడు గుఱ్ఱాన్ని తీసికొని వెళ్ళేటప్పుడు "మహారాజుకు జీ ఊణా మౌడ్ మీ గుఱ్ఱాన్ని తీసుకొని పోయాడని చెప్పు" అని కాపలాదారుడితో అన్నాడు.

జీ ఊణా మౌడ్ రాజుగారి గుఱ్ఱాన్ని ఎలాతీసికొని వెళ్ళాడని ప్రజలు ఆశ్చర్య చకితులయ్యారు. మహారాజు మిడుతల దండువలె పోలీసులను అతణ్ణి పట్టుకొనుటకై పంపించాడు. చివరకు పోలీసులు ముట్టడించి ఒకచోట జీ ఊణాను పట్టుకున్నారు.

హస్సకే జీ ఊణా ఆఖదా ఘోడా బడీ కమాల్।
బక్కీ సాంభ్ లఓ ఆ పదీ మైఁ దేఖీసీ చాల్।

[ఇది మంచి పసగలగుఱ్ఱం. నీ గుఱ్ఱాన్ని నీవు సంభాళించుకో నేను కేవలం దీని గమనవేగం పరీక్షించాను అని జీ ఊణా నవ్వుతూ అన్నాడు.]

మరునాడు రోజున మహారాజు జీ ఊణాను జైలులో కలుసుకోవడానికై వచ్చి "ఎలాఉంది?" అని రాజు ప్రశ్నించాడు. అంతట జీ ఊణా "ఖైదీలకు యినుప బోనులను తయారు చేయించు; ఇలాంటి జైలునుంచి వారు పారిపోగలరు" అన్నాడు. పరిహాసంగా. మహారాజు ఫక్కున నవ్వి "సరే, బాగుంది; నీవు ఈ జైలునుంచి పారిపోయి చూపించు అన్నాడు". ఇంత గట్టి పహరా ఉంటుండగా, లావుపాటి ఇనుప కడ్డీల తలుపులుండగా, ఎత్తైన జైలు గోడలను దాటి ఎలాంటివాడైనా పారి పోలేడని మహారాజు నమ్మకం.

అదేరాత్రి జీ ఊణా జైలునుంచి పరారయ్యాడు.

జీ ఊణా మౌడ్ పేరిట అనేకమంది అనేకచోట్ల లూటీలు జరిపారు. భయం వల్ల పోలీసులు కూడా సమయానికి ఆ లూటీ ప్రదేశాలకి వెళ్ళడానికి సాహసించే వారు కాదు.

ఒకరోజు ఒక బ్రాహ్మణుడు ఒక అమ్మాయిని అత్తవారింటినుంచి తీసికొని వస్తున్నాడు. అడవిలో దుండగులు ముట్టడించారు. అరవై సంవత్సరాల

వృద్ధబ్రాహ్మణుడు ఆ దుర్మార్గులను ఎలా ఎదిరించగలడు? అని ఆ అమ్మాయి నిరుత్సాహం చెందింది. భగవంతునిపై భారం వేసింది. సంయోగవశాత్తు జీ ఊణా మౌడ్ అదే సమయానికి అటువైపుగా వెళుతున్నాడు. అతను ఆ దుండగులను ముట్టడించాడు.

"మధ్యలో అడ్డురావడానికి నువ్వెవడవు?" అన్నాడు దుండగులలో వొకడు.

"నేను నీ బాబునైన జీ ఊణా మౌడ్‌ను సుమా!" అని గర్జించాడు జీ ఊణా.

ఆ దుండగులు కంపించిపోయారు. వారతని కాళ్ళపై పడసాగారు. అతను వారిని నాలుగు చెప్పుదెబ్బలు కొట్టి విడిచిపెట్టాడు. బ్రాహ్మణున్ని, ఆ అమ్మాయిని జీ ఊణా వారి యింటికి చేర్చాడు. బ్రాహ్మణుడు అతనికి వందలాది ఆశీర్వచనాలు యిచ్చాడు. అతణ్ణి గోమాతకు, పేద ప్రజానీకానికి రక్షకుడిగా వర్ణిస్తూ యింటింట జీ ఊణా మౌడ్ కీర్తిని గానం చేయసాగాడు.

ఆ కాలంలో కవులు ఒక కవితను యిలా రచించారు.

> జీ ఊణా మౌడ్ సాధ్ గఊ గరీబ్ దీ కరేసేవా,
> ఖబ్బీ ఖానాం ది అలఖ్ ముకాం ఉందా జీ।
> జేదే బాద్ షాహ్ దే ఘర్ కరే చోరీ,
> పర్చా ఛాప్ కే పహలాం లగాం వదా జీ।
> హీ హనీ మాంనే జమ్మేయా శేర్ జీ ఊణా,
> నహీ లుక్క్ కే వకత్ లంఘా వదా జీ।

[జీ ఊణా మౌడ్ సాధువు, పేదవారికి గోమాతకు సేవ చేస్తాడు. పెద్ద పెద్ద హంతకుల ముఠాల అహంకారాలను అంతం చేస్తాడు. చక్రవర్తియింట దొంగతనం చేయటానికి ముందు కరపత్రాలు గోడలకు అతికించి మరీ దాడి చేస్తాడు. అయినా అతణ్ణి ఎవరూ పట్టుకోలేదు. సింహంలాంటి తల్లికి సింహంలాంటి జీ ఊణాకలిగాడు. అతడు మరుగుగా దాపరికపు జీవితాన్ని గడపడు.]

ఒకరోజు జీ ఊణా రాజులందరికి కబురు పంపాడు. "నేను నైనాదేవి దేవాలయానికి వెడతాను. నేను ఆ తల్లి సహాయంతోనే ఎంతోమంది సైనికుల్ని అంతం చేశాను. ఆ తల్లికి నేను సువర్ణ ఛత్రం సమర్పిస్తాను. మీ బలాన్నంతా పుంజుకొని నన్ను పట్టుకోవడానికి రండి నేను మృత్యువు అంటే భయపడి దాక్కునేవాడిని కాదు" అని.

నైనాదేవి దర్శనానికి వెళ్ళేటప్పుడు అతను పాటియాలా నగరానికి చేరాడు. పోలీసుదుస్తుల్ని ధరించి హవల్దారుగా రూపం మార్చాడు. అతను కోట గోడలకు "జీ ఊణా మౌద్, కచేరీ బజార్లో తిరుగుతూ ఉన్నాడు. ఎవరైనా అతణ్ణి పట్టుకొనదలిస్తే పట్టుకొనవచ్చు" అని వ్రాసియున్న పెద్ద పెద్ద కాగితాలను అంటించాడు. సాయంకాలం ఏడుగంటలకు అతను స్టేషనునుంచి నైనాదేవి దర్శనార్థం రైలుఎక్కి కూర్చున్నాడు.

అడుగడుగునా పోలీసులు నిలబడి వున్నారు. రోడ్లు, యితర మార్గాలపై నడవనివ్వకుండా ప్రజలను నిలిపివేశారు. అయినప్పటికి జీ ఊణా అందరి కళ్ళల్లో దుమ్ముకొట్టి సాయంకాలం ఏడుగంటలకు ఒక సాధువు వేషంలో నైనాదేవి వద్దకు వెళ్ళడానికి బండి ఎక్కాడు.

పోలీసులుకూడా బండిలో వెంట వెళ్ళారు. రైలుపెట్టెలన్నీ వెదికారు. కాని జీ ఊణా వారికెక్కడా దొరకలేదు.

జీ ఊణామౌద్ రైలునుంచి దిగి మొదట ఆనందపుర సాహెబ్ గురుద్వారాలలో పదవ గురువునకు నూట యిరువది రూపాయలు సమర్పించడానికి వెళ్ళాడు. పదవ గురువు హిందూధర్మం కొఱకు తన నలుగురు కుమారులను బలిదాన మొసగాడు.

జీ ఊణా నైనాదేవి ఆలయానికి చేరాడు. నలువైపులనుంచి పోలీసులు దేవాలయాన్ని ముట్టడించారు. జీ ఊణా ఆ దేవికి దేవాలయంలో బంగారు గొడుగును సమర్పించాడు. దేవి పాదాలపై శిరస్సునుంచి నమస్కరించాడు. నైనాదేవి అతనికి దర్శనమిచ్చింది. జీ ఊణా జన్మ మరణాల సందేహాన్ని తొలగించుకున్నాడు.

పోలీసులు తమ ముట్టడిని ఇంకా గట్టి చేశారు. ముక్కుపైనున్న మచ్చవల్ల జీ ఊణా గుర్తించబడ్డాడు. పోలీసులు పట్టుకోవడానికి ముందుకు వచ్చారు. జీ ఊణా సాధువు తన చేతుల్లోవున్న దండాన్ని వారిపై ప్రయోగించాడు. పది, పన్నెండుమంది పోలీసుల్ని కొట్టి తరిమాడు; తుపాకీలు పేల్చారు. జీ ఊణా చేతిలో రైఫిల్ లేదు.

చివరకు జీ ఊణాను చుట్టుముట్టి అరెస్టు చేశారు. దేవికి నమస్కరించి అతను పోలీసులవెంట వెళ్ళిపోయాడు.

ఫిరోజ్‌పుర్ జైలుకు ఎన్నోవందల పోలీసుల బందోబస్తుతో అతన్ని తీసికొని వెళ్ళారు.

ఇంగ్లాండ్ మహారాణికి మళ్ళీ బందిపోటు దొంగ కిషన్ తమ్ముడైన జీ ఊణా పట్టుబడ్డాడని కేబుల్ పంపబడినది.

మహారాణి తరపున ఉరిశిక్షకు ఆజ్ఞ ఇవ్వబడినది. అప్పటికి ఎనిమిదిరోజుల తర్వాత ఉరి తీయడానికి తేది నిర్ణయించబడింది. జైలు అధికారి నీవు ఏది తినా లనుకుంటున్నా అది కడుపారా తిను. నీకు కావలసినది తనివితీరా త్రాగు. నీవు కోరినవారిని యిచ్చట కలుసుకో అన్నాడు.

జీ ఊణా సింగ్ "కేవలం తినడానికి, త్రాగడానికి నేను ఈ లోకానికి రాలేదు. సోదరా నేను విడచినపని పూర్తిచేయడానికి నా మాతృదేశ సోదరులు ముందుకు వస్తారు. ఎవరి హృదయాలలో సత్యం, న్యాయంపట్ల శ్రద్ధ ఉంటుందో వారు ముందుకురాక మానరు. నన్నీప్రపంచం జ్ఞాపకం ఉంచుకుంటుంది" అన్నాడు గంభీరంగా.

జీ ఊణాకు గోవిందీ అనే సోదరి ఉంది. ఢిల్లీలో వున్న వైస్రాయి వద్దకు ఫిర్యాదు చేరింది. కాని కోర్టులో ఏమీ విచారణ జరగలేదు.

ఎనిమిదవరోజు కూడా వచ్చింది.

అందరికీ "సతసిరీ అకాల్" అంటూ జీఊణా మౌడ్ ఉరిబల్లపై ఎక్కాడు. అతను ఉరితీయబడ్డాడు.

సోదరి గోవిందీ, విలపించసాగింది.

వే తీయాఁ దే దిన్ కీనూఁ ఉడీకాఁ గీ.

కౌన్ బే జూగా సంధారే వే మేరేయా నూరమే ఆఁ వీరా।

[వీరుడైన సోదరా! నేను ఇక ఎవరికొరకు ఎదురు చూస్తాను? నాకు ఇక ఎవరు కానుకలు పంపుతారు? ఇక నాకెవ్వరున్నారు?]

జీ ఊణా మౌడ్ తన పేరుని ప్రపంచంలో చిరస్థాయి చేసుకున్నాడు. ప్రపంచమున్నంత వరకు ప్రజలు అతణ్ణి సంస్మరిస్తారు.

భావేఁ ఘర్ ఘర్ పుత్త జమ్మదే

జీ ఊణా మౌడ్ నా కిసే బణ జాణా।

# కైమా - మలకీ

—గులజార్ సింహ్ సంధూ

"గఢ్ ముగలానే దీ ఆఁ నారాఁ పీఘాఁ ఝూట్ దీ ఆఁ"

[ముగలానా దుర్గంలోని మహిళలు ఊయలలు ఊగుతున్నారు.]

పంజాబు జానపద నృత్యాలు చేసే యువతులు రావిచెట్టు నీడలో నృత్య తాళాలను అనుసరిస్తూ ఊయలలు ఊగే అమ్మాయిలను బాగా ఊగమని ప్రోత్సాహ మిస్తున్నారు. ముదలానే దుర్గంలో వున్న ఈ రావిచెట్టువద్ద జరిపే ఉయ్యాల ఉత్సవం సరిహద్దు ప్రాంతంలో దూర దూరం వరకు ప్రఖ్యాతి వహించింది. ఉన్నో తరాలనుంచి పరంపరా గతంగా ఈ రావిచెట్టు ఎంతోమంచి అమ్మాయిలను, ఆనందంగా ఊయలలో ఊపుతూ వస్తూంది. దాని కొమ్మలు ఎంతో బలీయంగా వున్నాయి. దాని నీడ నిండుగా, అతి చల్లగా ఉంది. ఆ గ్రామ పెద్దయొక్క కుమార్తె మలకీ ఆజానపద నృత్యాలకు నాయకురాలు. ఆ అమ్మాయి ఊయల ఎక్కి గట్టిగా ఊగితే ఆ పురాతన రావిచెట్టు వేళ్ళుకూడ కదిలి పోయినట్లుండేది.

మలకీ తండ్రి రాయ్ ముబారక్ గ్రామానికి పెద్దయేకాదు, ఆ ప్రాంతమంత టిలో మంచి పలుకుబడిగల మనిషి కూడ. అతనికి ఇద్దరు కుమారులు. వారు చెట్టు మ్రానుల్లా ఎంతో బలశాలులు; చేతిలోని దుడ్డుకర్రల్లా నిండుగా నిటారుగా వున్న యువకులు. రాహూన్, మహరూన్ వారి పేర్లు. రాయ్ ముబారక్ తమ్ముడు దరీయా ఢిల్లీలో అక్బరు దర్బారులో సుబేదార్ పదవిలో వుంటున్నాడు. ప్రభుత్వ స్థాయిలో వారికి గౌరవం లభించుటవల్ల వారి వంశానికి మరీ విలువ పెరి గింది. రాయ్ ముబారక్ దరీయాకంటె నాలుగేళ్ళు పెద్ద. రాహూన్, మహరూన్ కంటె ఆరేళ్ళు పెద్దవాడు. ఒకేచోట ఆ నలుగురు కలసి కూర్చొనివుంటే తండ్రీ, కొడుకుల్లా కాక కేవలం వారు అన్నదమ్ములవలె కనబడతారు. ఆ నలుగురూ ఆ ప్రదేశానికి నాలుగు స్తంభాలుగా భావించేవారు. వారు నలుగురు చేతికర్రలను తీసికొని నిలబడితే గాలిని కూడ నిలబెట్టేటంత శక్తిసంపన్నులు.

తల్లిదండ్రుల ప్రతాప కారణంగా మలకీకూడ సాహసవంతురాలైంది. ఆమె ముఖం పూర్ణిమ చంద్రబింబంలా తేజోవంతంగా ఉంది. ఆమె హీర్ సస్సీలకు ఏమీ తీసిపోదు. ఆమె ఆ గామానికి గౌరవం ఆ ప్రాంతానికి ఆత్మ గౌరవంగా వుంది. నిండు యౌవ్వనవతి అయిన ఆమె యువతరానికి చెందిన ఆశయానికి ప్రతిరూపం అనవచ్చు కాని వారి ఉదాసీనతలకు ప్రతినిధికాదు. యౌవ్వనపు ఊయలత్రాడు తెగిపోతుందనే విషయం ఆమెకు ఎన్నడూ కలలోనైనా తోచలేదు. ఊయలను కట్టిన కొమ్మయైనా విరిగి నేలపడుతుంది, కాని తానుకాదు అనే అభిమాన భావం ఆమెలో ఉర్రూతలూగేది. ఆమెది ఎవ్వరినీ లెక్కచేయని భావం

తల్లి గోందలాకు చెట్టులా ఎదిగి నిండు యౌవ్వనంలో తొణికిసలాడుచున్న మలకీని గూర్చి రకరకాల ఆలోచనలు రేకెత్తాయి. ఇంటిలో ఎదిగిన కూతుర్ని చూస్తూ ఏతల్లి సుఖంగా నిద్ర పోగలదు? ఏదైన చిన్న పొరపాటు జరిగితే మొగలాయి వంశ గౌరవం బూడిదలో పోసిన పన్నీరవుతుంది. యౌవ్వనంలో వున్న అమ్మాయికి పెళ్ళిచేసి ఆమెను తన అత్తవారింటికి పంపనంతవరకు తల్లికి మనశ్శాంతి కలుగదు. గోందలాఁ హృదయంలో ఏదో ప్రళయం వచ్చినట్లయింది. అమ్మాయి యౌవ్వనవతియే అయితే యౌవ్వనం అందరికీ వస్తుందికదాయని తండ్రి తలచేవాడు.

తండ్రి చివరకు విసిగెత్తి తమ్ముడు దరీయాకు ఉత్తరం వ్రాసి పంపాడు. మలకీ రాయ్ ముబారక్‌కు కుమార్తెయైనట్లుగానే అతని తమ్మునికి కూడ కుమార్తెయైనట్లే. కుమార్తె గౌరవం అందరికీ గౌరవమే. దరీయా ప్రభుత్వపు స్థాయిలో ఎవరినైనా వరుడిగా చూడగలడు. ఇలా జరగడంలో తరువాత మరేదీ లాభం వున్నా లేకపోయినా మలకీ తల్లి తన భర్తకు ఈ విషయంచెప్పి వేధించడం మానివేసింది ఇదే ప్రస్తుతానికి జరిగిన మంచిపని అనాలి

గోందలాఁకు ఒక విధంగా ఆనందం మరో విధంగా దుఃఖం తన కుమార్తెకు వరుణ్ణి వెదకడం ప్రారంభమయిందే ఆనందం. దరీయా తన ఉద్దేశ్యంలో మలకీకి తగిన వరుణ్ణి వెతికితే అందుకు భిన్నంగా మాట్లాడక ఒప్పుకోవలసి వస్తుందనే దుఃఖం గోందలాఁను మరోవంక వేధిస్తుంది బంధువర్గంలో గోందలాకు ఒక సోదరి వుంది ఆమెపేరు లాలో ఆమె తఖ్త హజారాకు సర్దారైన దులాఖాను వివాహమాడింది. లాలోకు జ్యేష్ఠపుత్రుడు జన్మించినపుడు గోందలాఁ

సోదరి పురుడు పోయడానికి తఖ్త హజారాకు వెళ్ళింది సోదరికి కొడుకు పుట్టాడు. అతను సూర్య తేజస్సును మించి ప్రకాశిస్తున్నాడు అతనికి కైమాయని నామ కరణం చేశారు. గోందలాఁ అతణ్ణి తన యిద్దరి కుమారులకంటె మిన్నగా ప్రేమిం చేది. కైమా ఎంతో సహనశీలుడు; వ్యాయామక్రీడల్లో అతిగా పాల్గొనడు గోందలాఁ ఉద్దేశ్యం ప్రకారం కైమా సద్గుణ సంపన్నుడవుతాడని ఆమె నమ్మకం గోందలాఁ తీవ్ర పౌరుష స్వభావంగల మనుషులతో విసిగెత్తిపోయింది. భగవంతుడు చల్లగా చూస్తే తఖ్త హజరా ముగలానే దుర్గవంశీయుల మధ్య సంబంధ స్నేహం తర తరాలు మూడు పూవులు ఆరుకాయలుగా నడుస్తుంది. భగవంతుని దయవల్ల ఆమెకు మళ్ళీ గర్భవతి కాగలనని నమ్మకం ఇరువురు కుమారుల తర్వాత ఆమె ఇష్ట దేవతలను, ఒక కుమార్తెను ప్రసాదించమని కోరింది. ఇష్టదేవతలు ఎన్నడూ నిరాశపరచలేదు ఆమెకు కుమార్తె కలిగితే ఆ పిల్లను కైమాకు యిచ్చి పెండ్లి చేస్తానని సోదరికి గోందలాఁ మాట యిచ్చింది. ఈ విషయంలో కైమా తండ్రికి గాని, గోందలాఁ భర్తకు గాని ఎలాంటి అభ్యంతరం ఉండబోదు.

తనకు ఎలాంటి అభ్యంతరం ఉండదు. కాని గోందలాఁకు తన భర్త కుటిల స్వభావం బాగా తెలుసు, అందరూ చెప్పే మంచిమార్గం వదిలి ప్రతికూల మార్గంలో నడవడం అతని స్వభావంలోని ప్రత్యేకత. అలా నడవడంలో కలిగే ఆనందమేమిటోమరి. అందుచేత తన సొంత నిర్ణయాన్ని తన మనస్సులోనే గోప్యంగా ఉంచుకొంది. వీలు దొరికినప్పుడు సరియైన సమయంలో తన మనస్సు లోని విషయం భర్తకు చెప్పాలని ఆమె ఉద్దేశ్యం. గోందలాఁ మరదియైన దరీయావద్దనుంచి అనుకూల సమాధానం ఎప్పుడు వస్తుందాయని ఎదురు చూస్తోంది అక్కడినుంచి కుదరలేదు' అనే సమాధానం రాగానే తన ఉద్దేశ్యాన్ని చెప్పి భర్తను తేలిగ్గా ఒప్పించవచ్చునని ఆమె నమ్మకం

ఉత్తరం అందడమే తడవుగా దరీయా ఆదరా బాదరా బయలుదేరి ఎంతో దూరం ప్రయాణంచేసి ముగలాన్ చేరాడు. మలకీకి వరుల కొదువ ఏమిటి? అతను తన బాధ్యతను నిర్వహించడానికి ఎంతో ఆత్రం చూపించాడు. దరీయా తన యింటికి రాగానే ఇంట్లో మగవాళ్ళ ముఖాలన్నీ ఆనందంతో మురిసినట్లయ్యాయి. ఆడవాళ్ళ మనస్సుల్లో గంభీరత అలముకొంది. ఇక ఏమి జరుగుతుందో ఎవరికీ తెలీదు పిండివంటలు గోందలాఁ వంటింట్లో వండుతున్నా, ఆమె పురుషులు

కూర్చున్న గదిపైపే తన చెపులు వుంచింది. మలకీ మరుగుగా గోడను ఆనుకొని కూర్చొనివుంది.

దరీయా రాయ్ ముబారక్‌కు ఏమి చెప్పాడో, ఏమో ఇల్లంతా ఏదో మత్తు మందు చల్లినట్లు నిశ్శబ్దంగా వుంది. వాతావరణాన్ని చూస్తే దరీయా చెప్పిన వార్త ఆమోదం కానట్లనిపించింది. ఈ విషయం గోందలాం. మలకీలు కూడ పసి గట్టారు. ఆ నిర్ణయమేమిటో పురుషులకుతప్ప మరెవ్వరికి ఇసుమంతయేని తెలి యదు. దరీయా ఎందుకిలా చెప్పాడు అని ఆలోచిస్తూ పురుషులు బాధపడ్డారు. "సరే. ఆలోచిద్దాం" అని ఇంటిపెద్ద మాటల ధోరణి మార్చాడు. వారంతా పొలాల సంగతులు మాట్లాడుకొంటూ నిద్రపోయారు.

అందరూ నిద్రపోవడానికైతే పడుకున్నారు. కాని, నిజంగా ఎవ్వరూ నిద్రపోలేదు. తన సోదరుడు తన నిర్ణయాన్ని అంగీకరించలేదని బాధపడ్డాడు. దరీయా సోదరుడై వుండి ఇటువంటి విషయంలో, నన్ను ఒప్పించడానికి పూనుకున్నా డేమిటి? అని రాయ్ ముబారక్ నొచ్చుకున్నాడు. కొడుకులు తండ్రినే అనుస రించారు.

తల్లీ కూతురు వరండాలో పడుకొని ఒకరు మరొకరి గుండెదడను వింటు న్నారా యన్నట్లు మౌనంగా వున్నారు. వారిద్దరికీ దరీయా నిశ్చయం ఆమోదం కాలేదని రూఢి చేసుకొన్నారు. అయినా, ఆ నిశ్చయం ఏమిటి? ఆయన నిర్ణయాన్ని త్రోసిపుచ్చిన తరువాత జరిగేదేమిటి అనేది వారికి అగమ్యగోచరమైంది.

తనకు సంబంధించినంత వరకు జరిగినదంతా బాగానే జరిగింది అని గోందలాంకు అనిపించింది. కాని ఈ చిదంబర రహస్యం తేటతెల్లమయ్యేవరకు తన భర్తనుగాని, కొడుకులనుగాని నమ్మడం ఎలా? తల్లి గోందలాం మలకీ హృద యంలో కైమా చిత్రాన్ని చిత్రించింది. అతని సౌందర్యం గుణగణాలు వినయ విధేయతలను గూర్చి ఎంతో చెప్పింది. ఆ చిత్రాన్ని ఆ వ్యక్తిత్వాన్ని తన హృదయంలోనుంచి తొలగించడానికి సిద్ధంగా లేదు. ఆడపిల్లలకు అధికార దర్పంలోవున్న అన్నదమ్ములంటే ఇష్టం. కాని భర్తమాత్రం మంచి శీల స్వభావం కలవాడు కావాలని కోరుకుంటారు. మలకీ, కైమా యింట శాంతి సుఖాలతో ఉండగలనని, ప్రేమటుయ్యాల్లో ఆనందంగా ఊగుతూ ఉండగలనని యోచిస్తూ వుంది.

కైమా రాంయూకు మేనల్లుడవుతాడు. రాంయూ విషాద ప్రేమగాథ నిన్నో మొన్నో గడచినట్లుగా వుంది రాంయూ మేనల్లుడు అయిన కారణంగా కైమా పేరుతోబాటు ప్రేమ చరిత్రకూడ పెనవేసుకొని వుంది మలకీ యౌవ్వనపు ఆత్మతో కైమా చారిత్రాత్మక రూపంకూడ ఇమిడి వుంది. ఆమెను ఎవరో మంత్ర తంత్రాలతో మైమరపించినట్లుంది. రాంయూ పెరిగి పెద్దవాడయిన ఆ అడవులు, అచ్చటి పచ్చికతో నిండి పచ్చని మైదానాలను గూర్చి ఆమె తియ్యని కలలు కంటోంది. కైమా రాంయూయంతటి స్ఫురద్రూపి కాడు. అయినా గుణ గణాల్లో అతనికి తీసిపోడు. అతను సద్గుణ సంపన్నుడు, దృఢ సంకల్పం కల వాడని తల్లి ఆమెకు చెప్పింది.

గోందలాఁకు తఖ్త హజారాలో తన కుమార్తెకు వివాహం చేయటంవల్ల అనేక లాభాలు కనబడ్డాయి. లాలో ఆమె సోదరి ఇరువురికి రక్తసంబంధం వుంది. తనకుమార్తె తనకెంతో లాలోకుకూడ మలకీ కుమార్తెతో సమానమే. కైమా లాలోకు కొడుకు అయినట్లే గోందలాఁకు కూడ కొడుకుతో సమానమే. రక్తం రక్తమే నీళ్ళు నీళ్ళే

కాని దరీయా రక్తాన్ని నీళ్ళుగాను, నీళ్ళను రక్తంగాను మార్చడానికి సిద్ధ పడ్డాడు తెల్లవారేసరికి ఈ విషయం కుటుంబమంతటికీ, పొక్కిపోయింది.

దరీయా తన సోదరుని కుమార్తె మలకీని అక్బరు చక్రవర్తికిచ్చి పాణి గ్రహణం చేయ సంకల్పించాడు. ముసలి చక్రవర్తి మలకీ మిసమిసలాడే యౌవ్వనం నిగనిగలాడే సౌందర్యాన్ని గూర్చి విని పరమానందభరితుడై దరీయాను ఘనంగా సన్మానిస్తాడు; కంటికి రెప్పగా గౌరవిస్తాడు అంతేకాదు, చక్రవర్తి దరీయా బంధువర్గంవారంతా రాజపుత్రులైనా వారిపై ఈగనైనా వాలనీయక కాపాడుతాడు, దరీయా సుబేదారు పదవినుంచి ఒక్కసారిగా జనరల్ పదవిని పొందగలడు. అతను అక్బరు చక్రవర్తికి వియ్యంకుడవుతాడు. ఎంతటివాడైనా తన వియ్యంకుణ్ణి తనకంటె తక్కువ స్థానంలో ఎలా వుంచగలుగుతాడు దరీయా ఇలా గాలిమేడలు కడుతూ జనరల్ పదవికి చేరినట్లుగా కలలుకంటూ వ్యవహరిస్తు న్నాడు. ఈ విషయం అక్బరు చక్రవర్తికి కూడ తోచియుండకపోవచ్చు. కాని దరీయా చక్రవర్తి బలహీనతను బాగా అవగాహన చేసికొన్న మనిషి తన అన్న రాయ్ ముబారక్ అంగీకరించాడంటే దరీయాకు రాజదర్బారు తలుపులన్నీ తెరుచు

కొన్నట్లే నిన్న మొన్నటి విషయం చక్రవర్తి ఆదేశాన్ని మన్నించని కారణంగా సలీమ్‌ను హృదయపూర్వకంగా ప్రేమించిన అనార్కలీని నిలువునా చంపించాడు. తన అన్న కుమార్తె (మేనకోడలు) ఏ అనార్కలికి తీసిపోదని దరీయాకు పూర్తి విశ్వాసం.

దరీయా యోచనలన్నీ మొగలానీ పరివారానికంతటికీ అర్థమైపోయాయి. భళ్ళున తెల్లవారేసరికి ఇంటిలో ప్రతి అంగుళంమేరకు ఈ విషంలాంటి విషయం వ్యాపించింది. ఉదయం ఈ విషప్రభావం, తల్లీ కుమార్తెలకు సోకింది. వారు కూడా విషాన్ని కక్కడం ప్రారంభించారు. గోందలా చేతుల్లో పెరిగిన దరీయా తన కుమార్తెపట్ల ఎంతటి స్వార్థంతో వ్యవహరిస్తున్నాడు! నిన్న మొన్నటివరకు పెద్దవదినె అన్నంపెడితే తినేవాడు నేడు రాజ దర్బారులో వున్నాననే దర్పం చూపిస్తున్నాడు అనుకుంది గోందలాం.

రెండవరోజు ఉదయం దరీయా ఢిల్లీకి బయలుదేరాడు. కాని ఎవ్వరూ అతనికి ఆశీస్సులు పలకరేదు; నమస్కారాలు పెట్టలేదు. రాయ్ ముబారక్‌కు తనకంటె గొప్పవంశంతో బాంధవ్యం పొందడం ఇష్టంలేదు. గొప్పయింటివారు కోడళ్ళపై తమ ఐశ్వర్య, అధికారాల దర్పం ప్రదర్శిస్తారు. తన హోదాకూ అంతస్తుకు సరిపోయే జమీందారులకు లోటురేదు. పువ్వుల్లో పెంచి పెద్దదాన్ని చేసిన కుమార్తెను కంటితో చూసుకోవడానికి నోచుకోలేని స్థితిని ఎందుకు కలిగించుకోవాలి? కంటికి ఎందుకు దూరంచేసుకోవాలి? వేలాది మైళ్ళ దూరంగా వున్న వరునకిచ్చి పెండ్లిచేస్తే ఆ కుమార్తె బ్రతికినా చచ్చినా సమానమే. కష్టకాలంలో ఆదుకొనలేని కొడుకులూ, కుమార్తెలూ ఉంటేనేం? లేకుంటేనేం? రెండూ ఒక్కటే అనుకున్నాడు రాయ్ ముబారక్.

కాని, దరీయా కేవలం తన సుఖాన్నే చూసికొన్నాడు. రాయ్ ముబారక్ ప్రతికూల సమాధానం అతణ్ణి నిలువునా నీరు చేసింది. అతని ఆశలన్నీ మంట కలిశాయి. తాను జనరల్ కావడమటుంచి తన సుబేదార్ పదవినికూడ మంట కలిసి నట్లేనని అతననుకున్నాడు. ఉన్నత శిఖరాలనెక్కుతున్న దరీయాను ఎవ్వరో క్రిందికి ఒక్కసారిగా లాగివేసినట్లయింది. అతను భూమిపై నిలబడి కోపతాపంతో కంపించిపోతున్నాడు. దీనికి కక్ష సాధించకుండా ఉండలేను అని అతను మనస్సులో సంకల్పించుకున్నాడు.

కుటుంబంలో అంతఃకలహ మేర్పడింది. మలకీ చంచల మనసు చింతలో మునిగిపోయింది. జమీందారులైన సోదరులు పోరాడితే ఎవరిదో ఒకరి శిరస్సు తీయకుండా శాంతిగా నిద్రించలేరు. సోదరుల అంతఃకలహాంకంటె పెద్దకలహాం మరొకటి ఉండబోదు. ఇరువురూ ఒకరు మరొకరి రహస్యాలను ఎరిగి వుంటారు. దీనినే ఇంటిగుట్టు లంకకుచేటు అంటారు. రావణ విభీషణుల అంతఃకలహమే బంగారు లంకను బూడిదపాలు చేసింది.

మలకీ ఊయల ఊగాలని వెళ్ళితే ఆ ఊయలబల్లపై కాలుపెట్టడానికి మనస్సు వెనుకకు లాగేది. ఏదోవిధంగా మనస్సును కాదని ఉయ్యాలనెక్కితే రెండు, మూడు ఊపులు ఊగగానే వగర్పడం మొదలుపెట్టేది. తనతో కలసి ఊగే స్నేహితురాండ్రు గట్టిగా ఊయలను ఊపితే ఆమెహృదయం భీతావహం చెందేది. శతవృద్ధ అశ్వత్థ వృక్షపు మూలాన్నిసైతం తన ఊయల ఊపుతో ఉద్రూతలూగించే మలకీ ఈనాడు దాని ఆకులను చూసి భయం చెందుతోంది ప్రభుత్వపు నిరంకుశాధికారం ఆమె తల్లిదండ్రుల చేతులకు సంకెళ్ళు వేయగలదు. అటు కైమా తఖ్త హజారాలో హాయిగా కూర్చున్నాడు. కాని ఇటు మలకీ చింతలో మునిగి పిచ్చిదానిలా తయారయింది. ఉయ్యాలవేసిన రావిచెట్టు తాను వుంటున్న ఎత్తైన మేడ రెండూ తనను తరుముతున్నట్లు అనిపించింది. మనసే ఆనందం కోరనిచో ఇక శరీరంతో కలిగే లాభమేమిటి?

సదవకాశాన్ని చేయి జారనీయకుండా గోందలాఁ రాయ్ ముబారక్‌తో మలకీని కైమాకు యిచ్చి పెండ్లిచేసే విషయం ప్రస్తావించింది. తఖ్త హజారాకు చెందిన దులారా సమానమైన జమీందారు. తోడల్లుడు, వియ్యంకుడు కాగలహక్కు అతనికే వుంది. రాయ్ ముబారక్ మరదలైనకూడ శాంతస్వభావం గలది. వారికి వీరికీ మధ్య రాకపోకలు బహు తక్కువగానున్నా రాయ్ ముబారక్‌కు తఖ్త హజారా వారంటే సదభిప్రాయం వుంది. ఒకసారి ముబారక్ దులారావేటకు వెళ్ళగా పరస్పరం ఆత్మీయతతో ఎంతగానో గౌరవించుకున్నారు. ఇరువురి మనస్సులు ఒకటిగా పనిచేశాయి. అన్నం ఉడికిందా, లేదా తెలుసుకోవడానికి బియ్యమంతా పట్టి చూడనక్కరలేదన్నట్లు మనిషి గుణం కొద్ది క్షణాల్లో గుర్తించవచ్చు. రాయ్ ముబారక్‌కు ఈ సంబంధం విషయమే గుర్తులేదు. నిజంగా జ్ఞాపకముంటే దరీయాపట్ల ఇంత కృతజ్ఞతగా వ్యవహరించవలసిన పనేముంది? ధులారా కొడుకుకు మలకీనిచ్చి పెండ్లిచేస్తే ఆ పిల్ల హాయిగా ఉంటుంది; సోదరుల

మధ్య అసూయా ద్వేషాలు ఆవేశ కావేశాలు; కలహాలు ఉండబోవు. ఒక్క
దెబ్బకు రెండుపిట్టలన్నట్లయింది. అతనికి తనపైనే కోపం వచ్చింది. ఈ
విషయం ఇదివరకే తన భర్తకు ఎందుకు చెప్పలేక పోయానాయని గోందలాం
ఎంతో బాధపడింది. ఆమె తన సోదరి లాలోకు ఎప్పుడో ఈ విషయంలో మాట
యిచ్చాను అనే విషయాన్ని రాయ్ ముబారక్ భయంతో ఇప్పటికీ మనస్సులో దాచి
వుంచింది

కైమాతో సంబంధ విషయం ప్రస్తావనకు రాగానే కుటుంబంలోని వారంతా
పరమానందభరితులయ్యారు ఇద్దరివీ సమానమైన కుటుంబాలు, సమాన హోదాలు
సమాన అంతస్తులు కలిగి వున్నాయి. అపనమ్మకం అనే పడగాడ్పుకు బదులు
నమ్మకమనే చల్లని గాలి వీచింది

మలకీ మనస్సులో దినదిన ప్రవర్ధమానమై కైమా సుందరరూపం స్పష్టంగా
గోచరించింది కైమా ఆమె మనస్సులో స్థిరపడే కొలది మలకీకి రాజాధిరాజు
అక్బరుచక్రవర్తిపట్ల కోపం పెచ్చుపెరుగుతోంది. దరీయా నిర్ణయమంతా ఏకపక్ష
నిర్ణయం అదిఅంతా అతని మానసిక ఊహాగానం. కాని వృద్ధచక్రవర్తితో
తనపేరు ఒక్కక్షణం జోడించి చెప్పినా మలకీకి సుతరామూ ఇష్టంలేదు. ఇంతకూ
ఆమెకు చక్రవర్తితోగాని చక్రవర్తికి ఆమెతోగాని సంబంధమేమిటి? రెండు
చిత్రాలు ఆమె కళ్ళఎదుట తిరుగాడసాగాయి. ఒకటి సౌందర్యదేవత కైమా రెండ
వది వృద్ధ అక్బరు చక్రవర్తి.

కైమాతో వివాహ సంబంధం నిశ్చయం చేసికొన్నాక మలకీ అసమాన
సౌందర్యంగూర్చి తఖ్త బజారాలోకూడ వేనోళ్ళ చెప్పుకోసాగారు ముగలాసీ
దుర్గపు సౌందర్యరాశిని చేజిక్కించుకొనాలనే సరదా కైమా మనస్సులో రోజు రోజూ
పెరుగుతూవుంది. కైమాకు అతని పరివారంలోని వారికి రాయ్ ముబారక్ తన
కుమార్తె వివాహసంబంధం ఎవరినుంచి తప్పించి ఎక్కడ నిర్ణయించాడు అన్న
విషయం పూర్తిగా తెలిసింది. అక్బరు చక్రవర్తికి సమాన స్థాయిలో తనను
గుర్తించినందుకు కైమా ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. కాని ఆ మూడుముళ్ళు పడే
వరకు అతని మనస్సుకు శాంతిలేదు. పెళ్ళికాకముందు అతను మలకీ తల్లిదండ్రుల
అంగీకారం కొరకు ఎదురు చూశాడు. రాయ్ ముబారక్ అంగీకారానికి దరీయా
నిర్ణయం అడ్డు తగులుతోంది. దరీయా నిర్ణయం సాధారణ నిర్ణయం కాదు. దాని

వెనుక అక్బరు చక్రవర్తి ప్రతిష్ఠ ప్రభుత్వపు ఒత్తిడి. రెండూ ఇమిడి వున్నాయి రెక్కాలంటే ఎగిరి మలకీని కలుసుకోవాలనుకున్నాడు. కాని సాంఘిక ఆచార వ్యవహారాలు, నియమాలకు కట్టుబడినవాడవటంవల్ల చొరవ చేయలేకపోయాడు.

ఎగిరి వెళ్ళడం అనేది ఏమంత తేలికపని కాదు. రెండు గ్రామాలమధ్య రెండునదుల దూరం వుంది. తఖ్త హజారా జీలమ్‌నదీ తీరంలో వుంది ముగ్ లానా దుర్గం సింధునదీ తీరంలో వుంది.

ఇరువురి తల్లిదండ్రులకు దరీయాపై నమ్మకంలేదు. ఇరుపక్షాలు ఈ విషయాన్ని అతిగా పొడిగించడానికి సుముఖంగా లేరు. దులారా, రాయ్ ముబారక్ ఇరుపక్షాలమధ్య రాకపోకలు పెరిగాయి. వారిరువురు మళ్ళీ కలసి వేటకు వెళ్ళాలనే కలలు కంటున్నారు. జీలమ్‌నదినుంచి సింధునదివరకు గల భూభాగం వారి అధీనంలోనికి రానున్నది. వారు కోరినట్లు ఎక్కడికైనా వెళ్ళగలరు. ఇరువురికి రెండు నదులమధ్య వున్న సింహాలు, పెద్దపులులు లేళ్ళు, దుప్పులు, కౌజుపిట్టలు, నీటి కోళ్ళు, సీమకోళ్ళు మొదలయినవన్నీ తమ సొంత సంపదగా తోచాయి వారు తమ వేటకుక్కలు అడవి లేళ్ళ వెనుక ఉరకలిడుతున్నట్లు ఊహిస్తున్నారు:

రాయ్ ముబారక్ పెళ్ళి శుభముహూర్తం నిర్ణయించారు

"మీరు నామాట మన్నిస్తానంటే ఈ పెళ్ళికి దరీయాను పిలవకపోవడమే ఎంతో మంచిది" అని గోందలాం భర్తకు సలహానిచ్చింది.

ఎంతమాట! అలా చేయడం మంచిదికాదు! ఎంత అనుకున్నా సోదరుడు సోదరుడే సుమా. దరీయా, ఇక ఏమి చేయగలడు? ఏమి అనగలడు? ఏదో తొందరపడి దురాశలోపడి ఏదో చేయాలనుకున్నాడు. అయినదేదో అయింది ఇక అతను చేసేదేమీ లేదు అని రాయ్ ముబారక్ భార్యకు నచ్చజెప్పాడు.

"దురాశాపరుడైన మనిషిని నమ్మడం సాధ్యంకాదు. అయినా అది మీకు నచ్చితే..................గోందలాం ఆ విషయం భర్తకు వదలిపెట్టింది. ఇరువురు కుమారులు తండ్రియిష్టమే తమ యిష్టమన్నారు. ఎవ్వరిపైనా ఒత్తిడితేవడం మంచిది కాదనుకున్నారు వారికొక విధంగా దరీయా అంటే భయం. దరీయాకు ఆహ్వానం పంపించారు.

పెళ్ళి ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఇటు మలకీ యింటికి సున్నాలు, అలుకులు జరిగాయి. అటు కైమాయింటకూడ హడావిడిగానే వుంది. అశ్వశాలల్లోని

గుత్తాలను చక్కగా అలంకరిస్తున్నారు. ఇటు మలకీ గుండె కొట్టుకొంటోంది. అటు కైమా గుండెల్లో బితుకు బితుకు మంటోంది.

పెళ్ళినాటికి దరీయా రానేవచ్చాడు. అతను కంచరగాడిదలపై ద్రాక్ష సారాయీలను వేసికొని వచ్చాడు. అతనివద్ద ప్రభుత్వపు మందుగుండు సామాను, చక్కని తివాసీలు వున్నాయి. అతని ముఖంలో గతించిన విషయాల ప్రభావం ఎక్కడా కనబడ్డంలేదు. కూతురు అంటే అందరికీ కూతురే. కుమార్తెపట్ల దోషం చేసినవాడు నరకానికి పోతాడు.

పెళ్ళిరాత్రి ముగలానా దుర్గంలోని రాయ్ ముబారక్ యింట పెండ్లివారు మద్య, పానీయాలను ముమ్మరంగా వాడుతున్నారు. పెద్దలంతా భవనాల్లో మదిరను సేవిస్తున్నారు. యువతులంతా నూతన బావగారిని ఇంటిలో చుట్టుముట్టి కూర్చున్నారు; పాటలు పాడుతున్నారు; అత్తగారు అల్లుణ్ణి బాగా లడ్డూలను తినమని బలవంతం చేస్తూంది. మరదళ్ళు బావగారిని వ్యంగ్య పరిహాసాలతో ముంచెత్తుతున్నారు.

పెళ్ళి జరిగిపోయింది. కైమా మలకీ ఒకరు మరొకరి మనుషులయ్యారు. ఎవ్వరికీ ఏవిధమైన భయంలేదు; సందేహం అంతకంటేలేదు. దరీయా ద్రాక్ష సారాయి తెచ్చిన కారణంగా ఇరుపక్షాల పెళ్ళివారికి పెద్దమనిషిగా వ్యవహరిస్తున్నాడు. అతను త్రాగించేవాడు, మిగిలినవారంతా త్రాగేవారు. రాయ్ ముబారక్ తన భవనంలో సీసాపై సీసా మత్తుగా త్రాగుతున్నాడు. పెళ్ళిపందిరిలో వివాహానికి సంబంధించిన పంజాబీ జానపద నృత్యాలు జరుగుతున్నాయి. రకరకాల వాయిద్యాలు వినసొంపుగా వాయించబడుతున్నాయి.

కైమా మరదళ్ళ బారినుంచి తప్పించుకొని భవంతిలోనికి రావడమే తడవుగా అతను ఒక్కొక్కటిగా ఎన్నో పానపాత్రల సారాయిని గటగటా త్రాగాడు. కొంత పెళ్ళి సరదా మరికొంత పెండ్లి అలసట! ముఖంపైనున్న మేలిముసుగునుంచి మలకీ ముఖారవిందం కాస్త కనబడింది. ఆ సౌందర్యపు మత్తుకూడ తక్కువైనది కాదు. కొద్ది క్షణాల్లో కైమాకూడ అందరితో కలసిపోయాడు. కొంత సేపటికి అందరూ మత్తులో ఒళ్ళుతెలియక వెల్లకిల పడిపోయారు. ఇక పెండ్లివారులేదు గిళ్ళివారులేదు! ఇక మత్తుకు దొరకని మనిషి దరీయా మాత్రమే. అతను మొదట్లో సారాయి త్రాగేవాడుకాదు. ఒకవేళ తప్పనిసరిగా త్రాగవలసివస్తే త్రాగేది తక్కువ తొణికిసలాడించేది ఎక్కువ! పారబోసేది మరీ ఎక్కువ!!

అంతా గమనించి దరీయా, రాయ్ ముబారక్, రాహూన్, మహరూన్, దులారా, కైమాలను ఖైదు చేశాడు. గ్రామం వెలుపల అతను సైనికుల్ని దాచి వుంచాడు. దరీయా ఆదేశం లభించడమే తడవుగా సైనికులు వచ్చి వీరి అయిదు గురిని బంధించి తీసికొని పోయారు. పాపం! ఖైదీలకు మత్తు విడలేదు. ఇతర పెండ్లివారికి స్పృహరాలేదు.

విజేతయైన దరీయా ఢిల్లీకి బయలుదేరాడు.

మరుసటిరోజు ఉదయానికి అందరూ కళ్ళు తెరిచారు. ఒక్కరాత్రిలో జానపద నృత్యాల కోలాహలం, పాన పాత్రల కళపెళలు, రంగు రంగుల మందు గుండు ధగదగ కాంతుల్లో ఎంతమోసం జరిగిపోయింది అనుకొని విస్తుపోయారు. గ్రామంపెద్ద రాయ్ ముబారక్ వరుడు, వరుడితండ్రి, వధువు అన్నలనుకూడ బంధించివేశారు. ఎవరు ఏం చేయాలి? ఎక్కడికి వెళ్ళాలి? అన్నది ఎవరికీ తోచడంలేదు. దుందుడుకుగా చొరవచేసేవారిని అదుపులో పెట్టేవారు లేరు. చక్రవర్తి ఏమి చేస్తాడోయని భీతావహం! రాజ నిరంకుశత్వం ఏమి అపాయం తెచ్చిపెడుతుందోనని సందేహం!! ప్రతి మనిషి జరిగిన అవమానాన్ని దిగమ్రింగ డమే మంచిదనుకున్నాడు. ముగలానా దుర్గంలోని ఎవ్వడూ ఇదివరకు ఇంతటి అవమానాన్ని సిగ్గులేకుండా సహించి ఎరుగడు. ఊరంతా మూగవోయింది. తఖ్త హజారానుంచి వచ్చినవారిలో ఏకొద్దిమందో ఉద్రేకపడినా ఏమీచేయగలరు? దరీయా ఇంతపెద్ద సైన్యాన్ని తెచ్చి రహస్యంగా దాచాడని ఎవరికీ తెలీదు.

గోందలాం భోరుభోరున ఏడుస్తూ నెత్తి కొట్టుకొంటున్నది, జుట్టు పీక్కొం టుంది. మలకీ దుఃఖానికి అంతులేదు; ఆమె ఆర్తనాదం వినే ప్రీలేదు. అయినా జరిగే ఏడ్పు మొరలు, ఆర్తనాదం అందరూ వింటూనేవున్నారు. అందరూ జరిగే అత్యాచారాల్ని చూస్తూనే వున్నారు. కాని, లాభం! అంతా నిర్వీర్యం. నిస్స హాయం!! ఊరందరూ, పెళ్ళివారంతా కళ్ళప్పజెప్పి వెలవెలబోతున్నారు.

కైమా వెళ్ళేటప్పుడు మలకీ అతని ముఖాన్నైనా చూసి ఎరగదు. భర్త బ్రతికి వుండగానే ఆమెకు వైధవ్యం వచ్చినట్లనిపించింది.

కాని మలకీ సంకల్పం రాతిమీద గీతలాంటిది. ఆమె కైమా భార్య అయి పోయింది. ఇక ఏపురుషుడు ఆమెను కైమానుండి వేరుచేయలేడు. ఆమె దరీ యాను గాని, దరీయాయొక్క చక్రవర్తినికాని ఏమని తలచగలదు! బాహుబలంతో

జరుగనిపని బుద్ధిబలంతో జరుగుతుంది. ఆమె సన్యాసినిగా వేషం ధరించి కైమాను వెతకటానికై బయలుదేరింది. తన ప్రియుణ్ణి కలుసుకునేందుకు ఇక రాంఝావలె భిక్షాపాత్రను చేత ధరించింది. ఇంటినుంచి బయలుదేరేముందు తల్లికైనా తన విషయం చెప్పలేదు. తల్లి కొండలు గుట్టల మార్గంగుండా తన కూతుర్ని వెళ్ళనివ్వదని ఆమె భయం. మలకీ సంకల్పం వజ్ర సంకల్పం; అది తిరుగులేనిది.

దరీయా సైనికబలం ఎంతో పెద్దది. సంకెళ్ళతో బంధించినప్పటికి, ఒక్కొక్క ఖైదీవెంట ముగ్గురు సైనికులు నడుస్తున్నారు. ఈ వార్త దారిన వచ్చే బాటసారులవల్ల మలకీకి తెలిసింది. మలకీ తండ్రి, సోదరులు, సింహాల్లాంటి పౌరుష ముఖాకృతులు కైమా మనోహర సౌందర్యరూపం ప్రతి బాటసారి హృదయంలో చెరగని ముద్రవేసికొన్నాయి. మలకీకి తన మనుష్యులంతా సజీవంగా వున్నారనే ఊరట కలిగింది. దుఃఖం శాశ్వతం కాదు అది ఏదో ఒక రోజున వస్తుంది మరుసటిరోజున పోతుంది.

మలకీ మడుమలు అరికాళ్ళు పగిలిపోయాయి. ఆమె వందలాది క్రోసుల దూరం కాలి నడకనే ప్రయాణం చేయాలని సంకల్పించుకొంది మాటి మాటికి దారి తెలిసికొనవలసిన పనిలేదు. అక్కడక్కడ మైలురాళ్ళు ఉన్నాయి. ప్రతి రెండు మైళ్ళకు ఒకనుయ్యి వుంది; మార్గం రెండు వైపులా చెట్లున్నాయి. ప్రతి రాత్రి యాత్రికులు బసచేయటానికై సత్రాలు ఉన్నాయి. చెట్లనీడ తక్కువగా వున్నచోట పగిలిన కాళ్ళు వేడినేలపై మాడిపోతున్నాయి. ఆమె బాధను తట్టుకొనలేక మార్గం ప్రక్కన మొలచిన పచ్చని పచ్చికపై నిలబడి ఊరట చెందేది. కాళ్ళకు కొంత విశ్రాంతి లభించగానే మళ్ళీ ఆమె యాత్ర సాగించేది. ఒక్కొక్క చోట తిండి దొరికేది. ఇంకోచోట అది దొరికేదికాదు. ఘోర నిరాశా నిబిడాంధకారంలో ఆమెకు ఆశాజ్యోతి తన ప్రియుడు సజీవంగా బ్రతికియుండడం. అయినా, దరీయా నమ్మకమేమిటి? ఎక్కడైనా ఎప్పుడైనా చంపి పారవేయవచ్చు. ఒకప్పుడామె తనముందు సాగివెళ్ళే సైనికదళంతో కలసి నడిచేది మరొకప్పుడు వారికి వెనుకబడిపోయేది ఒకటి రెండుసార్లు ఆమె బందీగానున్న కైమాను దొంగ చాటుగా చూసింది అతను ఎంతో నిస్సహాయుడు. అదే స్థితిలో మలకీ తండ్రి ఆమె సోదరులు కనబడ్డారు.

మలకీ చేసిన ఈ యాత్ర మక్కాయాత్రను మించిన యాత్ర. మక్కా

యాత్రికులకు తమ ఆశలు ఫలించే అవకాశం వుంది. కాని మలకీకి అట్టి ఆశ ఏమీలేదు.

ఎన్నో మజిలీలు దాటి ఆదళం కురుక్షేత్రంవద్ద థానేసర్ చేరింది. మలకీ కూడ వారి వెనుకనే వెళ్ళసాగింది.

థానేసర్‌లో మలకీ ఒక భక్తురాలిని కలుసుకుంది. మలకీ ఆ భక్తురాలి ఆశ్రమంనుంచి విభూతి తీసుకోవడానికై వెళ్ళింది. మాటల ధోరణిలో భక్తురాలు మలకీ దుఃఖాన్ని గమనించింది. ఆమె విషాదగాధ అంతా విని ఆమె మలకీకి నీవు అక్బరు చక్రవర్తి రాజపుత్రరాణి కుమార్తెయైన జమునను కలసికొనమని సలహా యిచ్చింది. రాజకుమారి తలచుకొన్నచో ఏపనియైన జరిగితీరుతుందని ఆ భక్తురాలి నమ్మకం.

మలకీ జమున భవనానికిభిక్షకై వెళ్ళింది. జమున ఆమె పునీత యౌవ్వనం· అసమాన సౌందర్యం చూసి ముగ్ధురాలయింది. ఈ వయస్సులో సన్యాసినిగా మారిన ఈ సౌందర్యవతి జీవితంలో ఏదో మహత్తర రహస్యముంటుందని తల ఛింది. ఆమె మలకీని తన భవనంలోనికి పిలిచింది. జమున అడిగినమీదట మలకీ తనతో క్షేమావివాహం ఆ తరువాత జరిగిన విషాద ఘట్టాన్ని అంతా చెప్పింది. జమునలో ఆమెకు ఏదో దైవరూపం గోచరించింది. తన తండ్రియైన దరీయా ఆమెను అక్బరు చక్రవర్తి అంతఃపురంలో విలాస వస్తువుగా వుంచి తత్ఫలితంగా అతను ఉన్నత పదవి సంపాదించాలని తలుస్తున్నాడనే విషయాన్ని కూడ దాచకుండా చెప్పివేసింది.

అంతఃపురానికి సంబంధించిన ఈ విషయం వినగానే జమున మండిపడింది. ఎవ్వడో మలకీని తన తల్లికి సవతిగా చేయాలనుకుంటున్నాడు. సవతి తల్లివల్ల కలిగే నరక బాధలు జమున అనుభవించింది: ఆమెకు తన తండ్రికి ముసలితనంలో గల కామాంధతను గూర్చికూడ బాగా తెలుసు. చక్రవర్తి ఆజ్ఞచే అనార్కలీని హత్యగావించడం ఆమె చూసింది. ఇంతకూ ఆమె చేసిన తప్పేమిటి? అనార్కలి ముసలి అక్బరును కాదని అతని కుమారుడైన సలీమ్‌ను ప్రేమించింది. అనార్కలిని నిండు ప్రాణాలతో బలిగొన్నవాడు మలకీ అంతఃపురంలో ప్రవేశించిన తర్వాత జమున తల్లిపట్ల ఎలాంటి దురంతాలు జరుపుతాడో ఎవరికెరుక! మలకీ చెప్పిన విషాదగాధను విన్న తరువాత తన తల్లి సన్యాసినియై భిక్షాటన చేసికొంటున్నట్లు

తనతల్లిస్థానే మలకీ రాజదర్బారుకు రాణియైనట్లు ఆమెకళ్ళయెదుట ఊహాచిత్రం గోచరించింది మలకీని చూసిన తరువాత ఆమె తనతల్లికి ద్రోహంచేస్తుందనే నమ్మకం కలగలేదు అయినా చేసేదంతా స్వయంగా చక్రవర్తియేగదా!

రాజకుమారి జమున ఒకందుకు ధైర్యంగాఉంది. అదేమంటే అక్బరుకు యింతవరకు దరీయాచేసే కుతంత్రాలు తెలియవు. కాని అతను రాజసైన్యం తీసికొని విద్రోహులను అణచివేసేందుకై వెళ్ళినాడని చక్రవర్తికి తెలుసు. తమసోదరి నిరుపమాన సౌందర్యవతియని ఈవిషయం అక్బరు చక్రవర్తికి తెలిస్తే అతను మలకీనికూడా బంధించి వెంటబెట్టుకొని తీసికొనిరావడానికి ఆజ్ఞఇచ్చి వుండేవాడనే భయంతో వారు తిరుగుబాటుదారులుగా మారియుండవచ్చు. దరీయా మలకీని బలి పెట్టటంలో కాలయాపనచేశాడు. మొదట తిరుగుబాటుదారులను చక్రవర్తిముందు ఉంచి దానికి బదులుగా ఒకపదవిని సంపాదించాలని అనంతరం మలకీని చక్రవర్తి అంతఃపురంలో ప్రవేశపెట్టి రెండవ పదవినిపొందవచ్చుననే ఉద్దేశ్యంతో దరీయా ఇలాచేస్తూ ఉండవచ్చు. అట్టిదుస్థితి రావాలని రాజకుమారి జమున అనుకొనుట లేదు. ఆమె దరీయాను పిలిపించి నిరపరాధులైన ఖైదీలను విడుదలచేసి వారివారి ఇళ్ళకు వారిని పంపవేయమని ఆజ్ఞయిచ్చింది.

రాజకుమారి ఆజ్ఞవిని దరీయా తన నివాసానికి వెళ్ళిపోయాడు. విద్రోహుల విషయంలో రాజకుమారి ఆజ్ఞను మన్నించవలసిన అవసరం లేదని అతనికి దోంలో తట్టింది. చక్రవర్తి తనకుమార్తెకు నచ్చచెప్పగలడను కున్నాడు. అతను అదే రాత్రి ఖైదీలను ముందుకుతీసికొని పోవడానికి నిర్ణయించాడు.

రాజకుమారి జమున మలకీతో స్నేహంపెంచుకుంది. ఆమె మలకీ సనాట్య పిసీ బట్టలను తీసివేయించి ఆమెకు రాజదుస్తులు కట్టబెట్టింది. వారిరువురిమధ్య రాత్రంతా అక్బర్ న్యాయాన్ని గురించి చర్చజరిగింది. మలకీమనస్సు ఆమాట లనేందుకు బదులు నిరంతరం కైమావైపే ఆమె ఆలోచనలు పరుగెత్తసాగాయి ఉదయమే సైనికులు కైమాను తమ వెంట తీసుకొని యిక్కడకు రావాలని ఉంది

తెల్లవారింది. రాజభటుడు తలుపుకొట్టాడు. మలకీ కైమాను కలసికొనాలని పరుగెత్తుకు వచ్చింది. కాని, అక్కడ అతను కనబడలేదు. దరీయా రాత్రికి రాత్రే కైమాని, అతని అనుచరులను ఎక్కడికో తీసికొని పోయాడని ఆభటుడు చెప్పాడు. దర్బారులో వున్న ఒక సుబేదారుకు యింతటి సాహసమా ? ఇక రాజకుమారి కోపానికి అంతంలేదు. ఆమె కళ్ళనుంచి నిప్పురవ్వలు రాలుతున్నాయి. భటుడు నిలబడి గడగడ వణకిపోతున్నాడు

జమునఢిల్లీవెళ్ళడానికి సిద్ధపడింది, ఆమెమలకీని తనవెంటతీసుకొన్నది. ముసలిరాజుకు ఈ విషయాన్ని గూర్చి ఎలా చెప్పాలి-అని దారిపొడుగునా ఆమె ఆలోచిస్తూనేఉంది.

ఢిల్లీ చేరిన మలకీకి చక్రవర్తి ఎదుటకు వెళ్ళడానికి తనగాధ చెప్పుకోవ డానికి అనుమతిలేదు. ఆపని రాజకుమారి జమున చేతిలోవుంది. అది ఆమె గౌరవ ప్రతిష్ఠలకు సంబంధించిన ప్రశ్నగా తయారైంది.

అందరికంటె ముందు రాజకుమారి తనతల్లిని కలుసుకుంది. ఏదో ఒకనాడు తన తల్లికి సవతిగా వున్న యువతిని కూడా చూపించింది. దరీయా కుతంత్రాలన్ని పూసగ్రుచ్చినట్లు తల్లికిజెప్పింది. తల్లీ-కూతురు చక్రవర్తికి మలకీ విషయం తెలియ జేయకుండానే దరీయాను అంతం చేయాలని నిశ్చయించుకొన్నారు.

వృద్ధమాత హృదయం కోపాగ్నితో మండిపోతోంది. చక్రవర్తి ఉదార ప్రవర్తన, న్యాయ ప్రియతవల్ల ఆమెకు అనేక సుఖాలు లభించాయి. అంతకంటె మిన్నగా దుఃఖాలు కూడ అనుభవించింది. ఏదో యువతిపై మోహితుడైన చక్ర వర్తి రాత్రంతా ఎక్కడనో గడపి అవసరమైన పనులున్నాయనే నెపంతో మరునాడు అంతఃపురానికి తిరిగి వచ్చేవాడు అనే విషయం వారు మరచి పోలేదు. అంతఃపురా నికి రాని రాత్రులందు - ఆయన ఎక్కడ గడిపేవాడో వారికి బాగా తెలుసు. ఆమె ముసలిదైనప్పటినుంచి చక్రవర్తి యొక్క పిచ్చిచేష్టలు పెరుగుతున్నాయని ఆమె నమ్మకం. ఇక రాణి తన దుఃఖాన్ని పెంచుకోదలచలేదు. ఆమెకు సవతి కానున్న యువతి ఆమె ముందే కూర్చుని ఉంది. ఆ అమ్మాయి వయస్సులో తన కుమార్తె కంటె చిన్నది. రాణికి దరీయా విషసర్పంలా కనబడుతున్నాడు. ఆమె దరీయా అనే విషసర్పాన్ని మొదలంటా నాశనం చేయడానికి నిర్ణయించుకొంది. చక్రవర్తి భవనం లోకి వచ్చే సమయం అయ్యింది. రాణి ఆదేశానుసారం అంతఃపురంలోని దీపా లన్ని ఆర్పివేయబడ్డాయి. దీప పాత్రలు పగులగొట్ట బడ్డాయి. రాణి తన అలం కరణ సామాగ్రినంతా తీసి పారవేసింది. చక్రవర్తి వచ్చేసరికి రాణి కోపంతో అలిగి జగడమాడడానికై పడుకునివుంది.

అదిచూసి అక్బర్ ఎంతో వ్యధచెందాడు. ఈరోజు రాణికి కష్టం కలిగించే పనియేదీ తాను చేయలేదని అతనికి తెలుసు. తన వైవాహిక జీవితంలో నేడు రాణి కోపగించడం మొదటిసారిగా చూశాడు. ఈరోజు వరకు అతను ఎన్నడూ ఏ విధమైన కోపానికి ఆమెను గురిచేయలేదు. ఈనాడు రాణికి బాధకలిగించే విషయం ఏమి జరిగింది? అని అతను ఖంగారు పడ్డాడు.

చక్రవర్తి తన రాణి ముందు శిరస్సు వంచాడు. - ఆ అవకాశాన్ని పురస్క రించుకొని రాణి రాయ్‌ముబారక్. అతని సహచరులను వదిలివేయ వలసిందిగా కోరింది. తిరుగుబాటు దారులను విడిచిపెట్టడంలో చక్రవర్తి ఒక్కని చేతిలో అధికారంలేదు. అట్టి తీర్పు దివాను సజా మాత్రమే చెప్పగలడు. తిరుగుబాటు దారులు గూఢచారులు దేశానికి శత్రువులు. విద్రోహుల్ని విడిచిపెట్టాలంటే దానికి

తగ్గ కారణాలు బలీయంగా వుండాలి రాణివద్ద అట్టి ఋజువు సాక్ష్యలేమీలేవు. దరీయా తన అన్న విద్రోహియని అనగలుగుతున్నాడంటే దాన్ని కాదని ఎట్లా ఋజువు చేయగలము ?

సమస్య అతి జటిలంగా తయారైంది అక్బర్ న్యాయప్రియత ప్రఖ్యాతి చెందింది కారణం లేకుండా ఎవరినైనా ఉరిశిక్ష విధించాలనే ఆజ్ఞ చక్రవర్తి ఎలా యివ్వగలడు? దరీయా మలకీని చక్రవర్తి భవనంలో చేర్పించే కారణం చూడ మంటే తనకాళ్ళపై తానే గొడ్డలిపెట్టు పెట్టుకొన్నట్లే తన చేతులతో తనకళ్ళు పొడుచుకున్నట్లుంటుంది. అక్బరు మలకీని చూస్తే ఆమెపై సమ్మోహితుడు కావచ్చు

రాణి తన దుఃఖ గాధను తన సోదరుడైన వీర బలునకు చెప్పింది. వీర బలుడు పరిష్కరించని సమస్య ఏముంది? జాటు జాతి జమిందారులలో పరస్పరం అన్నదమ్ములను హత్యజేసే పరిపాటి సర్వసాధారణ మైనట్టిదని ఆమెకు నచ్చ జెప్పాడు. తన అన్న రాయ్ ముబారక్‌ను విద్రోహిగా ఋజువు చేయడానికి దరీయా ఎత్తుగడ యిదే అయి వుండవచ్చు - రాయ్‌ముబారక్ అతని వారసుల మరణానంతరం వారి ఆస్తి పాస్తులు గ్రామాధికారం దరీయాకే లభించవలసి ఉంది ఇంత నీచపు ఆలోచనలు గల దరీయాకు ఉరిశిక్ష విధించడం ఎంత అవసరమో కైమా అతని సహచరులను విడుదల చేయడం కూడా అంతే అవసరం.

చక్రవర్తి యింతకు మించి మరొకకారణంతో పనిలేదు. అతను తాను తీర్పును స్పష్టంగా వినిపించాడు. దరీయాకు ఉరిశిక్ష విధించబడింది. ఉరికంబం ఎక్కేముందు అతని అంతిమకోర్కె అడిగారు. కాని దరీయా కోర్కెలన్నీ చచ్చిపోయాయి ఉన్నతపదవి, ప్రతీకారభావం, రెండూ కలసి అతని మనస్సులో తుఫాను రేకెత్తించాయి. ఇక అతను ఈలోకానికి దూరంకానున్నాడు. అతని అంతిమ కోర్కె మరేముంటుంది! అతను కైమా మలకీలను పిలిపించి, మలకీ చేతిలో కైమా చేతిని ఉంచాడు. ఇదిచూసిన రాయ్‌ముబారక్ కుటుంబంవారు కన్నీరు కార్చారు. దరీయా ఎంతో విలపించాడు. చివరకు అన్నగారిని క్షమార్పణ వేడుకుని ఉరికంబమెక్కాడు

ఆరాత్రి జమున నదీతీరంలో కైమా మలకీ యిరువురు పరస్పరం మొదటిసారిగా ఏకాంత ప్రదేశంలో నిండుహృదయాలతో కలసికొన్నారు చంద్రుని చల్లని వెన్నెల. ఏకాంత వాతావరణం. నిశ్చలంగాఉన్న నిండుజలరాశి దరీయా అంతిమ ఘడియలో పొందిన పశ్చాత్తాపం వారిరువురిని ఒకరి కొకర్ని మరింత సన్నిహితంగా చేశాయి కైమా మలకీని తన కౌగిటలోనికి తీసికొన్నాడు. మలకీ నేత్రాలనుంచి ఆనంద బాష్పాలు జల జలా రాలాయి.

---

Printed at Saraswati Art Printers 8247/2, New Anaj Mandi Delhi-6.